









# నాటకాలు

## భక్తి,జ్ఞాన,పురాణ,జానపద

## తారా రాఘవం







## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# విషయసూచిక

పేజి

# తొలిపలుకు

అది యౌవనం, వసంతంలా తొంగిచూస్తున్న సమయం. పద్య కవిత్వంతో రచనా వ్యాసంగం మొదలైన తరుణం. కవి సమ్రాట్టులు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి బాలకాండంలోని అహల్యాఘట్టానికి, రసార్ద్రతతో పులకరించిన, సాహితీ హృదయం. భావావేశంతో ఉరకలు వేసిన శుభకాలం. అహల్య పాత్రను కరుణార్ద్రంగా కమనీయంగా చిత్రించాలని తహతహపడిన కవితా హృదయం, కొన్ని పద్యాలను రచించడానికి పూనుకొంది. అది 1952లో ఒక రూపం దిద్దుకొని, కవితాఖండికగా 'విమోచన' అన్న శీర్షికతో వెలసింది. ఆ తర్వాత రామాయణంలోని స్త్రీ పాత్రలను – కైక, శబరి, తార, మండోదరి – పద్యకవితల్లో ఖండకావ్యంగా రూపొందిస్తామని ఒక ఆలోచన. కదిలింది మదిలో, కానీ అది అప్పట్లో కార్యరూపం దాల్చలేదు. తర్వాత 1960లో, 'విమోచన'లోని పద్యాలనే వాడుకొని, విమోచన అన్న పద్య నాటికను వ్రాసాను. అది మార్చి 1961లో ఆకాశవాణి, హైద్రాబాదు కేంద్రంద్వారా రేడియో నాటికగా, కీ. శే. శ్రీ స్థానం నరసింహారావు గారి దర్శకత్వంలో ప్రసారమైంది.

ఆ తర్వాత మహాకవి ధూర్జటి 'శ్రీకాళహస్తి మాహాత్మ్యంలోని, ప్రథమాశ్వాస మందుగల, నీలవేణి కథ నాకు నచ్చి, ఆ ధూర్జటికవి కథ, ఆధారంగా, 'నీలవేణి' అనే మరో పద్యనాటికను 1971లో వ్రాసాను. అది ఫిబ్రవరి, 1972లో, ఆకాశవాణి, విజయవాడ కేంద్రంనుండి రేడియో నాటికగా ప్రసారమైంది. ఈ నాటిక ఆ కేంద్రంనుండే పునః ప్రసారితమైందని విన్నాను.

మళ్ళీ నా తొలి ఆలోచనలు కదిలి, తార పాత్రను 'తారారాఘవం' అన్న పద్యనాటిక ద్వారా చిత్రించాను. ఈ పద్యనాటిక, ఏప్రిల్ 1981లో, ఆకాశవాణి, విజయవాడ కేంద్రం నుండి, రేడియో నాటికగా ప్రసారమైంది. భగవత్కృపవల్ల, తార పాత్రను సుమధురగాయని, కర్నాటక సంగీతధుని, కీ.శే. శ్రీమతి శ్రీరంగం గోపాలరత్నంగారు, అతి సమర్ధంగా, పోషించి నా పద్యాలను, సంభాషణలనీ, భావగర్భితంగా రసస్ఫోరకంగా, మృదుమధురంగా వారి అత్యద్భుత మధుర కంఠంతో వినిపించి, ఆ పాత్రకు, ఆ నాటికకీ జీవంపోసారు. ఇది నేను మరచి పోలేని ఒక మధురానుభూతి. ఈనాటిక కూడా రెండు మూడుసార్లు పునఃప్రసారమైందని విన్నాను. ఈ నాటికను, నేను రికార్డు చేసుకొని, అప్పుడప్పుడు వింటూ, ఆ మృదుమధుర గాయనికి, నా కృతజ్ఞతలర్పించుకొంటుంటాను

మనస్సులో. ఆ తర్వాత 'మండోదరి' పాత్రను, "మండోధరీ రావణం" అన్న పద్య నాటిక ద్వారా చిత్రించాను.

'గోపికావిరహం' అన్న పద్యనాటిక బమ్మెర పోతనామాత్యుని భాగవతంలోని దశమస్కంధం ఆధారంగా రచింపబడింది. 'విప్రసందేశం' అన్న గేయనాటిక, పోతనగారి 'రుక్మిణీకల్యాణం' ఆధారంగా రూపొందింపబడింది. 'కిన్నెరసాని' గేయనాటిక, మా గురువర్యులు కవిసమ్రాట్టులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారిపై నాకు గల భక్తి ప్రపత్తులకు నిదర్శనం. వారి రసమనోజ్ఞ గీతం 'కిన్నెరసాని' చదివి, దాన్నే గురువర్యులు స్వయంగా సభలలో పాడగా, విని, ఆనందించి, పరవశించిన నా కవితా హృదయం. ఈ సాహసానికి పూనుకొంది. అంతే! ఈగేయ నాటిక వారికే అంకితం. సహృదయంతో పాఠకులు నా యీ సాహసాన్ని మన్నించి, ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

రామాయణంలోని స్త్రీలపాత్రలనే పద్య నాటికలుగా చిత్రించాలన్న నా తొలి ఆలోచన క్రమంగా మారి, రామాయణగాథనే, సీతాదేవి ముఖతః, 'శ్రీ సీతామనోరామాయణము' అన్న పద్యకావ్యంగా రూపొందించాలనే కోరికగా మారింది. అది వేరేవిషయం.

ఈ నాటికల సంపుటిలో పైన చెప్పినవి గాక 'నిమిత్తమాత్రులు', 'పాదాభివందనం' అన్నవి కూడా చేర్చాను. ఈ రెండింటి వెనుక కొంత కథ ఉంది. అదికూడా చెప్తేగాని, వాటి నేపథ్యం, అవి నాటికలుగా నేను వ్రాయడానికి గల ప్రేరణ, దాని అనుబంధం అవీ స్పష్టపడదు. ఈ శాఖాచంక్రమణాన్ని రసజ్ఞులైన పాఠకులు మన్నించమని కోరుతున్నాను.

అవి నేను నెల్లూరులో బి.ఏ. చదివేరోజులు. ఒకదినం, తెల్లవారు జామున పెన్నానది ఒడ్డున వెళ్తుంటే, ఒక దాసరి తంబుర మీటుతూ తత్త్వాలు పాడుకుంటూ ఎదురైనాడు. ఆ తొలివెలుగుల వేకువలో, ఆ కమ్మని పెన్నమ్మ పిల్లతెమ్మెరలలో, ఆ పాట, నాకు ఆపాత మధురమైన, అద్వైత రసధుని అని అనిపించింది. అది నాహృదయానికి హత్తుకొంది. అంతే. అది కాల ప్రవాహంలో మరుగైంది. దాదాపు రెండు దశాబ్దాల తర్వాత టూరులో 'ఆచంట' గ్రామం వెళ్ళడం, అక్కడ శివుణ్ణి దర్శించటం జరిగింది. అక్కడి శివలింగ స్వరూపానికి ఒక కథ చెప్తారు. అది నిజమో, కాదోగాని, ఒకపరమ నైష్ఠికుడైన శివభక్తుని

పతనం, అతని విముక్తి – ఆ కథలో ప్రధానాంశాలు. ఈ రెండు స్మృతులు నాలో 'నిమిత్తమాత్రులు' అన్న పద్యనాటికకు ప్రేరేపణలు. ఇందులో కథ కేవలం కల్పితం. ఎవరినీ, ఉద్దేశించింది కాదు అని మనవి.

ఇక 'పాదాభివందనం' అమరావతీ శిథిల స్తూపాలలో, నేను తదేకదీక్షగా ఒక అరగంటపైన, విస్తుపోయి చూచిన, బౌద్ధభిక్షువుల శిల్పమే ఆ కథకు ఆధారం. ఆ స్త్రీమూర్తుల శిల్పాలు, ఊాతి రూపాలైనా, ఎదలు కరిగించే నాతుల కరుణార్ద్ర భావచిత్రీకరణ, ఆ ఆంధ్ర శిల్పుల మహత్తర కళానైపుణ్యం, నన్ను ముగ్ధుణ్ణి చేసాయి. ఆ స్పందనే ఈ పద్యనాటిక. ఇది కూడా కల్పితగాథ. 'సౌందరనందము' కథకు దీనికి ఏమీ సంబంధం లేదు. తథాగతుని కరుణావరుణాలయ తరంగ విన్యాస ప్రదర్శనమే ఈ నాటికకు పరమార్థం.

కవిత్వం నా సహజ ప్రవృత్తి, నాటకరచనలో నేను నిష్ణాతుణ్ణికాను. అయినా కొన్ని పద్యనాటికలు, గేయనాటికలు వ్రాసాను సరదాగా, వాటిలో కొన్ని ప్రదర్శనకు (రేడియో నాటికలుగా) నోచుకున్నవి. అంతే.

ఆంగ్లనాటక రచయితలలో 'బెర్నార్డుషా' నాకు చాలా బాగా నచ్చిన రచయిత. ఆయన నాటకాలలో, కేవలం సంభాషణలు కూడా – అవి సుదీర్ఘమైనాసరే – ఆపాత మధురమైన సంగీతంలా – ధ్వనిస్తుంటాయని విమర్శకులంటారు. 'షా' పై నాకున్న అభిమానం, నా నాటికలలో ఎంత వరకు తొంగిచూచిందన్న విషయం రసజ్ఞులైన పాఠకులే చెప్పాలి.

ఈ నాటికలన్నీ శ్రవ్యప్రధానంగా రచించినవి. దృశ్యప్రదర్శనకు కూడా అనుకూలిస్తాయని నా అభిప్రాయం. అది అనుభవజ్ఞులైన నాటక ప్రయోక్తలకు, భావుకులైన ప్రేక్షకులకు, శ్రోతలకే వదిలేస్తున్నాను.

ప్రియమిత్రులు, సాహితీ ప్రియులు, ప్రసిద్ధ కథారచయిత, రసజ్ఞులు, సహృదయులైన శ్రీ గిడుగు రాజేశ్వరరావుగారిని, ఈ పద్యగేయ నాటికల సంపుటికి పరిచయ వాక్యాలు వ్రాసి యిమ్మని కోరాను. ఆయన కథలేగాక, చక్కని కవిత్వం వ్రాస్తారు. రేడియోనాటికలు, స్వరమధురిమలతో గుబాళించే కమ్మని గేయాలు వ్రాసారు. నిశితసాహిత్యావలోకనం చేయగల భావుకులువారు. చక్కని అభిరుచీ, ఆకళింపు గల్గిన సంగీత పిపాసులువారు. అందుకనే వారిని ఈ సంపుటిని పాఠకలోకానికి పరిచయం చేయమని ప్రార్థించడం జరిగింది. నా

కోరికను మన్నించి, వారు వ్రాసియిచ్చిన "అవలోకన-ఆలోచన" కేవల పుస్తక పరిచయంగాగాక, వారి సహృదయతకు, భావుకతకు, రసజ్ఞతకు నిదర్శనమైంది. అందుకు వారికి నా ప్రత్యేక కృతజ్ఞతాభివందనాలు.

నా పద్యకవిత్వానికే (ఈ నాటిక అందులో అంతర్భాగం) స్ఫూర్తి నిచ్చిన, ఆప్తమిత్రులు, డాక్టర్ సాళ్వకృష్ణమూర్తి ఎమ్.ఎ., పి.హెచ్‌డి., గారిని ఈ సమయంలో నేను ప్రత్యేకంగా గుర్తుచేసుకొని, వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలియ చేసుకొంటున్నాను.

నా పద్యనాటికలను కొన్నింటిని ఆదరంతో స్వీకరించి, ప్రసారంచేసి, నా నాటకరచనా ప్రక్రియకు దోహదం చేసిన ఆకాశవాణి (హైదరాబాదు విజయవాడ కేంద్రాలు) వారికి నా హార్దిక కృతజ్ఞతలు. ఈ పుస్తకాన్ని అందంగా, సకాలంలో ముద్రించియిచ్చిన ప్లానోగ్రాఫర్స్ వారికి నా కృతజ్ఞతలు. ఈ పుస్తకానికి మనోహరంగా ముఖచిత్రం గీసిన ప్రముఖ చిత్రకారులు కవులు, సాహిత్యప్రియులైన శ్రీ శీలావీర్రాజు గారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు. నా రచనా వ్యాసంగాన్ని, అభిమానించి, ఆదరించే సహృదయులు, మిత్రులైన శ్రీచీకోలు సుందరయ్యగారికి నా హార్దిక కృతజ్ఞతలు.

ఈ నాటికలలోని మంచి, చెడులను, క్షీర నీర న్యాయంగా గ్రహించి, రసజ్ఞులైన పాఠకులు, నన్నాదరిస్తారని, ఆశిస్తూ సెలవు తీసుకొంటాను.

అక్టోబరు 1997 భవదీయుడు

హైదరాబాద్ **జి.వి.సుబ్బారావు.**

# అవలోకన - ఆలోచన

ఒక రోజున సుబ్బారావుగారు, నా,కో, పాత ఆడియో కాసెట్ వినిపించారు.

" - - - - సమీరకుమార, నిత్యసం
సేవిత దివ్యరూప! నుతశీలుని, వాలిని గూలనేసి - నా
జీవిత హర్మ్య మెల్లెడల, చీకటి నింపితివోయి! రాఘవా!"

- అని హృదయ విదారకంగా వినిపిస్తున్న ఆ కంచు కంఠం - శ్రీ రంగం గోపాలరత్నం గారిదే - అని గుర్తు పట్టేశాను. గతంలో విజయవాడ కేంద్రం నుండి ప్రసారమైన రేడియో నాటిక లోనిదా పద్యం అనీ, దాని రచయిత నా ఎదుటనున్న సుబ్బారావుగారేనని విన్నదాకా - వారు పద్య, గేయనాటికలు కూడా వ్రాశారని తెలియనే తెలియదు.

ఒకే కార్యాలయంలో సుమారు నాలుగు దశకాలు ఇద్దరమూ పనిచేశాం. ప్రాచీనాంధ్ర సాహిత్యం పట్ల వారికున్న అభిరుచీ, తెలుగు పద్యం అంటే వారికున్న అభిమానం, వచన కవితారీతిలో - ఒక వంక పాటవంచూపుతూ, తెలుగు ఛందోరీతుల్లో సరళంగా పద్యరచన చెయ్యగల సామర్థ్యం కలిగి ఉండడం, సంప్రదాయ బద్ధమైన జీవన సరళికీ, అధునాతన జీవిత విధానానికి వైరుధ్యం లేని సమన్వయం కుదుర్చగల నేర్పు - మా ఇరువురి మైత్రికీ - ముఖ్యకారణాలై ఉండవచ్చును - అని అనుకుంటాను.

ఐచ్ఛిక పాఠ్యాంశంగా ప్రత్యేక శ్రద్ధతో తెలుగు భాషా సాహిత్యాలను కాలేజిలో అధ్యయనం చేయక పోయినా, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగులో ప్రథమ స్థానాన్ని పొందడం - బంగారు పతాకాన్ని సాధించడం - ఏ అకాడమీల్లోనూ, విద్యాసంస్థల్లోనూ పనిచెయ్యకుండా అంకెలతో కుస్తీపట్టే ఉద్యోగంలో విధి నిర్వహణ కొనసాగిస్తూ, రచనా వ్యాసంగం సాగించటం కూడా - మా ఇరువురి మైత్రికీ - అదనంగా బలాన్ని ఇచ్చి ఉండవచ్చు. ఏ.జీ. కార్యాలయంలో పదవీ విరమణ చేశాక, చేతికందిన తీరిక సమయంలో "క్రాస్ రోడ్స్", "శిలాశ్రువులు" - అన్న రెండు వచన కవితా సంపుటాలు, 'వేదనామధ్యాక్కరలు' అన్న లఘుకావ్యం అచ్చువేసి, సాహితీ మిత్రులకు ఇదివరకే పరిచయమైనారు. వీరు విడుదల చెయ్యబోతున్న బృహత్కావ్యం 'శ్రీ సీతామనోరామాయణం' లోని

హృద్యమైన పద్యాలు అప్పుడప్పుడు వినిపిస్తుంటారు.

తొమ్మిది పద్య/గేయ నాటికలు ఒక సంపుటిగా వెయ్యదలచినట్లు చెప్పగావిని ఎంతో సంతోషించాను. కానీ, దానికి ముఖబంధ రచనగా రెండు మాటలు అందివ్వమన్నప్పుడు కాసింత సంశయించడం నావంతైంది. అయితే వారి ప్రతిపాదన వెనుక కారణం. నా అర్హతగాక వారి సౌశీల్యంగానే భావించి, నావిగా రెండు మాటలు చెప్ప సాహసిస్తున్నాను.

అతి ప్రాచీననాగరికతకూ, ఇతిహాసానికీ వారసులైన వారందరికీ పురాణాలున్నాయి. ఒకనాటి జీవన విధానానికీ, ఆలోచనా సరళికీ సామాజిక వ్యవస్థకూ అవి దర్పణాలు. పౌరాణిక ప్రసిద్ధి సంతరించుకున్న అహల్యనూ, వాలి పత్ని, తారనూ, మండోదరినీ - మానసిక సంఘర్షణకు గురిచేసే సన్నివేశాల్లో పడేసి - విమోచన, తారారాఘవం, మండోదరీ రావణం - అన్న నాటికలలో విలక్షణమైన పాత్ర చిత్రణా సంవిధానం సాధించారు సుబ్బారావుగారు.

"నేనేం నేరం చేసానని. నన్ను బండరాయివి కమ్మని శపించావయ్యా? గౌతమమహర్షీ! మోసగించిన నాకలోకాధి పతి పూజ్యుడా? అవున్లే! స్వామీ! మగవారలేం చేసినా చెల్లుతుందీ లోకంలో!" అని ఆక్రోశిస్తుంది అహల్య.

" అంతగా నీకు - సుగ్రీవునికిచ్చిన మాటే ఎక్కువైతే, మావారితోనే ముఖాముఖివెదిర్చి నిలబడి వీరునివలె పోరిగెలిచావా? నా స్వామిని పిరికివానివలె చెట్టు చాటున దాగి .... వధించావే? ఇదినీకు తగునా? "

అని శ్రీరాముణ్ణి నిలదీస్తుంది 'తారారాఘవం' అన్న నాటికలోని వాలి పత్నితార.

"ఆ రఘురాముని ఇల్లాలిని, జనకజను బలాత్కారంగా పట్టి తేవడం అందునా ఎవరూ లేనప్పుడు దొంగచాటుగా వెళ్ళి తీసుకురావడం, తెచ్చి ఈలంకలో ఈ అశోకవనంలో బంధించడం. ఆమె కన్నీరు మున్నీరుగా ఏడుస్తుంటే- వికటాట్టహాసం చేయడం - ఇవన్నీ మీకు న్యాయమని తోచాయా? ప్రభూ! "

– అని దశకంఠుణ్ణి ప్రశ్నిసుంది – 'మండోదరీరావణం' లోని మండోదరి.

మహాకవి ధూర్జటి కృతి. శ్రీకాళహస్తి మాహాత్మ్యంలోని 'నీలవేణి' కథను ఆధారంగా చేసుకొనిమలచిన - "నీలవేణి" - నాటికలో - ఒకనాటి సమాజంలో కూడా స్త్రీకి ఉన్న దయనీయ మైన స్థానాన్ని చూపించి, సందర్భోచితంగా శ్రీనాథుని పద్యాలు, ధూర్జటి పద్యాలు యథాతథంగా వాడి, తెలుగు పద్యాల మీద రచయిత కున్న విశేషాభిమానాన్ని చాటుకున్నారు.

సుబ్బారావు గారికి పోతన్నగారి మీదా విశ్వనాథవారిమీదా ఉన్న భక్తి ప్రపత్తులు - "విప్రసందేశం" - కిన్నెరసాని అన్న రెండు గేయనాటికల్లోని ప్రతిఅక్షరం వెనుకా తొంగిచూస్తాయి. 'గోపికావిరహం' - అన్న పద్యనాటికలో ఆణిముత్యాల్లాంటివి - పోతన గారి భాగవతంలోని పద్యాల్ని, ముక్కుతిమ్మన పారిజాతాపహరణం లోని పద్యాన్నీ సందర్భోచితంగా వాడారు. అయితే గోపికల ముందు ప్రత్యక్షమైన శ్రీకృష్ణుణ్ణి వర్ణిస్తూ వీరు నడిపించిన -

"ఆ యెడగాంచి రంగనలు అద్భుత రూపమనోహరమ్ము" అన్న ఉత్పలమాల కూడా రసజ్ఞ హృదయాన్ని ఆకట్టుకుంటుంది.

ఆదినుండి, తుదివరకూ కేవలం సుబ్బారావుగారి - స్వీయపద్య, గేయాలతో వెల్లివిరిసి, కల్పనాబలంతో సాగిన నాటికలు - 'నిమిత్తమాత్రులు' 'పాదాభివందనం'. ఇతి వృత్తాలు కూడా వీరి సృజనకు చక్కని నిదర్శనాలు.

ఒక వేకువ జామున పెన్న ఒడ్డున పోతున్న సమయంలో, తంబురా మీటుతూ నిరామయంగా తత్త్వం పాడుకుంటూ ఎదురైన గాయకుడు - రచయిత ఎదలో కలిగించిన పారవశ్యమే - 'నిమిత్తమాత్రు'లన్న నాటికకు ఊపిరి.

ఆ తర్వాత 'ఆచంట' గ్రామంలో విన్న ఒకపరమ నైష్ఠికుని గాథ - వీరి స్మృతి పథంలో బీజమాత్రంగా ఉన్న కథకు మారాకు తొడిగింది.

తంబుర మీటుతూ, వినయంతో తనచుట్టూరా విస్తరించిన ప్రకృతినే చదువుకుంటూ ఎదిగిన రంగడు పాత్రనూ, సకల శాస్త్రపారంగతుడూ, నిష్ఠాగరిష్ఠుడై అహంకరించే రామానుజాచారి పాత్రనూ - సమాంతరంగా నడిపించారు. వేశ్యా లౌల్యంతో పతనమైన రామానుజాచారి, అతని అవసాన సమయంలో - అహంకారాన్ని కుబుసంలా విసర్జించి, తన ఎదుటనే అమాయకంగా, తంబురా

మీటి - తామరాకు మీద నీటి బిందువులా ఉన్న రంగడి వ్యక్తిత్వంలోని ఔన్నత్యాన్ని - గుర్తించగల పతాక సన్నివేశంతో నాటిక ముగుస్తుంది.

స్త్రీలు - ఒక భిక్షుకి సంఘాన్ని ఏర్పాటు చేసుకోడానికి బుద్ధుడు తటపటాయించాడనీ, శిష్యుడైన ఆనందునితో అన్నమాటలు బట్టీ స్త్రీకి, పురుషునితో సమాన ప్రతిపత్తిని ఇవ్వనట్లే తోస్తుందని ఒక అభిప్రాయం, ఆధునిక చరిత్రకారులకు కొందరికి ఉంది. కానీ స్త్రీలు బౌద్ధమతాన్ని స్వీకరించినట్లూ, భిక్షుకులుగా దీక్షబూనినట్లూ - ప్రస్తావనలూ, ప్రమాణాలు లేకపోలేదు.

అమరావతీ స్తూప శిథిల శకలాల్లో ఇద్దరు స్త్రీలు బుద్ధుని పాదాలకు నమస్కరించిన భంగిమలో అద్భుతంగా చెక్కిన శిల్పం - సుబ్బారావుగారిని - ఎంతగానో ఆకర్షించి - పాదాభివందనం' అన్న నాటికకు ప్రేరణ ఇచ్చింది.

విశ్వమానవాళినే తొలిసారిగా కదిపికుదిపి, ఆధ్యాత్మికమైన ఆలోచనలతో ఉర్రూత లూగించిన, తథాగతుడూ, అతని పాదాలను భక్తితో తాకుతున్న నగ్నస్త్రీలు, వారిని అనశ్వరంగా శిల్పాకృతిలో బంధించిన ఆంధ్రశిల్పులూ - ఈ నాటికకు ఆయువుపట్టు! ప్రాచీనమైన ఐతిహాసిక నేపథ్యాన్ని కల్పించి, చక్కని ఊహతో, ఉదాత్తమైన పరమార్థాన్ని ఈనాటిక ద్వారా మనకు అందించారు రచయిత.

శ్రవ్య నాటికలుగానూ దృశ్య [redacted]నాటికలుగానూ మలచుకొని ప్రసార/ప్రదర్శనలకు ఉపయోగించే వీలున్న ఈ రచనలు - నాటక ప్రయోక్తలనూ, రసజ్ఞులైన పాఠకులనూ అలరించి, ఆలోచింప చేస్తాయని నమ్ముతున్నాను.

సరూర్‌నగర్,
హైదరాబాద్
జూన్, 1997

గిడుగు రాజేశ్వరరావు

# అంకితం

**- శ్రీరామచంద్ర మూర్తికి -**

నీ రామాయణ గాథలో ప్రథితులౌ నీరేజ పత్రేక్షణల్, –
తారాదుల్, యెదలోన నిల్వ – కవితా ధారా ప్రవాహమ్ముగా
తారారాఘవ మాది నాటికల, గాథారమ్య భావాబ్ధిగా,
శ్రీరామా! రచియించి నాడ! సుకవి శ్రేయోనిధానమ్ముగా ! 1

నాటికలంచు వ్రాసి, రఘునందన! నీకథలోన నుత్తముల్,
బోటుల, పాత్రచిత్రణ, నపూర్వముగా నొనరించినాడ ! వా
గ్ధాటియు, నాటకీయతయు, కమ్మని పద్యములందు శోభిలన్ !
నేటికి నచ్చునర్పనవి – నిల్చె – భవత్పద పద్మసేవలన్ ! 2

ఇది, నీ సీత, విషాదగాథల, వచః హ్రీముగ్ధనై, నాటకం
బది – స్త్రీ పాత్రల చిత్రణాన, – మధురోహావేశ పాథోధియై,
యెదలోనన్ రసవీచులై గెరలెనోయీ! రామ! నీకంకితం
బిది, నేనిచ్చెద! ప్రాతిభాహృదయ గంభీర స్వనాంభోనిధిన్ ! 3

ఇది, నీ సీత విషాదగాథల, వచః హ్రీముగ్ధనై – నాందిగా,
సుదతీపాత్రల చిత్రణమ్మున, కథా సోపానముల్ కట్టితిన్ !
పదలాలిత్యము, పద్యనాటికల – శోభారమ్య సంభాషణా
మధురంబై, రసరాజ్య మేలునని, – రామా ! అంకితం బిచ్చెదన్ ! 4

పద్యము, వచనము, గేయము
హృద్యంబుగ, నాటికల – న హీనప్రతిభన్,
సద్యఃస్ఫూర్తి నొసగి, – నై
వేద్యం బిచ్చెద – రసార్ద్ర వీచుల – రామా ! 5

# విమోచన

## (నాటిక)

### ప్రథమాంకం

(నేపథ్యంలో కోపంతో గౌతమ మహర్షి బిగ్గఱగా)

**శా॥ ఔరా! ఎంతటి ద్రోహబుద్ధివి, అహల్యా! ధర్మ దూరీకృతా!**
**ఘోరా ఘూనల కీల! నా యశము గగ్గోలయ్యె! జారత్వ దో**
**షీ! రాశీభూత సమస్త కామగత దుశ్శీలా! దివా రాత్రముల్**
**ఊఱాయై పడి యుండు మోసి! ప్రభుడా రాముండు గాపాడెడిన్!**

**అహల్య :** (దిగ్గన లేచి, చెవులు మూసికొని) – శివ! శివా! ఇంత చిన్న తప్పిదానికి అంత పెద్ద శిక్షా? ప్రభూ! గౌతమస్వామీ! నేనేం నేరం చేసానని, నన్నుబండ ఊయివి గమ్మని, శపించావయ్యా? గౌతమమహర్షీ! మోసగించిన, నాకలోకాధిపతి – దేవేంద్రుడు పూజ్యుడా? అబలను, అక్రమంగా ఆక్రమింప దలచిన, ఆ సుర పురుష పుంగవుడు గౌరవనీయుడా? అవును లే? స్వామీ! అవును! మగవారలేం చేసినా చెల్లుతుందీ లోకంలో! ఆడదానిని, అబలను, దేవేంద్రుని మాయ చేత, కుట్ర చేత, కామాంధత చేత, అహంకారం చేత వంచింపబడ్డాను గదూ! అదినాదే తప్పు! ఈ ఆడ పుట్టువే పరమాపరాధం గౌతమస్వామీ! నీవేం చేస్తావు మఱి? నా అపరాధానికి స్వామీ! నా యీ పరమాపరాధానికి – నేను పాషాణమైనా, గండ శిలైనా, బండ ఊయైనా – ఏం కొదువ లేదు?! –

ప్రభూ! శ్రీమన్నారాయణా! అసలు నిజం నీకైనా తెలియదా? నా మనసు, నాబేల యెద – విప్పి – నీ ముందుంచుతాను. నీవే పరీక్షించుకో! తండ్రీ! నా పతిదేవులైన గౌతమ మహర్షులకు

ప్రళయ కోపం వచ్చింది. పురుషాహంకారం పుట్టెలో తొలుస్తుంటే, ఆయన నా మొఱాలకింపరు! నా ఆడుకూయి, నా పాడుగోడు విననైనా వినరు! ప్రభూ! నీవైనా విను! నా యీ చిన్న విన్నపం! నా యీ మనస్తాపం!-

నాదొకటే తప్పున్నదిరా! నాయనా! అది నా చిన్నతనం. మఱీ పసిదాన్ని, పరికిణీ వోణీల చిన్నారి బాలని. అప్పుడప్పుడే బాల్యం యౌవనంలోనికి తొంగిచూస్తున్నది. ఒకనాడు దేవేంద్రుడు ఐరావతం మీద మహావైభవంతో ఊరేగుతున్నాడు. ఆ ఠీవి, ఆ దర్పం - నాకళ్ళు మిరిమిట్లు గొల్పాయి. "అహా ఎంతగాంభీర్యం? ఎంతశౌర్యస్ఫూర్తి? - ఈ నాకలోకాధిపతిలో" నని విస్మయపడ్డాను. అంతే! నారాయణా! అదే - ఏ అభమూ, శుభమూ ఎఱుగని నాలేత ఎడదలో కదలిన - ఒక అమాయక, అవ్యక్తానుభవ వీచిక మాత్రమే అది! ఆ ఊహ, ఆశైశవాచ్చ హృదయగత సంచలనం - అంతటితో ఆగిపోయింది! అయ్యో! అమాయకురాలైన ఋషికన్యను నాకీ పిచ్చి ఆలోచన లేమిటా? - అని ఆ భావాలను, ఆ హృదయకల్లోలాన్ని - అంతటితో మొదలంటా అణచివేసాను, నామనః ఫలకంపైన దాని ముద్ర ఏమాత్రం పడకుండా తుడిచివేసాను! స్వామీ! ఇది నా గత చరిత్ర! ఇది నా బాల్యాను భూతి! ఇది నా విషాద నాట కానికి, పూర్వరంగం! అంతే స్వామీ! అంతే! సూత్రధారివైన నీవే ఈ నాటకాంతం నిర్ణయించాలి తండ్రీ! ఆపైన జరిగిన సర్వమూ నీ కెఱుక గదా? జగస్సాక్షీ! గౌతమ మహర్షికి ఇల్లాలినై, నాచిన్ని శతానందునికి తల్లినై, పరమపవిత్ర గృహిణీ ధర్మంలో ఇన్నాళ్ళూ గడిపాను. ఇదీ నా కథ! మనసా, వాచా, కర్మణా నేను గౌతముని ఇల్లాలిని!

నిజమెఱిగిన సర్వాంతర్యామీ! నన్ను నీవైనా క్షమించు! నారాయణా! ఇదుగోనయ్యా! ఈ నా పశ్చాత్తాప మహాగ్నిలో

సమిధనై, కుమిలి, కుమిలి మంటనై, బూదినై, హరించు కొనిపోతున్నాను. నేను నా ఈ కించిత్ బాల్యమునో భావ దోషానికి, కృశించి గండ శిలై పోతున్నాను. ప్రభూ! అదిగో! శాపాగ్నులు, ప్రళయభీకరంగా, అవే గౌతమ కోపాగ్ని విస్ఫులింగాలు, ఫాలానల సదృశంగా, కండ్లు మిఱుమిట్లు గొలుపుతూ వస్తున్నాయి దావాగ్నులై నాతనూ మనోలతలని దగ్ధం చేయటానికి! నన్ను నీవై నా రక్షింపరా! శ్రీమన్నారాయణా! నన్ను రక్షింపరా! తండ్రీ!...

(అని స్పృహ తప్పి పడిపోతుంది)

**నేపథ్య సంగీతం**

**సీ॥ తొలికోడి కూతలో పులకరింపులు గల్గ**
**ఝల్లని హృదయమ్ము చల్లవడెనొ?**
**వేయి కన్నులవాడు చేయి వైచినతోడ**
**పరిచయ జ్ఞాన మభావమనెనొ!**
**రమ్యగౌతమ మూర్తి రక్తాంత నేత్రమ్ము**
**గజ్జిల్లి తనువెల్ల కరడు గొనెనొ?**
**ముగ్ధ శైశవ వాంఛ స్నిగ్ధ విమోహమ్ము**
**లాచి కొన్నను, శీల మచలమనెనొ?**
**కామ కృష్ణాహి విషములు గ్రామికొనెనొ?**
**ధూర్త వృత్రారి నైల్య విస్ఫూర్తిగనెనొ?**
**కుపిత గౌతమ శాప సంకుచితి గనెనొ?**
**నీల, మల్పమ్ము, శైత్యమ్ము నెంత శిలగ!**

– విరామ సంగీతం –

# విమోచన

## ద్వితీయాంకము

(గౌతమాశ్రమ సమీపంలో రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంట వస్తుంటారు. వారికి దారిలో నల్లని శిలా రూపంలో అహల్య కనిపిస్తుంది)

నేపథ్య సంగీతం

**తే.గీ ।** **తనదు చీకట్లు ద్రోచు చంద్రుని వెలుంగు,**
**తన మనో రథాప్తి – దశరథ సుతు రాక,**
**తన మృతోక్తి పునర్జీవ ధనుని రాక,**
**తన విమోచను రాక కా తన్వి వేచె! –** 3

**రాముడు:** (దిగులుగా) మహాత్మా! విశ్వామిత్ర బ్రహ్మర్షీ! తాటకను చంపిన నాటనుండి, నా మనసులో ఈ విషాదచ్ఛాయలు తొలగిపోలేదు. నా తలంపులు గాఢ తమస్సులై నా హృదయాకాశంలో విరిసి పోతున్నాయి ఆషాఢనీల మేఘాల్లా (అని తలపై కెత్తి ముందు చూచి) –

అహెూ! ఏమిది? నిర్జీవమైన, నిర్మానుష్యమైన ఈ ఆశ్రమము? ఎవరిదీ తపోవనము స్వామీ? –

**లక్ష్మణుడు:**(విషాదంగా) అన్నయ్యా! అటుచూడు! ఎండిమోడైన చెట్టు, దానిని వదలక వ్రేలాడు ఆ శుష్కమాధవీలత! నిలువెల్లా ఎండినదీ ఆశ్రమ తరుసంతానము! అయ్యో! ఎంత దుఃస్థితి పట్టినదీ పుణ్యాశ్రమానికి మహర్షీ! –

**విశ్వామిత్ర:**(నిట్టూర్చి వేదనతో) నాయనా! రామచంద్రా! సౌమిత్రీ! మీరసలు విషయం గమనింపనే లేదు. ఆనల్ల ఱాతిని చూచారా? తండ్రీ! మోడైన ఆచెట్టు క్రింద గండశిలయై పడియున్న ఆవినీల,

పాషాణ హృదయ విదారక గాథను విన్నారా? ఆ శిలయే ఈ ఆశ్రమ దుఃస్థితి నగ్నస్వరూపము రామచంద్రా! –

**రాముడు:** (ఆత్రంగా, ఆవేదనతో) స్వామీ! ఆ శిలావృత్తాంతము, ఆ కలకులాయిలో దాగిన ఆ కన్నీటి కథను మాకు వినిపిస్తారా? అదేమోగాని ఈ స్థలంలో అడుగిడినది మొదలు, నామనసంతా అల్లకల్లోలంగా ఉంది గురుదేవా! –

**సీ॥ ఒక మహాకవి శోక మొక శ్లోకమై తొల్లి**
**గద్గద రావమై కదలినట్లు**
**ఒక మహా నాటక మొక సూత్రధారి, స**
**జలనేత్రముల నాంది బలికినట్లు,**
**ఒక మహాగాయకుండొక విషాద గళవి**
**పంచి, రాగము లాలపించినట్లు**
**ఒక మహానృత్య భావోద్దీపనా భంగి**
**మము, దైన్య భావమ్ము మలచినట్లు,**
**ఒక మహాదుఃఖ సాగర మొదుగలేక,**
**చిత్తమను చెలియలి కట్ట నుత్తరించి**
**భావనా సైకతమ్ముల బర్వి పర్వి –**
**ఒక యనన్యాను భూతి – హత్తుకొనె నెదల!** 4

**విశ్వామిత్ర:** (నవ్వి) కరుణా సముద్రుడవైన నీ లేతహృదయం. ఈ కరుణారస భరితమైన నాతి కథ విన్నచో మఱింత కలఁగి కన్నీరై ప్రవహిస్తుం దేమోగదా? –

**రాముడు:** (జాలిగా) లేదు! మహర్షీ! లేదు! చెప్పండి ఆ కథ! సావధానంగా వింటాను.

**లక్ష్మణ :** (సందేహంగా) అన్నా! ఇది గౌతమాశ్రమం కాదుగదా? మహర్షీ! మీరేమంటారు?

**విశ్వామిత్ర:** (నిట్టూర్చి) అవును నాయనా! అదే ఇది! అహల్యా మనోహర సౌందర్యాకాంక్షియైన దేవేంద్రుని వలలో జిక్కి, మోసపోయి, గౌతమమహర్షి శాపాగ్నికి శలభమై మ్రగ్గిపోయిన ఈ అహల్యా శ్రమ మిదే నోయి! రామా! కోపావేశంలో, పురుషాహంకారంతో, గౌతమముని, అమాయకురాలిని అబలను, ఇల్లాలిని అహల్యను -అదే! - ఆ గండశిలగా - శపింపగా - పాపమా సాధ్వి నిట్టనిలువునా కూలి, కృంగి, కృశించి, కటికఱాయై ఇచట కుదురు కొన్నది! అయ్యో! ఎంత కష్టం కలిగిందా మహాతల్లికి, అహల్యకు చూచారా? అధికార గౌతమ శాపాగ్నికి శలభం, అనధికార కామ సహస్రాక్షుని వీక్షణాగ్ని కింధనం - అందుకే పాపం సుప్తశిల - ఈ అహల్యా రూప నవలా సౌశీల్యం! -

**తే.గీ.** **ఇరులు విరియక నిత్యమ్ము యేచి తమము!**
**ఇమ్ము లానక, తీవ్రశైత్యమ్ము లొదిగి,**
**పలుకులందక, ఘోర శాపమ్ము మొనసి –**
**స్మృతిని గొనునంతలోన విస్మృతిని గొనియె!** 5

**తే.గీ.** **దైన్యమెల్లను రూపొంది ధరణి నిచట**
**శూన్య గేహమ్ముగా నిల్చె! సుదతి దైన –**
**శిలవంచనాగత భార శేషజీవ**
**నమ్ము – మొండిగా నిల్చె – శిలాకృతిగని!** 6

**లక్ష్మణ :** (ఆవేశంతో) స్వామీ! దురాత్ముడు, నయవంచకుడా దేవేంద్రుడు ఏమియును కాలేదా? -

**విశ్వామిత్ర:** (గాఢంగా నిట్టూర్చి) నాయనా! కాకేమి? - సహస్రాక్షుడై నాడు! పూర్వం కేవలం రెండు కన్నులతోనే పరనారీ సౌందర్యమా కాంక్షించెడి వాడు. నేడో? వేయి కండ్లు, కామాధికమై శతసహస్రా

క్షులతో సర్వలోక వనితాసౌందర్యం జుఱ్ఱు కొంటున్నాడు! మగ మహారాజుల ధర్మ స్వరూపం - ఇట్టిదే నాయనా! రామచంద్రా!

**చ॥ వనితను, భర్త - భోగ్యమగు వస్తు వటంచని నెంచు-నన్యదుర్**
**వనిత, విలాస వస్తువని, వంచనతో దనయుచ్చు జిక్కునం**
**చని, దలపోయు! పూరుష విచారము నిత్యము కామలౌల్యమా!**
**వనిత - పవిత్ర మాతృ సుధ వర్షిలు నంచు దలంపరేరుర్! 7**

**రాముడు:** (నొచ్చుకొని) బ్రహ్మర్షీ! క్షమించండి! మీ కడ్డు చెప్పవలసి వచ్చినది. ధర్మము నిత్యమైనది. సత్యమైనది. దానికి లింగ వివక్షణ లేదు. అయినను దేవేంద్రుని కేమిలే? పాపమా తల్లి అహల్యకు శాప విమోచనమెట్లో గదా? -

**విశ్వామిత్ర:** (నవ్వుతూ) రామచంద్రా! ఎట్లగునా? రఘుకుల చంద్రులు, ఆశ్రితభక్త వత్సలులు, తమరే వలననే కావలెను! వేరెవరీ చీకట్లను పారద్రోలెడి వారు? తండ్రీ! -

**ఉ॥ ఉన్నది యామె, నీకనుల నున్నది, నీలశిలాష్ట తేజమై!**
**కన్నది యామె, తా నెడదకన్నుల, నీలతనూమనోహరున్ !**
**విన్నది యామె, నీ హృదయవీథులనేలు కృపారవమ్ములన్ !**
**మన్నన సేయు మా సుదతి - మాటల, శోక రసార్ద్రగాథలన్! 8**

**రాముడు:** (ఆశ్చర్యంతో) ఆ! - నేనా - స్వామీ! -

**విశ్వామిత్ర:** (సంతోషంగా) అవునయ్యా! రఘురామా! నీవే! ఈ లోకకల్యాణం నీ వలననే జరగాలి! ఈ అహల్యా శాపవిమోచన, నీకృపాబలంతో కావాలి నాయనా!

**లక్ష్మణ :** (సంశయిస్తూ) మహర్షీ! అహల్య ఊయైనను ఆమె వినిర్మలాత్మ తన దుఃస్థితి కింకను పరితపించు చున్నదా? -

**విశ్వామిత్ర:** (నిట్టూర్చి) అయ్యో! పిచ్చివాడా! కేవల పరితాపమా అహల్యకు?

ఉ॥ **బన్నము వడ్డ దా, సుదతి, బాధల తాను యుగాలు ఖిన్నయై**
**యున్నది ఊయివోలె కరుణోదధి! నీదగు రాకగోరి, తా**
**నున్నది మౌన వేదనల, నోపికపట్టి! తదంతరాత్మ – సం**
**ఛన్నముగా విముక్తి కయి, పారస నాథ! తపస్సు మున్గెడిన్! 9**

ఆ తల్లి దివారాత్రాలు, మాసాలు, వత్సరాలు, యుగాలుగా, శ్రీరామచంద్ర మూర్తి దర్శనానికై పలవరిస్తుందోయీ! అయినా మీకు వినబడటం లేదా ఆ హృదయవేదన? ఆ విషాదఘోష? తాను ఊయిగా మారిపోవు నప్పుడా మహాసాధ్వి ఏమని విలపించిందో తెలుసా? రామచంద్రా!–

ఉ॥ **"రాముడు రాడొ? నా హృదయ రాజ్యరమాధవు, డాదిమూర్తి, శ్రీ**
**రాముడు రాడొ? భక్త జన రాముడు, పాప విమోచనా ధునీ**
**రామను గొంచురాడొ? రఘురాముడు, నాకడ" కంచు – గౌతమ**
**స్వామి, సతీలలామ – మనసా, విలపించి, లయించె, ఊయియై! 10**

తెలిసిందా? రామచంద్రా! మీకామె అంతరాత్మ ఘోష? –

**రాముడు:** (చిరునవ్వుతో) విశ్వామిత్ర బ్రహ్మర్షీ! ఆమె తానట్లు పశ్చాత్తాపముతో కృంగి కృశించిన దనుటకు ఋజువేమున్నది? శిలకు నోరేమున్నది? పాప పంకిలములు పశ్చాత్తాప జలముల గదా ప్రక్షాళితమగుట? –

**విశ్వామిత్ర:** (ఆవేదనతో) అయ్యో! వెఱ్ఱి నాయనా! అసలామె పాపియైన గదా ప్రక్షాళన? ఆ మహాసాధ్వి నింకను పరీక్షించు చున్నావా? రామచంద్రా! పాపమా యహల్యామాత కన్నీటికే సాక్ష్యము కావలెనా? –

తే.గీ॥ **తనదు రోదన – మేఘ గర్జనల సాక్షి!**
**తనదు కన్నీరు – జీవ వాహినుల సాక్షి!**
**తన హృదబ్ధిలో వేల – సంద్రమ్ము సాక్షి!**
**తన ప్రతీక్షకు పంచ భూతములు సాక్షి! 11**

**లక్ష్మణ :** (ఆశ్చర్యంతో) స్వామీ! అదేమి, ఆ నల్ల బండ ఊయి ఉన్నటు లుండి ధగ ధగమని మెఱియు చున్నది! ఒకానొక వినూత్నమైన

కదలిక గోచరమౌతుందా ఊయిలో! ఏమి అపూర్వానుభూతి యిది! మహర్షీ!

విశ్వామిత్రః(సంతోషంతో) ధన్యోస్మి! రామచంద్రా! ధన్యోస్మి! అది శ్రీ రామపాద ధూళితో ఆ కర్కశపాషాణంలో కలిగిన మహత్తర నవ చైతన్యం. మీకు వినపడలేదా? రామచంద్రా! సౌమిత్రీ! ఆ మూగ ఊయి ఏమని పలవరిస్తున్నదో? ఏమని విలపిస్తున్నదో? ఏమని వాపోతుందో? - వింటున్నారా మీరు? -

శా॥ ఊయై పోతిని, ఊయినైతి – రఘుచంద్రస్వామి, గాధేయుతో
నా యీ త్రోవ జరించువేళ కృపతో, నాస్వామి సాన్నిధ్యమే
ఊయై దొర్లుచు బోదునో? – కరగి, నీరై పాద్యమందిత్తునో? –
ఊయై పోతిని, ఊయినైతి నకటా! ప్రారబ్ధ కర్మమ్మునన్! 12

శా॥ నాకున్ ఱెక్కలు రావు–గారుడ మనోనారాయణున్ మోయగా!
నాకున్ కాళులు రావు – నాకధునినై నారాము సేవింపగా !
నాకున్ వాక్కులు రావు – ధాతసుతునై నా స్వామి కీర్తింపగా!
నాకున్ ఊతి తనమ్ము, నాతినయి, నానా పాప సంప్రాప్యమై! 13

నాయనా! రామచంద్రా! ఇంకనూ జాగు చేయక పదవోయీ! ఆమె విమోచనకై నా హృదయం పరితపిస్తుంది పద పోదాం రామా!-

తే.గీ॥ దర్పణమ్మున, ప్రతిబింబ దర్శనమ్ము
వోలె–మానినీ హృదయ భావో ద్భుతమ్ము–
నీ కృపాంత రంగమున మన్నింపు మయ్య!
స్వామి! నీ భక్తురాలి, గా వగను లెమ్ము! 14

నేపథ్య సంగీతము

తే.గీ॥ నీలిమబ్బులు రెండవి నింగి గలిసె
స్వామి పాద, శిలా సుసంస్పర్శ వేళ!
తెలి మొగిళ్ళు రెండవి, వియద్వీథి గలిసె,
స్వామి పాద, శిలా సుసంస్పర్శ వేళ! 15

– విరామ సంగీతం–

# విమోచన

## తృతీయాంకము

(గౌతమ మహర్షి ఆశ్రమం వసంతారామంలా కలకలలాడుతూ, కోకిల కుహూరావాలతో, స్వాగతోత్సాహాలతో ఆనందభరితంగా ఉంటుంది.)

నేపథ్య సంగీతము

సీ॥ మూగవోయిన గొంతు, ముగ్ధ పికీగళ
పంచమ స్వాన విపంచి బలికె,
మోడైన తరువు, నవోఢ తనూ స్నిగ్ధ
తారుణ్యమౌ హరితాంశు లొలికె,
పూలు రాలిన తీవ, పులకిత ప్రౌఢ, వా
సంత మహోజ్జ్వలతాంత మొలికి
ప్రియుని బాసిన హంస, స్వీయ వచస్సు ధా
రమణీయ కల కలారావ మొలికి,
శైత్య శిశిరర్తు ముక్త వసంత మొలికి,
త్రిపుర హరు కృపారమ్య రతీత్వ మొలికి, –
మాధవాహ్వాన, ధాత్రీ రమాత్వమొలికి,
సర్వ ప్రకృతి యయ్యె నహల్య సాధ్వి యపుడు! 16

ఉ॥ ఆయెడ మద్భు తేల్లె – కమలాక్ష పదోద్భవ దివ్యగంగ, శా
పాయత తాప సంజనిత వార్ధితనూజ, రమాలలామ, గా
ధేయ కృపా మహా శిఖర దీప్త హిమాప్త మహాస్రవంతి, దీ
ప్రాయత మైథిలేశ చిరవాంఛ ఫలాప్త! – యహల్య నాతియై! 17

(అహల్యా గౌతములొక వైపు, రామలక్ష్మణ విశ్వామిత్రులింకొక వైపుగా ప్రవేశింతురు)

అహల్య : (చేతులు జోడించి)

తే.గీ.। రామ! కౌసల్య నేత్రాభి రామ! రామ!
రామ! కౌశిక ప్రియశిష్య! రామ! రామ!
రామ! కారుణ్య గుణధామ! రామ! రామ!
రామ! కోదండ రామ! శ్రీ రామ! రామ! 18

ధన్య నైతిని శ్రీరామా! నీ కృపతో కృతార్థనైతిని. విశ్వామిత్ర మహర్షీ! సుస్వాగతము, సౌమిత్రి సహిత రాఘవ స్వామికి ఘన స్వాగతము! గౌతమ స్వామీ! నా శాపవిమోచనులు, భవబంధ విముక్తను జేసిన శ్రీ రామచంద్రులరుగో! చూడవయ్యా!

గౌతముడు: (పరమానందంతో నమస్కరించి) కౌశికమునీ! దశరథాత్మజు లారా! మీ రాక చే, మా సంసారము సజీవమై కలకలలాడినది. మీ దయవలన ఈ ఆశ్రమము వసంతారామమైనది. మీ కృపచేత నా యహల్య పునీతయై మఱల నాకు దక్కినది. తండ్రీ! రామచంద్రా! అహో! ఎంత భాగ్య మెంత భాగ్యమీ గౌతములకు? ఎన్నాళ్ళకీ సుకృత మయ్యా! రామా!

అహల్య : (ఆనంద పారవశ్యంతో) గౌతమమహర్షీ! అటుచూడండి –

శా। నా స్వాముల్ జను దెంచి నారు కరుణానందాబ్ధిలో హో! అయో
ధ్యా స్వాముల్, వరకౌశికాధ్వర మహాధానుష్క సేవా పవి
త్ర స్వాముల్, నవనీల మేఘసుషమా, రాజః తనూస్స్నిగ్ధర
మ్య స్వాముల్, పరిపక్వ పుణ్యఫల సమ్యగ్దాన వాంఛా ధునుల్! 19

స్వామీ! ఈ అతిథి దేవులకు ఆర్ఘ్యపాద్యాదులు సమర్పిద్దాం. నా మనోంబుజాన్ని, ఈ చిన్ని శ్రీ రామచంద్రుని వినీలపాద పద్మాలముందు సమర్పిస్తాను. రావయ్యా! శ్రీ రామా! రారా! నాచిట్టి తండ్రీ! రా నాయనా! లక్ష్మణా! విశ్వామిత్ర మహర్షీ! రండి! మా ఆశ్రమం పావనం చేసి, మా ఆతిథ్యం స్వీకరించి, మమ్మనుగ్రహించండి!

**విశ్వామిత్రః** (ఆదరంతో) తల్లీ! అహల్యా! నిన్నెఱుగని వారెవ్వరిక్కడ? మీ ఆదరాభిమానాలే మాకు పంచభక్ష్య పరమాన్నాలు. అమ్మా! ఆతిథ్యానికేమిలే! గౌతమసతీ! ఎప్పుడైనా స్వీకరింపవచ్చు. మాకు జనకమహారాజు నింట ఒక శుభ కార్య నిర్వహణమున్నది. దానికై మేమతి త్వరగా వెళ్ళవలసి యున్నది. అందువల్ల వెళ్ళి వస్తాము. తల్లీ! త్వరలో తిరిగి వస్తాము. కోపగింపకుమమ్మా! గౌతమ మహర్షీ! మీకివే మా ధన్యవాదాలు!

**రామలక్ష్మణులః** (భక్తివినమ్రులై) మాతా! అహల్యా సాధ్వీ! గౌతమ మునీ! రఘుకుల దీపకుడగు దశరథుని తనయులం, రామలక్ష్మణులం ప్రణమిల్లుతున్నాం. మమ్మల్ని ఆశీర్వదించండి పుణ్యదంపతులారా! కృపతో మమ్మనుగ్రహించండి. (అని మ్రొక్కుతారు)

**గౌతముడుః** (సంతోషంతో) నాయనా! రామచంద్రా! విజయీ భవ! కల్యాణమస్తు! సర్వకార్యసిద్ధిరస్తు! పోయి రావయ్యా! లక్ష్మణా! అన్నగారి సేవలో ఫలసిద్ధి పొంది తరింపవయ్యా! తండ్రీ! (అని ఆశీర్వదిస్తాడు)

**అహల్య :** (మహానంద భరితయై గద్గదకంఠయై రాముని చేతులు పట్టుకొని) నా చిన్ని రామచంద్రా! -

**ఉ॥ ఎందఱ నుంటివో ప్రభువ! బానివరీతిని యిన్నినాళ్ళు – నా**
**కందఱ నేడు నీవు దరహాసముతో చనుదెంచి నావహా!**
**సుందర వాలతమ్ము లివలంధువ! శాప విమోచనమ్మునై**
**యెందు మనుష్యులో కొలుతు నిన్నును తారకరామ! ధన్యనై! 20**

**మ॥ తెలిగించితివి స్వామి! దివ్యమగు నీ తేజమ్ము నాకన్నులన్**
**ఘనమై, కుండె లోతులన్ వెలిగె! నీ జ్యావల్లి నాదమ్ములో**
**దొరె! వాడెను ప్రమో మహోజ్జ్వల రవ సందోహమ్ముగా దోచె, నే**
**మిరా స్వామి! కరుణా మహత్త్వము లహో! మించెన్ మహో వీధులన్! 21**

**జానకీ** ప్రణయసామ్రాజ్యాధినేతా! శ్రీరామా! కల్యాణ సిద్ధిరస్తు! **సీతను పెండ్లాడి తిరుగు** ప్రయాణంలో నవవధూ సమేతంగా నా యీ ఆశ్రమాన్ని పావనం చేయండి! నా చిన్నారి కోడలిని వైదేహిని నాకొకసారి చూపించరా! తండ్రీ! ఈ దీనురాలిని

మఱచిపోకయ్యా! ఈ అహల్యా మాత కైకేయీ తుల్యరా! రామా! పోయిరా! సర్వదేవతలు నీకు రక్షగా ఉంటారు! బ్రహ్మర్షి, విశ్వామిత్రులు, నీ గురువర్యులే నీకు సర్వదారక్ష! లక్ష్మణా! నీవూ ఈ అన్న సేవలో తరించి, శుభాల్ని పొందు! రాఘవులారా! మీరిద్దఱూ క్షేమంగా వెళ్ళి, లాభంగా తిరిగి రండి! కల్యాణ మధుర మూర్తులై! జగద్రక్షకులై! –

**రామ, లక్ష్మణః**(సవినయంగా మఱల ప్రదక్షిణించి) తల్లీ! అహల్యాదేవీ! నీ యానతి శిరసావహిస్తాం. గౌతమపత్నీ! మాకిక సెలవివ్వండి! (అని కదులుతారు)

**విశ్వామిత్రః**(నవ్వుతూ) గౌతమా! సెలవయ్యా! తల్లీ! అహల్యా! సెలవు తీసుకొంటాను. పదవోయీ! రామా! పదరా! లక్ష్మణా! (అని కదిలిపోతాడు)

**అహల్య :** (కన్నుల ఆనంద బాష్పాలు కారుతుండగా)

**గీ॥ రామ! రఘువంశ జలధి చంద్రాంశ! రామ!**
**రామ! కౌశిక ప్రణుత సంగ్రామ భీమ!**
**రామ! శ్రీరామ! దశరథ రామ! రామ!**
**రామ! జానకీ ప్రణయ సామ్రాజ్య! రామ!** 22

రామా! కల్యాణ గుణాభిరామా! నీకు శుభమగుగాత! విజయీభవ! విజయీభవ! శ్రీరామచంద్రా! దిగ్విజయీ భవ! రఘురామా!

### నేపథ్య సంగీతం

**గీ॥ స్వామి చూచెను గౌతమ స్వామి సతిని –**
**లోచనాంత విమోచనా లోకనముల!**
**సతియు చూచెను రఘువంశ చంద్రమూర్తి –**
**లోచనాంత కృతజ్ఞతా లోకనముల!! –** 23

–సమాప్తం–

(ఈ నాటిక మార్చి 1961లో ఆకాశవాణి, హైదరాబాద్ కేంద్రం నుండి ప్రసారితమైనది)
(సూచన : పద్యాలు 1 నుండి 23 వరకు స్వీయకవితలే)

☆ ☆ ☆

# అంలం రంఘువం

## నాటిక

రచన

**జి.వి.సుబ్బారావు**

# తారా రాఘవం

## (నాటిక)

(నేపథ్యంలో తారా మహారాజ్ఞి దీనాలాపం వినవస్తుంది)

ఉ॥ శ్రీ విరహానలాంతర మరీచుల వ్రేగిన రామచంద్ర! నీ
లావిల రూప రంజిత విలాస! సమీర కుమార నిత్యసం
సేవిత దివ్యరూప! నుతశీలుని, వాలిని గూలనేసి – నా
జీవిత హర్మ్య మెల్లెడల చీకటి నింపితి వోయి! రాఘవా! 1

....విషాద సంగీతం....

(శ్రీ రామ, లక్ష్మణ, సుగ్రీవ, హనుమదాదులు ప్రవేశిస్తారు)

**శ్రీరాముడు :** (ఆందోళనతో) లక్ష్మణా! ఎవరిదోయీ! ఆ దీనారావం? 'రాఘవా!' అని నన్ను ఎలుగెత్తి వేడిన, ఆ కపోతి ఎవరోయీ? సుగ్రీవా!

**లక్ష్మణ, సుగ్రీవ :** (తలవ్రాల్చి నిరుత్తరులై ఉంటారు)

**హనుమ :** (డగ్గుత్తికతో) శ్రీ రామచంద్రప్రభూ! అది తారా మహారాజ్ఞిగారి దీనాలాపం. వాలి మహారాజుల మరణంతో అనాథయై, సర్వాంధ కారయై, దిక్కుతోచక అలా విలపిస్తుందా మహాసాధ్వి! శ్రీ రామా! (అని ఆగిపోతాడు)

**శ్రీరాముడు :** (కరుణార్ద్ర హృదయుడై) ఓయీ! హనుమా! హృదయవిదారకమైన, దుఃఖాతిరేకమైన, ఆమె ఆక్రందనం విని నా గుండె తరుక్కుపోతుంది. నా మనస్సు శోకార్ద్రమౌతున్నది. (అని నిట్టూర్చి) – అదేం చిత్రమో గాని ఆంజనేయా! నా మూలంగా, నా రామబాణఘాత పర్యవసానంగా – స్త్రీలకే – ప్రత్యక్షంగానో, పరోక్షంగానో, బాధలు, వ్యధలు, తటస్థిస్తున్నాయి.

తాటక మొదలు, తారాదేవి వరకు సాగిన, ఈ శోక మహాధ్యాయంలో! ఇది సరే! ఆ శోక సాగరనిమగ్నను, ఆ పతి వియోగ దుఃఖితను - ముందు వెళ్ళి, పరామర్శించి, ఓదార్చి వస్తాము. పద వోయీ! హనుమా! (అని మౌన గంభీరుడై కదులుతాడు. అందరూ అతన్ని అనుసరిస్తారు.)

తారాదేవిః (మూర్తీ భవించిన శోక దేవతవలె విరిసిన కేశపాశంతో, దీనవద నయై సన్నగా రోదిస్తుంది)

**గీ॥ సూర్య వంశాబ్ధి బొడమిన ఆర్యపుత్ర!**
**పూత రఘువంశ! ధార్మికాంభోధిచంద్ర!**
**పరమ కారుణ్య! సుగ్రీవ పక్షపాత**
**హృదయుడైతి, వధర్మపు పథము ద్రొక్కి! - 2**

హా! శ్రీరామచంద్రా! నాస్వామి, నా పతిదేవుడు, వాలి, కపికుల సార్వభౌముడు - నీకేం అపచారం చేసాడయ్యా! బలహీనుడు, నిరాశ్రయుడు పరాజితుడైన - ఆ సుగ్రీవుని కల్లబొల్లి కబుర్లు విని, నిజా నిజాలు తెలియక ముందువెనుక లాలోచింపక, ధర్మా ధర్మ నిర్ణయం చెయ్యకనే వాని కభయ మిస్తావా! నాస్వామిపై పగబట్టావా! - శరణాగత వత్సలుడనే బిరుదు నిలా, వమ్ము చేస్తావా! రామా! - పోనీ, ఏదో పొరపాటున సుగ్రీవునికి మాట ఇచ్చావే పో! మహాబలుణ్ణి, త్రిలోకాధి పతియగు దశకంఠుణ్ణే, ముప్పతిప్పలు బెట్టి, పరాభవించిన, నా స్వామి, వాలిని చూసి అయినా - ధర్మమెవరి పక్షమో, న్యాయ మెవరిదో - నిర్ణయింపలేక పోయావా? తండ్రీ! అంతగా నీకు సుగ్రీవుని కిచ్చిన మాటే ఎక్కువైతే, మావారితోనే, ముఖాముఖీ నెదిర్చి, నిలబడి, వీరునివలె పోరి గెలిచావా? నాస్వామిని! అయ్యో! ఇదేమీ లేక వంచనతో, పిరికి వానివలె, చెట్టు చాటున దాగి, నిరాయుధుని, నా పతిని, నీ నిశిత రామబాణంతో, నిర్దాక్షిణ్యంగా, మృగసమానంగా వధించావే? ఇది

నీకు తగునా? రఘునందనా! అయినా నిన్నని ప్రయోజన మేమిరా? శ్రీరామా! ఆ మగమహారాజు, వాలి, నామాట వింటేనా? నా ఏడుపు దిగదుడుపే అయిందా పురుషాహంకారానికి? –

**శా॥ నా కన్నా మొనగాడు లేడనుచు, నే, నా దుందుభిన్ గూల్చి, తం**
**చా కోపమ్మున దూకి, సోదరునిపై నాలమ్మునున్ జేసి, తో**
**నాకాధీశ సుతా! హితోక్తి వినకన్, నామాట మన్నింపకన్!**
**శ్రీ కోదండ గుణాభిరామ శర నిర్భేదాత్త జీవమ్మునై!** 3

**ఉ॥ ఆడుది యన్న చుల్కనగ, నాలిని, నీ ప్రణయాధిదేవతన్–**
**గోడుగ నేడ్చు, నీ ప్రియము గూర్చు సఖీమణి, తారనౌ నన్నున్**
**వీడితి వోయి! నిర్దయగ – వీరమునే మది నమ్మి, పోరిలో**
**నోడితివోయి! వంచనకు! ఓ కపిరాజ! గతాసు వైతివిన్** 4

**మ॥ ఎదురే లేని మహా కపీ! ఎదురుగా నీ రీతి భీతిల్లి – వి**
**ల్లది చేబట్టుచు, చెట్టు మాటున నిన్నున్, లక్ష్యమ్ముగా చేసి – దు**
**ర్విధి– శ్రీ రామ నరాకృతిన్, దునిమె! హృద్వ్యథుల్ మహాశోక వా**
**రిధులై, గద్గద కంఠినై నిలుతు! సుగ్రీవాగ్రజా! తారనై!** 5

(అని శోకావేశంతో వెక్కి వెక్కి ఏడుస్తుంది)

**శ్రీరాముడు :** (ప్రవేశించి, జాలిగా, అనునయంగా) – తారా మహారాజ్ఞీ! వీరపత్నీ! దుఃఖావేశంలో ఏమిటో అంటున్నావు? మృతుడైన నీ పతిని, వాలిని, తిరిగి బ్రతికింపలేను గానీ, మహాశోక సంతప్తమైన నీయెదకు, నా చల్లని మాటలతో కొంత ఉపశాంతి కల్గిస్తాననే ఆశిస్తున్నాను.

**తార :** (తలెత్తి, స్రవదశ్రుబాష్పయై, పెల్లుబికి వస్తున్న దుఃఖావేశాన్ని అతి ప్రయత్నంతో దిగమ్రింగి) అహో! శ్రీరామచంద్రా! ఎందు కయ్యా? నామీద నీకింత పగ? నీ నీలిమేని నీడలు సోకినంత మేర, అబలలకి యిక్కట్లు తప్పవా! స్వామీ! అయ్యో! నీ

మాటలతో నాకు ఉపశాంతా? కల్ల! - అయినా - తనువున తమ్మవై, మనసున మవసైన - నాపతి దేవుని నీ కలుకు టమ్ములతో గ్రుమ్మి - ప్రవహించిన ఆ వెచ్చని నెత్రుటేర్లు - నా యెద లోతుల్లో సెలవేస్తున్నాయి! ఈ నా మితిలేని శోకానికి - ఉపశాంతి - ఉపశ్రుతి - ఇంకెక్కడిదయ్యా? రఘురామా? - (అని మళ్ళీ పెద్దగా ఏడ్చి - తేరుకొని)

**శా॥ నా, యీ, శోకఝరీ తరంగములు, నానావేదనా ఘోషలై,**
**ఓయీ! రాఘవ! నా హృదంతర మహాయోషా విషాదో గ్రభా**
**వాయాతమ్మున - బాడ బాగ్ని శిఖలై వ్యాపించు! జీవించుటే**
**లోయీ? మోడయి పట్టి తార యిక? రోషోద్వేగినై గ్రుంగెదన్! 6**

**శ్రీ రాముడు:** (నిట్టూర్చి) తారాదేవీ! తగదమ్మా! నీకీ శోకావేశం! అయినా - ఈ వియోగభారం - ముఖ్యంగా బద్ధానురాగులైన ప్రేయసీ ప్రియులకు - అతి దుస్సహం! అది అనుభవైక వేద్యమేగాని, వర్ణింపవలవి గాదు! - సీతా వియోగానల దగ్ధుణ్ణి! నేనింకా మొండినై తిరుగుతూ, ఇలా బ్రతుకు తున్నానంటే - అది - ఈ ధర్మ దీక్షా పరిరక్షణ ప్రభావమే మతి! - (అని ఆగిపోతాడు)

**తార :** (కనులెత్తి కోపంతో బిగ్గరగా) ఆ! ఆ! తమరు ధర్మప్రభువులే! సాక్షాత్తు వైకుంఠం నుండి నేరుగా దిగివచ్చిన ధర్మబద్ధ కంకణులు! శ్రీ రామచంద్ర మూర్తులు! కనుక నేనా! స్వామీ! - ధైర్యంగా ఎదుట నిలబడి పోరాడలేక చాటుమాటున దాగి చంపారు నా ప్రభువును? ఇదేమి ధర్మయుద్ధమయ్యా? ప్రభూ! ఈ త్రేతాయుగంలో-

**ఉ॥ తప్పుల వెత్తిచూపి, పెడదారివి బోయెడి వాని కొక్కచో**
**వొప్పుగ స్త్రోవ చూపి, కరుణోదధివై, పరిదిద్ద బోక - రా**
**మప్ప! శరాగ్ని కీలలను అంతము చేసితి వేల నిర్దయన్?**
**తప్పుమ దిద్దుకోదగిన ధర్మువు గాదె? కపీంద్రుడో ప్రభూ! 7**

అయినా తెలియ కడుగుతాను - నీ పరమ శత్రువు, దశాస్యుని పరాభవించిన నా ప్రాణేశ్వరుడు - నీ కాప్తమిత్రుడు కాడా? స్వామీ!

**శ్రీరాముడు :** (దరహాసంతో) భేష్! తారాదేవీ! నీ రాజకీయ నైపుణ్యం, నీ రాజ నీతిజ్ఞత, నీ సమయోచిత పరిజ్ఞానం, నీ వాక్చమత్కృతి మెచ్చదగినవే! శత్రువునకు, శత్రువు-పరమమిత్రుడన్న - రాజనీతిజ్ఞత-అల్పబుద్ధులు, అనాగరికులు-మాత్రమే చేయు దురాలోచన! కానీ, సూక్ష్మ దృష్టిలో పరమధర్మ రహస్య వివేచనలో-ఇది అక్రమం, అన్యాయం, అధర్మం తారాదేవీ!-

**ఉ॥ నల్లని రూపు రేఖల మనమ్మున నెంచకు! ఆత్మవేత్త, సం**
**పుల్ల గుణాభిరాముని, అపూర్వ తపోధను, సత్యవాక్యలో**
**కోల్లసితాత్త ధర్మవిదు, నుజ్జ్వల మూర్తి, నుదాత్త చిత్తు-నో**
**తల్లి! తలంపవే! ఋజు పథమ్మున బోవగ జీవితమ్మునన్! 8**

అయినా, ఎదుటివాడు శత్రువైనా, మిత్రుడైనా అతని గుణ గణాలు అతని శీలం, అతని వ్యక్తిత్వం, అతని ధర్మ నిరతి-ఇవే గణింపదగినవి. అంతేకాని అతని మిత్రులు, శత్రువులు వారి వారి సంబంధ బాంధవ్యాలు -ఇవేమీ కాదు ఆధారం - ధర్మ నిర్ణయానికి. (అని ఆగాడు)

**తార :** (తలెత్తి సంకోచంగా) అయితే, మరేమిటి ఆధారం? శ్రీరామా!-

**శ్రీరాముడు :** (గంభీరంగా నవ్వి) అదే నీకు చెప్పబోతున్నాను తారా! నా పరమశత్రువైన ఆ దశకంఠుని సహోదరుడైనా, గుణప్రధానుడై శరణార్థియై వచ్చి, నన్నభయమడిగితే-నా ప్రాణసమంగా ఆదరించి-కాపాడుతాను. ఇదే నాధర్మదీక్ష! అదే నా ఆర్తత్రాణ పరాయణత్వం! తారా! -

**లక్ష్మణ :** (ఆందోళనతో) ప్రభూ! ఇలాసెలవిస్తున్నారు? ఇది నిజమేనా

మణి?

తార : (విస్మయంగా) అయినా శ్రీరామచంద్రా! నాకింకొక సందేహం! మావారు వాలి నీకు శత్రువే ననుకొందాం. కానీ అతని గుణగణాలు, శౌర్య పరాక్రమాలు, అతని రాజనీతిజ్ఞత-ఇవేమైనా మీరు ముందుగా పరీక్షించారా? ఏ కారణంతో అతనిపై కయ్యానికి కాలుదువ్వారు? ఆయన మీదృష్టిలో ఎలా దోషి, దుర్మార్గుడు, శిక్షార్హుడు అయ్యాడో చెప్పగలరా? స్వామీ!-

శ్రీరాముడు : (బిగ్గరగా నవ్వి) తారారాజ్ఞీ! మంచిప్రశ్నేవేశావు. అయినా నీ ప్రశ్నలకు సమాధానమిచ్చేముందు, నీకొక విషయం వివరించాలి. అతని ప్రాణసఖిగా, జీవితేశ్వరిగా, మహారాజ్ఞిగా వ్యవహరించిన నీకు-అతని హృదయసౌకుమార్యం, సౌశీల్యం, అతని అతిలోకపరాక్రమం-ఇవన్నీ నాకన్నా నీకే ఎక్కువ తెలిసి ఉండవచ్చును. అది నేను కాదనటం లేదు. కానీ నాధర్మ చక్షువునకు-అతని హృదయగత లౌల్యం, అతని కామాతిశయం, అధికార దుర్వినియోగం-ఛాయామాత్రంగా నిరూపితమైనవి. అశక్తుడు, అసహాయుడునైన అనుజుని-సమదృష్టితో సమ్యగ్భావంతో చూడలేని అగ్రజుడు, కరుణావాత్సల్యాలు బదులు కాఠిన్యం, శత్రుత్వం చూపే సహోదరుడు-అందునా కపిరాజు- నా ధర్మదృష్టిలో అధర్మపథానికి పరాకాష్ఠ! అట్టివాడు కేవలం మృగప్రాయుడు! సన్మార్గులను, నిస్సహాయులను, అల్పసంఖ్యాకులను, అధర్మంగా పరిపాలించి, క్రూరంగా హింసించే దుష్ట రాజనీతిని ఎక్కడున్నా సహింపడీ రఘు రాముడు!

**ఉ॥ రాజ్యము, గీజ్యముꣳ వదలి, రాక్షసవంశ వినాశకుండనై**
**పూజ్యుల మౌని సత్తముల బ్రోచుట కంకణమేను గట్టితిꣳ !**
**ఆజ్యము వేసె నీమగ డహంకృతి, తమ్ముని ద్రోలి, యౌవ సా**
**మ్రాజ్యము కొల్లగొట్టి – రఘురాముని క్రోధ మహాగ్ని గ్రుంగగꣳ! 9**

తార : (దిగులుగా) ప్రభూ! మఱి మీధర్మప్రవృత్తి ఎలాంటిది?-

శ్రీరాముడు : (శాంతించి) తారా! నాది మానవతను సర్వతో ముఖంగా వికసింప జేసే ధర్మప్రవృత్తి! ఈ ధర్మనిరతి, ఈ సమ్యగ్దృష్టి, ఈ శరణాగతవత్సలత కేవలమీ త్రేతాయుగంలోనే కాదు, యుగయుగాలకు భారతావనికి ఆదర్శంగా నిలవాలి! అదే! నా రామ బాణధ్యేయం! అదే నారామరాజ్య మహోత్కృష్టత! నాయీ ధర్మరక్షణలో - అడవుల పాలైనా, కట్టుకొన్న ఇల్లాలిని గోల్పోయినా, నా హృదయం వియోగాగ్నిలో దగ్ధమైనా- వెనుకాడను! అధర్మ నిర్మూలనం, ధర్మ సంస్థాపనం - విశ్వ శ్రేయస్సు - ఇవే కర్తవ్యాలు నా రామబాణానికి తారా! -

ఉ॥ ఎత్తిన రామబాణమిది యేగును, ధర్మసమన్వయార్ద్ర నం
విత్త పథమ్మునందు, పదవీగత గర్వతమో విమోచనా
యత్త వికాసరూపమున, ఆర్షపథాంతర నిత్యనూత్న శో
భాత్త మహాగ్ని తేజమున, భారత జాతికి రామరక్షయై!— 10

తార : (పశ్చాత్తప్తయై చేతులు జోడించి, వినమ్రయై) రాఘవా! ఆర్తత్రాణపరాయణా! ధర్మమూర్తీ! -

ఉ॥ ఆరని చిచ్చు నాయెడద నాగక ఱేగి దహింప, దుఃఖకా
సారము లోన మున్కలిడి సార వివేక విహీన నైతిరా!
ఆరెను శోకవహ్ని, ప్రభువా! కరుణాత్మత, ధర్మదీక్షకై
నారిని బూనితంచు వినినంతనె, నాయెద యెల్ల చల్లనై!
శ్రీరామా! జగదభిరామా! కల్యాణ గుణధామా! 11

ఉ॥ నా యిలవేల్పు వాలి చనినాడని, కృంగి, కృశించిపోతి! ప్రే
మాయిత మూర్తి, మత్పతి—అమాంతము నీ శర వహ్ని దగ్ధ మై
నాయిలు చిమ్మచీకటు లనంతము నిండిన బేలనైతి! శో
కాయత చిత్తనై! — నవ వికాసములొల్కె త్వదీయ వాక్కులన్! 12

నాయనా! జానకీ హృదయనాథా! శరణాగతవత్సలా! శ్రీరామా!

ఉ॥ కన్నుల గ్రమ్మినట్టి మనకంపు పొరల్ తొలగంగ – వాక్సుధా
సన్న మహోజ్జ్వల ద్యుతుల చల్లితివీవు! హృదంతరమ్ము నం
దున్న సమస్త సంశయము ద్రోసితివీవు! త్వదీయ దర్శనం
బన్న! విమోచనాపథ మహత్త్వము నయ్యె! కృతార్థనైతిరా! 13

ఉ॥ నా యిలవేల్పు, నా హృదయనందన నూతన పారిజాత శో
భాయిత మూర్తి, నా నయన, వార్నిధి దేలెడి దివ్యమూర్తి! నా
గేయఝరీతరంగ మధుగీతము, నాకనుపాప–పుత్రు–ప్రే
మాయత దృష్టి జూచు పరమాత్ముడ వీవని–నేనెఱింగితిన్! 14

ప్రభూ! శ్రీరామచంద్రా! అతి శోకావేశంలో, అజ్ఞానురాలినై మిమ్మేమో అనరాని మాటలన్నాను స్వామీ! ఈ పాపిష్ఠి దానికి నిర్వృతి లేదు! నా అహంకారానికి, నా అవివేకానికి, నా అవినయానికి-శిక్ష-నీ రామబాణమే విధించాలి! అయినా భక్తపరాయణుడివి, శరణాగతవత్సలుడివి! నిన్ను నేనిదే శరణువేడుతున్నాను. ప్రభూ! నాకభయమిచ్చి రక్షింపవా? రాఘవా! నీ ఆజ్ఞ శిరసావహిస్తాను. రామా! నా చిన్నారి తండ్రిని, పితను గోల్పోయిన నా అంగదుని – నీవే సంరక్షించు తండ్రీ! పాహిమాం! శ్రీరామచంద్రా! పాహిమాం! (అని శ్రీరాముని పాదాలపై బడి బిగ్గరగా విలపిస్తుంది)

శ్రీరాముడు : (దయార్ద్ర హృదయుడై, మహదానందంతో) లేవమ్మా! తారామహారాజ్ఞీ! శోకావేశంలో, విరహదుస్సహవై నీవన్న మాటలను నేనెన్నడూ పట్టించుకోను. ప్రౌఢవు, ప్రాజ్ఞురాలివి, వీరపత్నివి, వీరమాతవు–నీవే ఇలా బేలవై –శోకించటం తగదు! తారా! అన్నట్లు నా ఆజ్ఞ మన్నిస్తానన్నావు కదూ! అది నాకెంతో సంతోషంగా ఉంది. ఈ కిష్కింధ సమస్తం సుగ్రీవాజ్ఞగా మెలగాలి! అతడే ఈ

కీశధరాధిపతి, ఈ కిష్కింధాపతి! నేడు వాలిని పోగొట్టుకొని, మీరిద్దరూ తుల్య దుఃఖావస్థలో ఉన్నారు. మహారాజైన ఆసుగ్రీవునికి, సర్వసమర్థుడైన సచివుడు కావాలి! అందుకు నీవే తగిన దానివి. తారా! నా యానగా నీ పతని సహధర్మచారిణివై, నాయీ రావణాసుర మారణ హోమంలో ఋత్విక్కువై తోడ్పడాలి. ఇది నీ ధర్మం తారా! చిన్నవాడైనా, అసహాయశూరుడైన నీ సుతుని, అంగదుని భారం–నాకు వదిలెయ్యి తారాదేవీ! – (అని ఆగుతాడు)

**లక్ష్మణుడు:** (సంతోష, ఉత్సాహంతో) అన్నయ్యా! ఈ కిష్కింధకు, ఈ కపిరాజ్యానికీ అంగదుడే యువరాజు! అతని యౌవరాజ్య పట్టాభిషేకం సుగ్రీవ మహారాజ పట్టాభిషేకంతో సమంగా జరిపించాలి!

**హనుమ :** (పరమానందంతో) భళి, భళీ! లక్ష్మణ స్వామీ! అన్నకు తగ్గ తమ్ముడనిపించుకొన్నావయ్యా! నిశిత దృష్టిలో, ధర్మ నిర్ణయంలో! మీరేమంటారు? సుగ్రీవమహారాజా!–

**సుగ్రీవుడు :** (ఆనందాతిశయంతో) మహాప్రసాదం! నామనసు లోని మాటనే శ్రీరామానుజులవారు సెలవిచ్చారు! అలాగే కానివ్వండి. అదే నేను మా అన్నయ్యకు సమర్పించే కృతజ్ఞతా పూర్వక తర్పణక్రియ! మీఆదేశం నేనూ శిరసావహిస్తాను. రామచంద్ర ప్రభూ! (అని ప్రణమిల్లుతాడు)

**తార, అంగదుడు :** (ఇద్దరూ లేచి, సవినయంగా నమస్కరించి) ప్రభూ! శ్రీరామ చంద్రా! మీ ఆదేశమే సుగ్రీవాజ్ఞగా తల దాలుస్తాం. మమ్మల్ని మన్నించి రక్షించు రామప్రభూ! –

**తార :** (భక్తి పారవశ్యంతో)

శా॥ శ్రీ కల్యాణ గుణాభిరామ! సుమనః శ్రీ సంగ, కల్పద్రుమా!
రాకాచంద్ర మనోజ్ఞతేజ! మిథిలా రాజ్ఞీ మనో భృంగమా!
శ్రీకాకుత్స్థ! మరుత్కుమార నుత! సుగ్రీవార్చితా! రాఘవా!
ఓ కారుణ్యపయోధి చంద్రమ! మహాయోగీ! మముఁబ్రోచవే! 15

హనుమ : (ఉచ్చైస్స్వనంతో భక్త్యావేశంతో)

జయమగు భాస్కరాన్వయ శశాంకున కా రఘు వంశదీప్తికిన్!
జయమగు మైథిలీ ప్రణయ సాగరమగ్న మహాచ్ఛ శీలికిన్!
జయమగు మారుతీ హృదయచంద్రున కా జగదేక మూర్తికిన్!
జయమగు వార్షధర్మ పథ సంగత శీలున, కాత్మ వేత్తకున్! 16.

లక్ష్మణ, సుగ్రీవ, తారాంగదులందరూ ఏకకంఠంతో—

జయము జయము లోక కల్యాణమూర్తీ! శ్రీరామచంద్రప్రభూ!
జయము జయము!!! శ్రీరఘునందనా! లోకాభివందనా!

– సమాప్తం–

(ఈ నాటిక ఏప్రిల్ 1981లో ఆకాశవాణి, విజయవాడ కేంద్రం నుండి ప్రసారితమైనది)

(సూచన : పద్యాలు 1 నుండి 16 వరకు – స్వీయకవితలే)

☆ ☆ ☆

# మండోదరీ రావణం

నాటిక

రచన

**జి.వి.సుబ్బారావు**

# మండోదరీ రావణం

**(నాటిక)**

(రావణుని పూజామందిరం. ఓంకార రవం వినిపిస్తుంటుంది సన్నగా)

నేపథ్యం:

**చ॥ జయ జయ! జాహ్నవీ ప్రియ! శశాంక విభూషణ! నీలకంధరా!**
**జయ జయ! భూతనాయక! ప్రసన్న ముఖాబ్జ! ఫణావిభూషణా!**
**జయ జయ! చంద్రశేఖర! నిశాచర మానస పద్మ భృంగమా!**
**జయ జయ! రావణార్పిత దశాస్య సమార్చిత! పార్వతీ పతే!** 1

**రావణాసురుడు :** (గంటమ్రోగిస్తూ, శంఖం ఊదుతూ) ప్రభూ! నీలకంఠా! పరమశివా! దశకంఠ సేవా ప్రమోదితా! నమోన్నమః ఆ! మండోదరీ! ఏదీ కర్పూరహారతి? త్వరగా తీసుకొనిరా హారతి పళ్ళెం.

**మండోదరి :** (ఆత్రుతగా వచ్చి) ఆ ఇదిగో మహాప్రభూ! కర్పూరం. హారతిపళ్ళెం. (అని కర్పూరం వెలిగించి పళ్ళెం అందించి)

శంభో! మహాదేవ! హర హరా! ప్రభూ! నీలకంధరా!

**సీ॥ నా స్వామి భుజములే – నందీశ్వరుని మూపు**
**చిన్నచూపుల జూడ జెలగు దొరవు!**
**నా స్వామి శిరములే – వశివ తుల్యమ్ముగా**
**పూజసేయగ మెచ్చు పుణ్యమూర్తి!**
**నా స్వామి శౌర్యమ్మె – నయనాగ్ని సమమ్మై**
**భువియెల్ల దహియింప పొంగుదేవ!**
**నా స్వామి దృఢభక్తి – నమ్మిన దొరవౌచు**

తద్భక్తి వశమైన – దైవమీవు!
కంఠనాళమ్ము ద్రుంచి, శ్రీకంఠ! నీకు
ప్రాణములనొడ్డి, భక్తి ప్రపత్తు లొలికె–
రావణబ్రహ్మ! నేడు, శ్రీరాము తోడ
పోరుచున్నాడు, దయతోడ బ్రోచవయ్య! 2

(అని సాష్టాంగ నమస్కారం చేస్తుంది)

**రావణుడు :** (హారతియిచ్చి, ధ్యానముగించి) శివ శివా! మండోదరీ! ఎంత అప్రతిష్ఠ! అసహాయ శూరుడైన ఈ రావణుడినే కించపరుస్తున్నావు. నీదీనాతి దీనమైన ప్రార్థనలతో, మహారాణీ! నీ వింత భీరురాలివైనావని నే నూహింప లేదు సుమా! (అని ఆగుతాడు)

**మండోదరి :** (గద్గద కంఠంతో) ప్రభూ! నేనా భీరురాలిని? నేనా అధీరను? కాను! కాను! ప్రియ పుత్రుని వియోగాగ్నిలో దహింపబడే సమిధను స్వామీ! సర్వబంధుజన వినాశనమై, ఈలంకా మహానగరం, పరమశివుని కోపానలంలో భస్మమైన, త్రిపురానగరంలా కనిపిస్తుంటే, దుఃఖాతిశయంతో ఎలుగురాక వెలుగుతోచక, దిక్కుతెలియక, దీనంగా విలపిస్తున్న ఆ రామ బాణాని కెర కాబోవు కపోతిని ప్రభూ! నేను! (అని ఏడుస్తుంది)

**రావణుడు :** (నిట్టూర్చి) అవును! మండోదరీ! అవును! అతిలోక భయంకరుడైన నా ముద్దులపట్టి, మేఘనాథుని మృతితో నా కుడి భుజం విరిగినట్లయి, నాకేదిక్కు తోచటం లేదు. ఇక నీ కన్నతల్లి కడుపు కోత నేనేమని వర్ణింపగలను దేవీ! మహావీరాగ్రేసరుడు, అతిభయంకరుడైన, నా తమ్ముని కుంభకర్ణుణ్ణి, వేలాదివేల అతిరథుల్ని, మహారథుల్ని, అక్షలాది రాక్షససేనా సమూహాన్ని – ఆ రామ శరాగ్ని కింధనాలుగా చేసాను. హతవిధీ! ఒంటరినై నేనే, ఈనాడు మిగిలాను. ఇకనాకెవరూ లేరు. మండోదరీ! ఇక నాకెవరూ లేరు! లేరు! (అని డగ్గుత్తికతో ఆగిపోతాడు)

మండోదరి : (దిగులుగా, భారంగా నిట్టూర్చి) అవును స్వామీ! నిజమే! అరికంఠవిలుంఠనక్రీడలో మహావీరులైన మీరు దశకంఠ మహారాజులు. రాక్షసేశ్వరులు! ఈనాడు ఒంటరివారై నిస్సహాయులైనారు గదా! అయినా మీ త్రినేత్రస్వామి కూడా, ఆ సీతాపతితో చాటుమాటుగా సంధి చేసుకొన్నట్లున్నాడు. అందుకే ఆ పరమ జంగమ మూర్తి, మీరింతగా మథన పడుతున్నా, లింగస్వరూపంలో, బెల్లంకొట్టినఱాయిలా, కిమ్మనకుండా ఉన్నాడు నిర్దయుడై. అన్నట్లు ప్రభూ! తమరీనాడు ఆ సీతా మహాసాధ్వి దర్శనం చేసుకొన్నారా? లేదా?

రావణుడు : (సీతమాట వినగానే, పుంజుకొన్న ఉత్సాహంతో) లేదు! మండోదరీ! నాకిప్పుడు స్ఫురిస్తుంది. ఈ, నా, నిరాశా, నిస్పృహలకు కారణం- ఆ జానకిని, ఆ జగదేక సుందరిని, ఇంత ప్రొద్దెక్కినా దర్శించుకోకుండా ఆలస్యం చేయడమేనని. ఈ ఫాలనేత్రుని పూజాఫలం కూడా, ఆ జలజాయత నేత్ర కృపాపాంగ జ్యోత్స్నాలహరికి సరిరాదు. అయ్యో! మండోదరీ! నీవెంత మందమతివే? నాకింత ఆలస్యంగా ఈవిషయం గుర్తు చేస్తావా? ఒక్కసారి ఆ అశోకవనానికి వెళ్ళివస్తే గాని, ఆ ముద్దియ ముద్దు మొగం తనివిదీరా చూస్తే గాని, ఈనా నయనాలకు తృప్తి, ఈ నామనోవ్యధకు అంతు - దొరకదు. యుద్ధ సన్నద్ధుడైన, శ్రీరామచంద్రుని, జ్యానినాద మదే నన్ను కదనానికి ఆహ్వానిస్తుంది. నాకిక నిలువ వీలులేదు! (అని వేగంగా లేచి కదులుతాడు)

మండోదరి : (పతిని చేయి పట్టుకొని ఆపి) స్వామీ! నామాట వినండి.

**శ్లో॥ మాయా మానుష రూపరంజితుడు రామస్వామి! తత్ప్రాణమై**
**మాయా మోహన రూప కల్పిత కళామాధుర్య పాథోధియై**
**శ్రేయోదాయిని గాక, నీ యునికికే చిచ్ఛక్తియై వచ్చె-న**
**య్యా! యోగీంద్ర మనః సరోజ మధుపంబా సీత-దైత్యారియై! 3**

**రావణుడు :** (వికటంగా నవ్వి) సీత చిచ్ఛక్తియా? సౌందర్య మహాంభో రాశియా? ఏదైనా నేను భరిస్తాను, వరిస్తాను మండోదరీ? (అని కదలబోతాడు)

**మండోదరి :** (పేలవంగా నవ్వి) అవునయ్యా! మహాప్రభూ! అవును. మీకిప్పటికే చాల ఆలస్యమైంది. ఆ భువనేశ్వరి, ఆ త్రిలోకమాత, ఆ విలయకాల తాండవ నృత్యలాస్యమూర్తి, ఆ ఆదిశక్తి ఆ మహంకాళి ఈ సీతామహాసాధ్వీ రూపమై మన ఈ లంకా నగరంలో తిష్ఠవేసుకొంది. నిజమేమరి! ఆమెను సందర్శించనిదే మీకు నిదురరాదు. అయ్యో! మృత్యులహరులు మీదు కట్టి, ఆ జనకుని కూతురై, ఆ రఘువుల కోడలై, రాముని యిల్లాలై ఈనాడు, నా పసుపు కుంకుమలకే ఎసరు పెట్టింది. మహాతల్లి! వెళ్ళి. మంగళారతులు పట్టండి. వెళ్ళండి. క్షణమాలస్యమైనా సహింప లేదా తల్లి ఈ కామభక్తుణ్ణి! వెళ్ళండి. వెళ్ళండి వెళ్ళండి స్వామీ! (అని వలవలా ఏడుస్తుంది)

**రావణుడు :** (చీదరించుకొని, కోపంగా) ఛీ! మూర్ఖురాలా! అసలు సీతావియోగంలోని బాధ, వ్యధ నీకేం తెలుసే? పిచ్చిదానా? ఈ పదితలల వెఱ్ఱివానికి – ఆయుద్ధ భూమిలో కోతి కొండముచ్చుల మధ్య వెఱ్ఱిగా అంగలారుస్తున్న ఆ శ్రీరామ చంద్రునికీ తప్ప వేరొకరికి తెలియదీ అనన్యమనోవ్యథ! ఆ నాడు దండకారణ్యంలో కుహనాజంగమధారియైన నన్ను చూసిన ఆ చురకత్తి వంటిచూపునకు, ఆ జానకీ మధురాపాంగ రోచికీ, నా మనోబుద్ధ్యహంకారాలు, నా పంచప్రాణాలు, నా పదితలలు, నా సర్వస్వం – అంకితమైనాయి. నా మనో భృంగం ఆ సీతాపాద పద్మాలమనోజ్ఞ సౌరభానికి మైమరచి, నిరంతరం అటే పయనిస్తుంది. అయినా! నా ఆవేదన, నా ఆరాటం, నా వియోగావస్థ నీకర్థం కాదులే! మండోదరీ! (అని గాఢంగా

నిట్టూర్చి). నాయీ భావన. మూఢభక్తికీ, తుచ్ఛ కామానికీ, లౌకిక శృంగారానికీ అతీతమైన హృదయాందోళన! ఇది ఒక అలౌకికమైన అనుభూతి. –

మండోదరి : (బిగ్గరగా నవ్వి) అవును. నిజమే మహాప్రభూ! నాకెలా అర్థమౌతుంది మీ అవస్థ. అది స్వయంగా అనుభవించిన మీకే తెలుసుమరి. అయినా నిన్నని ఫలమేమి స్వామీ! – నీ ప్రేమకై, నీ కనుసన్నలకై పడిగాపులుపడి ఉన్న ఈ మహారాణిని నన్ను, ఇంకా వేలాదివేల రాక్షసరాణులను, విన్నేనమ్ముకొని ఉభయభ్రష్టలైన గంధర్వాప్సర స్త్రీలను – మమ్మల్ని అందరినీ మరపించి, నిన్ను తనవైపు పరుగులెత్తించి, దాసాను దాసునిజేసిన ఆ మహామాయావిని, ఆ సీతమ్మ తల్లినే అనాలి! అందుకే స్వామీ?–

**ఉ॥ కొంగున గట్టి విప్పకలు, కోసల రాజ్య రమాధినాధుని**
**న్పంగుని జేసి, తత్హృదయ సంగత కోమల ప్రేమభావ స**
**త్సంగము, జానకీసతికి – స్వాగత మిచ్చితివీవు! వీదుసే**
**తం, గలిగేా, మహాప్రళయ తాండవ నృత్యము, నిత్యకృత్యమై! 4**

ఆ నాడు నీ యప్పగారు, శూర్పణఖ, ఆడుదైన దోషానికి, రాముని మోహించి, తమ్ముడైన లక్ష్మణునిచే ముక్కుచెవులు గోయించుకొని భంగపడినది. కామాంధయైన ఆ యాడుబిడ్డ చెప్పుడుమాటలు విని, మారీచుని హితవు ధిక్కరించి, నీవునూ, కామప్రకోపితుడవై, ఆ సీతామహాయోగీశ్వరిని ఆ ప్రళయానల మూర్తిని చిచ్చొడింగట్టినట్లు ఈ లంకలో, నట్టింట దెచ్చి పెట్టుకొని, ఆమె అతిలోక సౌందర్యాన్ని అవలోకింపలేక భంగపడుతున్నావు ఈనాడు. అయినా ప్రభూ! నిన్నని ప్రయోజన మేమి?–

ఉ॥ అందము రూపు గట్టి, వనితాంతర కోమలభావ సౌరభా
నందము మీదు కట్టి, నయనమ్ములు ముక్తి రమావిలోకనా
నందము జాఱగొట్టి, లలనా హృదయాంతర ప్రేమ భావమౌ
సుందరి, సీత! తత్హృదయశోక మహాగ్ని దహించునెల్లఱిన్ 5

**రావణుడు :** (వికటంగా నవ్వి) భేష్! మహారాణి! నీవై నా ఇన్నాళ్ళకు నన్నర్థం చేసుకోగలిగావు. నా కంతే చాలు. ముల్లోకాలను జయించిన ఈ రావణ బ్రహ్మనే సమ్మోహితుణ్ణి చేసి, తన అలౌకిక సౌందర్యంతో పాదదాసుణ్ణిగా చేసి కొన్న ఆ ధరాతనయ నిజంగా ధన్యురాలు. అయ్యో! దేవీ! నా మనసింక నిలువడం లేదు. ఆ నాడు నా పదితలలుత్తరించి, శ్రీకంఠునికి నా భక్తిప్రపత్తులు నిరూపించుకొన్నాను. ఈ నాడు నా ప్రాణ సుమాన్నే పణంగా అర్పించి, ఆ శ్రీదేవి ప్రేమ దయాభిక్ష నర్థిస్తాను. ఇదే నే వెళ్తున్నా! శోకవనానికి – కాదు! కాదు!–అశోకవనానికి. (అని గబగబా వెళ్ళిపోతాడు)

**మండోదరి :** (పెద్దగా ఏడుస్తూ) వెళ్లండి. స్వామీ! వెళ్ళండి! ఇంక ఈ దీనురాలికి మిగిలేవి కన్నీళ్ళు! గుండెలు పిండే వియోగాగ్నులు. అయినా నా ఓర్పు పరాకాష్ఠ చెందింది ప్రభూ!–

**ఉ॥ ఓర్చితి, స్వామి! కామభరితోగ్రత, రంభను బల్మి బట్ట – నే**
**నోర్చితి, కాలవహ్నిని, అయోనిజ – లంకను తెచ్చి పెట్ట – నే**
**నోర్చితి, మేఘనాథు మరణోద్ధృతి – నేటికి వాడు పుష్టి – పో**
**కార్చెడి, రామచంద్ర విశిఖాగ్నుల నోర్వగలేము! రావణా! 6**

అయినా నా పిచ్చిగాని స్వామీ! మీ భుజ బలాన్ని, ఆ ఆది దంపతుల అనుగ్రహాన్ని నమ్ముకొన్న నా ఆశలు వమ్మైనాయి. విశ్వం శూన్యంగా తోస్తుంది.

**ఉ॥ నమ్మితి నా మనమ్మున సనాతనులైన ఉమా మహేశులన్!**
**నమ్మితి, సర్వదేవత వినాశన కీర్తి, దశాస్య మూర్తినిన్!**
**నమ్మితి లంకయంత యిలు–నాశన మొందదటంచు, నేటికీ**
**నమ్మికయెల్ల వమ్మయి, అనాథను, రామశరాగ్ని దగ్ధనున్! 7**

రావణబ్రహ్మ! జానకీసతిపై నీకింత వ్యామోహ మేలనయ్యా?

**ఉ॥ రాముడు శైవకార్ముకము, రాజసమక్షమునందు ద్రుంపగా,**
**రాముడు మాయలేడిని, శరమ్మున గూల్చగ, మేఘనాథు, సం**
**గ్రామము నందు, లక్ష్మణ శరాకృతి చంపగనైన నోర్చి – సు**
**త్రామవిరోధి! నేడకట! రామసతీ కరుణమ్ము నోర్తువే? 8**

ప్రభూ! చూసి చూసి చిచ్చును ఎవరు ఒడి గట్టారయ్యా? అందగత్తెలకే అందగత్తె యైన, స్త్రీ జాతికే ఒరవడియైన, ఆ సీతామహాసాధ్వినే బంధిస్తావా? ఎంత పిచ్చి నీకునాథా?

**ఉ॥ అందము లెల్ల రామసతి కంకితమయ్యెను! రామ! రామ! కా**
**మాంధుడు, రావణాసురుడు మాతృ సమాన, ధరాత్మజాతనున్**
**బంధిత జేసె, లంక యనుబంధము నాకిక తీఱె – రాఘవా**
**నందము, రాక్షసావళి వినాశము·లొక్కటగల్గె – నిత్తఱిన్ 9**

ఇన్నాళ్ళుగా, నన్ను పట్ట మహిషిగా ప్రణయ సామ్రాజ్ఞిగా మన్నించిన నాపతి, రావణబ్రహ్మ– ఈనాడు పరస్త్రీపై, కులసతిపై సీతాసతిపై మరులుగొని, ఆత్మ వినాశనముకే పరుగులు పెట్టుచున్న ఈ తరుణాన నేను బ్రతికి ఏమి ఫలము? ఓసీతమ్మ తల్లీ! నా మాంగల్యానికే ఎసరు పెట్టిన నీవే నాకిక శరణ్యం!

**శా॥ ఈ, నా, దేహము రావణాసుర తనూహేలా విశేషమ్మునై**
**ఈ, నా, మానము, రాక్షసేశ్వర మనః ప్రేముగ్ధ భాగ్యమ్మునై**
**ఈ నా సర్వము స్వామి భక్తి పథమై, యిన్నాళ్ళు జీవించితిన్!**
**ఈ నా ప్రాణము లీవె చే కొనుచు బోవే! సీత! పుంస్త్రీగతిన్! 10**

ప్రభూ! మీరు త్రిలోకాధిపతులే కావచ్చును. దశభుజ పరాక్రమశాలులైన రాక్షసేశ్వరులు కావచ్చును. అయినను మీకీ మునిజన హింసయేల? ఈ నయవంచన లేల? ఆడువారినిలా ఆరడిపెట్టే హక్కు మీకెవరిచ్చారయ్యా? పరాంగనా ప్రణయం పాపమనుకోక, దానిపై ఇంతటి వ్యామోహం పెంచుకోవడం, హాలాహలం మ్రింగడం కాదా స్వామీ? - మీ ఆరాధ్య దైవమేమో, కామవిరోధి, మన్మథారి. కానీ మీరో అందుకు పూర్తిగా విరుద్ధం. కామాంధులై, చెప్పుడుమాటలు విని, ఆ రఘురాముని యిల్లాలిని, జనకజను బలాత్కారంగా పట్టి తేవడం - అందునా ఎవరూలేనప్పుడు. దొంగచాటుగా వెళ్ళి తీసుకురావడం-తెచ్చి, ఈ లంకలో ఈ అశోకవనిలో బంధించడం, ఆమె కన్నీరు మున్నీరుగా ఏడుస్తుంటే వికటాట్ట హాసం చేయడం - ఇవన్నీ మీకు న్యాయం అని తోచాయా? ప్రభూ! నేడు ఆ తల్లి వియోగాగ్ని, రాజి, రగిలి, మారణ హోమమై, నిన్నూ, నన్నూ, ఈ లంకామహా సామ్రాజ్యాన్నీ నిలువునా దహిస్తుంటే- నిస్సహాయులైనారు మీరు? ఈ లంకంత కొంప బూడిదపాలైంది. ఆ చిచ్చును కోరినట్టింట తెచ్చిపెట్టుకున్నారు ప్రభూ! అంతా సర్వనాశనమైంది. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. నా మఱది విభీషణుని మాటపాటించి, ఆ శ్రీరామచంద్రుని శరణు గోరి, జానకిని పువ్వులలో బెట్టి రామునకు తిరిగి అప్పగించండి. ఈ నా మాంగల్యాన్ని, ఈ లంకానగర సౌభాగ్యాన్ని పరిరక్షించండి ప్రభూ! (అని ఏడ్చి కూలబడుతుంది) - (లేచి) అయినా నా పిచ్చిగాని, వమ్మా, ఈ లంకమా రక్షించే వారెవరూలేరు. లేరు. ఆహా! రామచంద్రా! నీరామబాణానికి ఇరువై వులా పదునుగదయ్యా! - తండ్రీ!-

ఉ॥ వేదము లుద్ధరింప జలవీధుల దేలెడి మత్స్య మూర్తి! ప్ర
హ్లాదుని బ్రోవ, సింహదరహాసము నూనిన వీరమూర్తి! ధ
ర్మోదయ మయ్యె! నీ శర మమోఘము, రాఘవ! భర్తృహీన! మం
డోదరి! శోకమగ్న! – సుఖడోలల దేలె ధరాత్మజాతయున్ 11

ఉ॥ రామశరాగ్ని కింధనము, రాక్షస సైన్య మహాటవీతతుల్
రామ సహోదరోజ్జ్వల శరానల దగ్ధుడు, మేఘనాథు, డా
రాముని కెంపు కన్నుదలు రావణ భావ వినాశనమ్ము, లా
రామ సతీ కృపానయన రమ్య శిఖార్పిత మెల్ల లంకయున్! 12

రఘురామా! స్వయంకృతాపరాధను! మగని సరిదిద్దలేని మగనాలిని ప్రభూ!

ఉ॥ సోదరి గర్వభంగ గత సూచిత, రావణ కోపవహ్ని, కా
కోదర జిహ్వయై, జనకు కూతు-నమాంతము మ్రింగబోవ, నం
భోదరవర్ణ సుందరుడు, భూసుత మానసవర్తి, నన్ను, మం
డోదరి, నిస్సహాయగ, ప్రభూ! రఘురాముడొనర్చె నిర్దయన్.13

అయినా రామచంద్రా! నాస్వామి నీ అప్రతిహతమైన రామబాణం మూలముగా, సీతమ్మ తల్లి కరుణవలన, కైవల్యమందగలడు. ఎట్లనగా,-

ఉ॥ కామవిషమ్ము కన్నులకు కాటుకగాగ, పరాంగనా మనో
రామము నాక్రమింప, రఘురామ శరాంజన ప్రాభవోన్నతిన్
కామము సర్వ నాశనముగా, జనకాత్మజ కంటిచూపు, ని
త్యామల స్వర్గ మౌచును దశానను కబ్బుత మోక్ష రాజ్యముల్. 14

సీతా పునస్సమాగమానందంలో ఈదీనురాలిని, ఈ అనాథను మరవకయ్యా! శ్రీరామచంద్రా! పతివ్రతను, రావణేశ్వర పట్టమహిషిని, నన్ను రక్షించుప్రభూ!

మండోదరీ రావణం

ఆ.వె॥ దుష్టు డయ్యు పతివి దోసంబు లెంచక
వయసు మనసు లిచ్చి వలచినాను!
భవుని భక్తు డైన భర్తయే మరణింప
రామ! రామ! బ్రతుకు రచ్చకెక్కె!!

(అని ఏడ్చి, ఏడ్చి వేలవ్రాలుతుంది)

—సమాప్తం—

(సూచన: పద్యాలు 1 నుండి 15 వరకు స్వీయకవితలే)

☆ ☆ ☆

# నీలవేణి

(నాటిక)

రచన

జి.వి.సుబ్బారావు

# నీలవేణి

## (నాటిక)

## ప్రథమాంకము

(నీలవేణి తనపూజామందిరంలో, పరమశివుని ధ్యానంలో నిమగ్నమై ఉంటుంది)

**నీలవేణి :** (చేతులు జోడించి, నమస్కరించి, వినమ్రమయ్యె)

**చ॥** **జయ! హలా హల, నీలకంధర! మహేశా! భక్త చింతామణీ!**
**జయ! గంగాధర! చంద్రశేఖర! జగత్స్వామీ! కృపాంభోనిధీ!**
**జయ! నీహార ధరాధరేంద్ర తనయా చారుస్తనద్వంద్వ సం**
**శ్రయ సంలగ్న పటీర కుంకుమ రజస్సంపన్న బాహంతరా!** 1

ఆదిదేవా! జంగమ దేవరా! ఈతనూ మనః ప్రాణములు నీవి! ఈ యౌవన దశావిర్భూత కోమల తనూ సుమ వికసనము నీకైంకర్యమునకే ప్రభూ! ఈ దాసురాలు నీసేవకై అనువుల నిల్పి కొన్నదిరా! శివా! నాయీ బాహ్యశరీరము సంప్రదాయగతమై, నారాయణవనపుర ప్రభువులు, యాదవరాజుల పళ్ళెరపు దాసీత్వమున కమ్ముడు వోయినను; నాహృదంతరాలలో, నానరనరాలలో, నాప్రతిరక్తబిందువులో, నాప్రత్యణువు నందు-సర్వభూతపతియైన నీవే నిండి యున్నావురా శివా! అభవా! నీవు వినా నాకీ ప్రపంచమున ఏమియును లేదు. నన్ను మన్నించి నా ప్రార్థన నాలకించి, నన్ను నీ కృపా భాగీరథీ తరంగిణుల దేల్చి, నీ జటాజూట చంద్రమః కళాజ్యోత్స్నా వికాసముల నోలలాడించి, రక్షింప రారా! ప్రభూ! మహేశా! పరమశివా! పాహిమాం! పాహిమాం.

(అని స్ఫటిక శివలింగమునకు మోకరిల్లి తన్మయత్వంలో మునుగుతుంది)

అలివేణి : (చెలికత్తె-గబగబాలోనికి వచ్చి) అక్కా! నీలవేణీ! రావే! రావే! అతి త్వరగా రా! మన రాజవీథిలో నవమోహనా కారుడు, రూప జితమన్మథుడు, భస్మ త్రిపుండ్రాంకితుడు, పరమజంగము మూర్తి, వేంచేస్తున్నాడే! ఆ మహాను భావుణ్ణి చూడటానికి వేయి కళ్ళైనా చాలవు. మంచుకొండలను వదలి, కైలాసాన్ని త్యజించి, నగజాతను విస్మరించి, దివినుండి భువికి తరలి వచ్చిన అభినవమన్మథారివలె నున్నాడే? ఆ సొగసుకాడు! రావే! కదలి వచ్చిచూడవే! కన్నుల పండువైన ఆ జంగమ స్వామిని!

నీలవేణి : (పూజనుండి తత్తరపాటుతో లేచి) ఏమిటే? అలివేణీ! నా శివధ్యానము భంగమొనర్చినావుగదే! కలలోనైన, క్షణకాలమైన నాస్వామి కన్పించునేమోయని వేచియున్నాను గదవే! అయినా ఎవరే ఈ కుహనాజంగమ స్వామి? అంత చక్కని వాడా? ఏడీ? నాపరమశివుని కన్న మోహనాంగుడా అతడు? పదపద! పోయి చూతము! (అని గబగబా వీథిలో పరుగెడుతుంది)

అలివేణి : (వెనువెంటనే వస్తూ) అదుగోనే! ఇటే మనయింటివైపే వస్తున్నాడు. పురుష వృషభంలా ఆ మధురమోహనమూర్తి, మనదెసకే కదలి వస్తున్నాడు. ఎంతనయనానంద కరమైన మూర్తి ఆయనిది గదే! (అని విస్తుపోతుంది)

నీలవేణి : (కనులారా చూచి, తన్మయత్వంతో) అహో! అపర శివావతారా! జంగమ దేవరా!...

శా॥ నా స్వాముల్, జనుదెంచివారు, కుహనా నాగేంద్రమాలా కృతుల్!
నా స్వాముల్, ప్రమథాది వందిగణ ప్రజ్ఞా భాగ్యదూరీకృతుల్!
నా స్వాముల్, గిరిజా వధూ విముఖ సన్యాసుల్, జటాధారులౌ!
నా స్వాముల్, రజతాద్రివాస విముఖుల్, నాకాధిప స్వాములౌ! 2

అహో! ఎంత మధురాతి మధుర మోహన సన్నివేశమిది?

సీ॥✷। అడుగు నెత్తమ్ముల నపరంజి పావాలు,
కరమున గేదార కంకణంబు,
బంగారు వ్రాత చెఱంగుల గోణాము,
గళమున రుద్రాక్ష కంఠమాల,
ఒక కేల భసిత భస్త్రిక తోడి బెత్తంబు
సందిగట్టిన తరుణేందు ధరుడు,
మాణిక్యరుచుల యొడ్డాణంబు, భూతిపై
బెట్టిన, కస్తురి బిళ్ళబొట్టు
సార్వకాలిక తాంబూల చర్వణార్ద్ర
రాగ సౌభాగ్యమున, బద్మరాగమణుల
ధృణముగా చూచుదంత పంక్తియును గలిగి,
కపట జంగమ రూపి – నాకనుల విందె! 3

అలివేణీ! నా జన్మనిజంగా ధన్యమైనది పదవే! (అని వీథిలోనికి వెళ్ళి, ఆ జంగము దేవరకు సాగిలబడి మ్రొక్కుతుంది)

**జంగమదేవర :** (గంటవాయిస్తూ) కల్యాణీ! నీకు శుభమగుగాత! లెమ్ము! నీ అభీప్సిత మీడేరుగాత! ఈ భస్మము నీ నుదుట దిద్దుకొనవే! నీలవేణీ!

**నీలవేణి :** (లేచి భక్తితో జంగము దేవర పాదపద్మముల కళ్ళకద్దుకొని) మహాప్రసాదం జంగమదేవరా! ప్రభూ! తమరు నాపేరెట్లు తెలుసుకొన్నారు? మీరు దయచేసి, ఈ పేదరాలింటిని పునీతం చేసి నా విందు లారగించి, నన్నను గ్రహించండి. ప్రతి దినమును జంగమార్చనమును చేయక నేను పచ్చి నీళ్ళైనా ముట్టను స్వామీ! నన్ను మన్నించి, నా ఆతిథ్యం స్వీకరించి, కృతార్థురాలిని చేయండి ప్రభూ! (అని దీనంగా వేడుకొంటుంది)

**జంగమదేవర :** (నవ్వుతూ) వినీలకచభరవు నీలవేణివిగాక మరేమౌతావు

నీవు? అయినా నాకు ఆతిథ్యమిస్తానంటున్నావు. మఱి వెనుకంజ వేయక, మేము అడిగిన కోర్కెలనెల్ల తీర్ప సమర్థురాలివా నీవు? హిమధర శృంగసానువుల శీతలచ్ఛాయలవీడి, వియోగార్తులమై చరించు, మాకు నీ పయోధర శృంగసానువుల నీడలలో దప్పి తీరుస్తావా? ఏమంటావే? నీలవేణీ!

**నీలవేణి :** (కలకలానవ్వి) ఓయీ! కుహనా జంగమరూపా! నా మనసునే పరీక్షింప వచ్చితివా? ఈతనూ మనః ప్రాణాలు నీవి. వీనిని మీయిచ్ఛ వచ్చిన రీతిని గ్రహించి, నన్నునుగ్రహించండి ప్రభూ! తమరిక ఆలసింపక లోనికి దయచేసి, నా ఆతిథ్యమును స్వీకరింపండి స్వామీ! (అని యింటిలోనికి దారి తీస్తుంది. ఆమె వెంట గంటవాయిస్తూ "హర! హర! మహాదేవ! శంభో!" అని ఉచ్చైస్స్వనంతో పలుకుతూ జంగమదేవర ఆమె వెనువెంటనే వస్తాడు)

## ద్వితీయాంకము

(నీలవేణి జంగమదేవరను అర్ఘ్యపాద్యాదులతో అతి భక్తితో పూజించి, భోజనం వడ్డిస్తుంది. విసనకఱ్ఱతో విసురుతూ)

**నీలవేణి :** జంగమదేవరా! జాగైనందుకు కోపింపక సావకాశముగా ఈ పేదరాలి చేతివంట ఆరగించండి. నావంటకములు మీకు రుచించినవా స్వామీ? ఇదిగో! మధురాన్నము. ఇది పాయసము ఇది పంచామృతము ఇవి కదళీఫలాలు. ఆ రజత పాత్రలో ద్రాక్షాసవమున్నది. ఈ భక్ష్యభోజ్యము లన్నియు మొగ మోటములేక స్వీకరించి నన్ను కృతార్థురాలిని చేయండి! (అని నమస్కరిస్తుంది)

**జంగమదేవర :** (తృప్తిగా మందహాసం చేస్తూ) నీలవేణీ! నేడు మాకు, మహదానందంగా ఉంది! అయినా నీ మృదులాధ రామృతం

కన్న రుచియా ఈ పంచామృతం? నీ నయనాపాంగసిత రోచులకన్నా మధురములా ఈ గోక్షీరాలు? నీ వీణియ మీటినట్లున్న మృదుమధుర భాషణములకన్న తీపియా? ఈ ద్రాక్షాసవం? నీలవేణీ! నీ అతిలోక సౌందర్యావలోకనమే నాకు మృష్టాన్న భోజనం. అవునా? నీ వినీలకచ భరమే నా కతి ప్రీతిపాత్రము నీలవేణీ!

**నీలవేణి :** (సిగ్గుల దొంతరయి) దేవరవారు శృంగార రసతరంగితులై, జితమన్మథారులై నన్ను సిగ్గిల చేస్తున్నారు. కర్పూర సుగంధ మిశ్రిత చందన తాంబూలాదుల సేవించిన తర్వాత, ఆ విందునూ తమరు ఆరగిస్తురు గానీ స్వామీ!-

**జంగమదేవర :** (పరమ సంతోషంతో) భళి భళీ! నీలవేణీ! అతి శ్రద్ధాభక్తులతో శృంగారమధుర భావనతో ఒసంగిన నీ ఆతిథ్యం - సర్వతో ముఖమైన ప్రతిభా సమున్మేషమైన విద్వత్కవిత్వమువలె మాకత్యంత ప్రీతిపాత్రమైనది. నీవు ధన్యవు! మా ఆకలి దప్పులు - నీ పరిచర్యచే, మా హృదయావేదన - నీ నిశ్చల భక్తిచే, మా వియోగార్తి - నీ ఆత్మ కైంకర్యముతో సమసినవి. నేడు మా కెంతో సంతోషముగా నున్నది నీలవేణీ! (అని భోజనము ముగించి లేచును)

(ఇరువురును శయ్యాగృహమున మృదుతల్పముపై కూర్చొని యుందురు)

**జంగమదేవర :** (తాంబూలము నములుచు) కోమలీ! ఏదీ నీకెమ్మోవి? ఈ తాంబూల రాగమునకు దీటగునేమో చూతము? నా ప్రతిబింబ మును-ద్విగుణీకృత సౌందర్యముతో-నీనయన దర్పణమున చూసి, తరింతును. ఏదీ? నీతనూ కుసుమ విలాసము, నా గాఢ పరిష్వంగమున హృదయోల్లాస మొనర్పనీ! (అని నీలవేణిని బిగికౌగిలిలో గాఢంగా బంధిస్తాడు)

**నీలవేణి :** (కౌగిలిలో ఒదిగిపోతూ, తన్మయత్వంతో, అర్ధనిమీలిత నేత్రయై)

ప్రభూ! అపరశివా! శంకరా! ఇన్నాళ్ళు నాయీ శరీరాన్ని పాలతో, వెన్న మీగడలతో పోషించుట మీ సేవకే! మీకైంకర్యమునకే! ఈతనూ కుసుమ సౌరభము దేవరకు ధూపనివాళికే! దేవరా! ఈ నా కనులలో తొంగిచూడుడు! మీ దివ్యమంగళమూర్తి ద్విగుణీకృత ప్రకాశముతో వెలిగిపోవుచ్నది. ఈ తనూ ప్రకంపనము చూడుడు. మీ దివ్యాలింగనా సౌఖ్యానుభూతి నందగా పలవరించు చున్నది. పయ్యెద మాటున ఈ నా లేతయెద తొందరపాటు చూడుడు. మీ హృదయ సమాగమమునకై కలవరపడి పైకెగసి పడుచున్నది. ప్రభూ! ఈ నా తనూరంగము పరమ శివతాండవ నృత్య కళారంగము. ఈ నా మై చెమరింత చూడుడు. శివాలాస్య స్వేదము వలె మున్నది. మీ దృఢ బాహు బంధముల నలిగి నా భవ బంధములు విముక్తి చెందినవి. మీ హృదయసాన్నిధ్యములో నామనో వికారములు సమసి పోయినవి. జీవాత్మ, పరమాత్మలో వైక్యమొందుపగిది, మీ అతిలోక సంయోగముతో నేను ధన్యనయ్యెదను స్వామీ! నేడు నిజముగా మీ సాక్షాత్కారమున తరించితిని శివా!

**జంగమదేవర :**(ఆనందంతో) నీలవేణీ! నీ భక్తికి, నీ ఆత్మార్పణకు – ఈ నీలకంఠు డెంతో సంతోషించాడు. మహాభక్తురాలైన నీతో నా సంయోగము కేవల శారీరకమైనదిగాదు. అది హృదయ సంబంధి. అతీంద్రియమైన, అలౌకికమైన సమాగమమిది. నీ నీలి కురులలో వినీలగంగా తరంగాలను, నీ మృదుమంద హాసంలో శరశ్చంద్ర జ్యోత్స్నా ప్రకాశాన్ని, నీ సిత, దంత కాంతులలో, ధవళహిమ వత్పర్వత కాంతులను, నీ మనోహర వదనారవింద ప్రకాశంలో, గౌరీ కమనీయ ముఖకాంతినీ, నీ అతిలోక సితతనూ సౌందర్యంలో కైలాసలోక రామణీయకతను అనుభవించి, దర్శించి పరవశించాను. వియోగాతీతమైన ఈ మన హృదయ సంయోగం

శివాలాస్య, శివతాండవ సంయోగ పరాకాష్ఠ. నీలవేణీ! నీ ఒడిలో నా కనన్యమైన ఆనందానుభూతి కలిగింది. అది కైవల్య తుల్యంగా భావించి తరించు కల్యాణీ!

**నీలవేణి :** (సంతోషాతిశయంతో కరగిపోతూ) ప్రభూ! ధన్యురాలను! నా జన్మ తరించింది, మీ సాంగత్యంతో. (అని జంగమదేవర ఒడిలో ఒదిగిపోతుంది. వారిరువురూ అలౌకిక తన్మయా వస్థలో ఉంటారు)

(నేపథ్యంలో మృదుమధురమైన సంగీతం వినిపిస్తుంటుంది)

**అలివేణి :** (హడావుడిగా వచ్చి) అయ్యో! అక్కా! కొంపలంటుకొన్నాయిగదే! నీలవేణీ! నీవు ఈ జంగమస్వామి సేవలో మైమరచి, ఈనాటి రాజుగారి పళ్ళెరపు సేవ నీవంతని మరిచావే తల్లీ! ఎంత పొరపాటైంది. అపరాహ్ణం దాటింది. అందుకేనేమో యాదవరాజులు మధ్యాహ్న మార్తాండులై ప్రళయకాలరుద్రులై, నీ అపరాధానికి నిన్ను పట్టితెమ్మని - యమ భటుల్లాంటి రాజభటులను పంపినారే! నీలవేణీ! ఇకనైనా లేచి రావమ్మా! లేకుంటే వాళ్ళే నిన్నీ అపస్మారక స్థితిలో నుండి లాగికొనిపోగలరు! లే! లే! (అని తొందరిస్తుంది)

**నీలవేణి :** (భారంగా కనులెత్తి, ఆనందంతో నిట్టూర్చి) అయ్యో! అలివేణీ! అప్పుడే తెల్లవారిందా? ఈ పరమసుఖానుభూతిలో నా ఒడలు నాకే తెలియటంలేదు. ఏదో మహాస్వప్నలోకాల తేలుతున్న ట్లున్నది. నేను కదలిన స్వామికి నిద్రాభంగ మగునేమో గదా? చెప్పసిగ్గగుచున్నదే చెల్లీ! భస్మమలదిన వారి తనువే నాకాచ్ఛాదనముగా నున్నది గదా! అయ్యో! - నాకేది గతి?

**అలివేణి :** (కలవరపడి, మొత్తుకుంటూ) ఓసి! పిచ్చితల్లీ! మహారాజుల క్రోధాగ్నిజ్వాలలు, వేత్రహస్తుల రూపంలో నిన్ను మ్రింగబోవు చున్నవిగదే! నీ జంగమ స్వామిని రక్షించుకొనుటకైనా త్వరగా తెమిలి రావే! మందమతీ! 'పిచ్చుకపై బ్రహ్మాస్త్ర' మని అబలను

నిన్నొకతెను బంధింప పలువురు రాజభటులు పొంచి యున్నారే వాకిట! కదలిరావే! నీలవేణీ! కదలిరా త్వరగా!

**నీలవేణి :** (మత్తువదలి, సంభ్రమంగా లేచి) అయ్యో! నా మతి మండిపోను! ఎంత తడవు చేసితినే చెల్లీ! రాజసేవకు. నా ఆలస్యమునకు మన్నింపుమని రాజుగారిని క్షమాభిక్ష వేడి, త్వరలో మరలివస్తాను. స్వామివారు నిదురలేవకముందే తిరిగివస్తాను. అలివేణి! వారికే లోటు రానీక చూసుకోవే మరి! (అని దిగులుగా కదిలిపోతుంది)

**అలివేణి :** (వెక్కివెక్కి ఏడుస్తూ) అక్కా! రాజసేవకై ఈ విధంగా ఉన్నపళంగా లేచి వెళ్తావా! ఏది తల్లీ! ఒక్కసారి ఆ నిలువుటద్దంలో చూసుకో నీవేషం! ఎలా ఉన్నావో చూడు? తొందరలో ముడివేసుకొన్నావేమో – నీ క్రొమ్ముడి జారిపోతుంది. నీ చీరంతా నలిగి అస్తవ్యస్తంగా ఉంది. నీ మెడలో రత్నహారాలు పెనవేసికొని చిక్కుపడ్డాయి. ఎఱ్ఱబడి, నీకను లుబ్బినవి. నీ పెదవులు కంది, ఎఱ్ఱనై, నీపదములు భారమై, నీ నడక మంద మందమై నీవొక మన్మథ కేళీ విలాప భరాలస వలె నున్నావు తల్లీ! ఇట్టి నీఅవస్థ, నీ యీ విచిత్రాకారం చూచి రాజుగారు మరీ మండిపడరా?

**నీలవేణి :** (విషాదంగా నవ్వుతూ) అవునే! అలివేణీ! నా అవతారం చెప్పనలవి గాకుండా ఉంది. (గాఢంగా నిట్టూర్చి) – నిజంగా వధ్యస్థానానికి ఈడ్చుకు పోబడే బలిపశువులా, నిందితురాలిలా, అపరాధినిలా ఉంది ఈ నీలవేణి! అయినా పరమజంగము స్వామికి అర్పితమై, కైంకర్యమైన ఉత్తమా కుసుమము ఒరులకెట్లు తోచిన నాకేమి? సర్వజగద్రక్షకుడు, వాకులదైవము, ఆ శ్రీకాళహస్తీశ్వర స్వామియే నన్ను రక్షిస్తాడు నన్నీ ఆపదనుంచి (అని ధైర్యంగా కదిలిపోతుంది రాజప్రాసాదానికి)

# తృతీయాంకము

(రాజాంతఃపురంలో దోషిలా భటులమధ్య నీలవేణి, ఎదురుగా సింహాసనంలో యమధర్మరాజులా యాదవరాజు కోపంగా ఉంటారు)

**యాదవరాజు :** (కోపంతో) ఓసీ! భ్రష్టురాలా! నీ సేవా ధర్మమునే విస్మరించావా? ఈ విచిత్రవేషమేమిటో నీకు?

**చ॥*** **అనయము పళ్ళెరమ్ము వినయమ్మున భోజన వేళనుంచు, యం**
**గన విదియేమి? మన్మథ వికార తనూపుల కాంకురమ్మెలా**
**మనసిజ మోహనాస్త్ర గత మర్మకళా నిపుణాంతరంగవై**
**నను గనవత్తు వోసి!! కుహనాంతర జంగమ రూప లోలతా!4**

ఎందుకే నీకీ మిడిసి పాటు? కామావేశ పరవశమున నన్ను దర్శింప వచ్చావా? దుర్మతీ! నీవుదాసివా? లేక కామకేళీ లోల విలాసినివా? నిన్నింతగా ఉన్మత్తురాలిని చేసిన ఆ అపర మన్మథాకారుడెవరే? నిన్నిట్లు రాజద్రోహానికి, కామాంధతకు ప్రేరేపించిన, ఆ కామరూపుడెవడో చెప్పు! (అని గద్దిస్తాడు)

**నీలవేణి :** (జంకులేకధైర్యంగా)మహారాజా! నేను చేసింది నిజంగా తప్పుకాదు. మా యింటికి వేంచేసిన పరమజంగమస్వామి నారాధిస్తూ, రాజులకే రాజైన, ఆ చంద్రశేఖరుని తనియిస్తూ, ఇంతతడవు చేసితిని. అంతే! అతిథిసత్కారము, జంగమారాధనము తమకునూ ఇష్టమే గదా! ప్రభూ! ఈ చిన్న తప్పిదాన్ని మన్నింపుడు. అయినా కేవల నారాయణ వనపుర ప్రభువులు మీరు. ఆయనో–సమస్తచరాచరజగత్తుకే ప్రభువు. త్రిజగన్మూర్తి. ఆయనను సేవించుటే నా పరమకర్తవ్యము.

**యాదవరాజు :** (భగ్గునమండిపడి) ఛీ! నీచురాలా! కామాంధవై మిండ జంగముతో కులికి, ఎగ్గుసిగ్గులు లేక, ఈ పిచ్చి అవతారంలో నా ఎదుటకు నిర్భయంగా వచ్చి నిలిచిన నిన్ను మన్నింపవలెనా?

ఎంత అహంకారమే నీకు దాసీ? ఆ కుహనా జంగమమా నీ జగత్ప్రభువు? ఈ నీ మహాపరాధమునకు, ఈ అవినయానికి, నీ తలబిరుసు మాటలకు నీ తలయే తీయింపవలెను. కానీ ఆడుదానవని, దాసివని, మన్నించి, నీ గర్వభంగమగుటకు, అందగత్తెనన్న నీ అహంకార మణచుటకు, నీ వినీల కచభరము తీయింతును. నున్నగా నీతల గొఱిగించి, నీ కేశపాశమేగాక, నీ మోహపాశముల నడంతును అట్లైనగాని నీ పొగరణగదు! ఆ! ఎవరక్కడ? ఈనీచురాలిని, ఈ గర్విష్ఠిని పట్టి శృంగభంగ మొనర్చి వదలివేయుడు. (అని కోపావేశంతో లేచి పోతాడు)

**నీలవేణి :** (కుప్పగా కూలి, చేతులతో ముఖం కప్పుకొని, పెద్దగా ఏడుస్తూ) అయ్యయ్యో! ఎంత ఘోరమైన శిక్ష విధించారు మహారాజా! నా తలనిలువుగా నరికినా నేనెంతో సంతోషించెడి దానను. సాటి ఆడువారందరు ఈర్ష్య పడునంతటి నిడుపైన, ఒత్తైన, ఈ వినీలకచభరాన్ని నాకు దూరం చేసి, నన్నొక విరూపినిగా మార్చి, పరిహసిస్తారా ప్రభూ! అహెూ! ఎంతకఠిన శిక్ష నా యీ చిన్న తప్పిదానికి? స్వామీ! శ్రీ కాళహస్తీశ్వరా! నిన్నేనమ్ముకొని, ఆరాధిస్తున్న ఈ బేలపైన, నీకూ ఆగ్రహమా? తండ్రీ! నా కేది దిక్కు? (అని వలవలా ఏడుస్తూ పడిపోతుంది)

(నేపథ్యంలో)

**క॥* పంచిన, జలదము వాసిన**
**చంచలయున, జంచరీక సంబంధ విహీ**
**నాంచిత లతయున, లజ్జా**
**చంచల గతివేగ్గి, తపసి చరణంబులపై!** 5

**నీలవేణి :** (బోడియైన తలపై చెరుగుచేర్చి, పెద్దగా రోదిస్తూ వచ్చి, జంగము స్వామి పాదాలపై బడి) ఓ పరమజంగమమూర్తీ! ఓయీ ప్రభూ! ఓహెూ మన్మథారీ! ఈ అనాకారిని, ఈవికృతరూపిని, ఈ అనాథను

రక్షించు! మీ వినీలవేణి ఈనాడు ముండిత శిరస్కయై, ఖండిత నాయికయై, నిస్తేజయై, వసివాడిన పూవై, పరాభవింపబడిన ఆడుపులివలె, తాడితభుజంగిని వలె, దీనయై – మీకీ దుర్గతి విన్నవింప తిరిగి వచ్చినది. పరమకరుణామూర్తి. చంద్రశేఖరుడు భక్తుల తప్పిదము లెన్నైన మన్నించి రక్షించునుగదా? కానీ ఈ రాజశేఖరుడు నా యీ ఒకే ఒక తప్పునకే నిర్దయుడై, కఠినుడై, నా నీలికురుల తొలగించి, నా నీలవేణీ నామమును నిరర్థకం చేసి, నన్ను అంద విహీనురాలిని చేసి, ఘోరంగా పరిభవించాడు ప్రభూ! ఇంతకన్న నాతల తీసిన నేనెంతో సంతోషించెడి దానిని గదా? స్వామీ! అయ్యో! నేనే మొగము పెట్టుకొని, లోకమున తిరిగి తల ఎత్తుకొనగలను? ఆ జగన్నాథుని అలౌకిక సంయోగంలో సనాథనైన నన్ను, ఈ నరాధముడు తలగొరిగించి ఇంతగా అవమానించెనే? అనాథగా చేసెనే? మిక్కిలిచక్కని దానినని, నిడుపైన నీలికురులతో నీలవేణినని మురిసి, విరిసిన నాకింతటి పరాభవమా ప్రభూ? నేనిక జీవింపలేను. నాకీ స్థితి దుర్భరము స్వామీ! (అని వెక్కివెక్కి ఏడుస్తుంది)

**అలివేణి :** (పెద్దగా ఏడుస్తూ) అక్కా! నీలవేణీ! అయ్యయ్యో! ఎంతఘోరం జరిగిపోయిందే? కృపాసముద్రులైన మన యాదవ రాజింత నిర్దయులై నారేమిటే నేడు? నా అక్క చిక్కని, నీలికురులను, తుమ్మెద పిండునే ధిక్కరించు సుదీర్ఘ కచభరాన్ని, సౌందర్య చిహ్నమైన ఈ నల్లని ఒత్తైన జుట్టును తొలగింప నాజ్ఞాపించిన ఆ రాజెంతటి కఠిన హృదయుడు? ఎంతటి అరసికుడు? ఆరాధింపదగిన కచభర సౌకుమార్యాన్ని కసితో రూపుమాపటం అన్యాయం! అక్రమం! అక్కా నీలవేణీ! నీకెంత దుర్దశ వాటిల్లినదే తల్లీ!

జంగమస్వామి : (నవ్వుతూ నీలవేణిని ప్రేమగా చేరదీసి) ఎంత పిచ్చిపిల్లలు మీరిద్దరూ? అయినా నీలవేణీ! నీకీ వినీల కచభరంపై అంత

వ్యామోహమెందుకే? నన్నారాధించి, నాకు నీతనూ మనః సర్వస్వం అర్పించిన ప్రణయశీలివి, పరమభక్తురాలివి, నీకేలచింత? నిన్నను గ్రహిస్తాను నీలవేణీ! అలివేణీ! నీవూ ఏడుపునాపవే!

సీ॥ 'ఓ'! యను రోదనం బోంకార మనువుగా
గనుగవ నీరు మజ్జనముగాగ
విడువాలు గన్నులు నీలోత్పలములుగా
వెన్మోము క్రొత్త నెత్తమ్మి గాగ,
గమ్మని నిట్టూర్పు గాడ్పు – ధూపంబుగా
దంతకాంతులు దీప తతులుగాగ,
నధరోష్ఠ మమృతోప హారంబుగా, బదా
బ్జంబుల బడుట దండంబుగాగ,
నవ ధరించితి నేను లోకైక విభుడ!
భక్త జనముల ముంగిట, పారిజాత
మేల యేడ్చెదు, మానవే, లోలనయన!
హస్త మస్తక సంయోగ మాచరింతు! 6

(అని నీలవేణి శిరముపై తన దక్షిణ హస్తముంచి ప్రేమగా నిమురుతూ)

ఓసీ! నీలవేణీ! బ్రహ్మాదిసురలకు లభ్యముగాని, సతీదేవికే అంకితమైన నా యీ దక్షిణ హస్తమున నీ శిరస్సును స్పృశించి, నీ జన్మము ధన్యము చేసెదను. ఏదీ, ఒకసారి మనసారా శ్రీకాళహస్తీశ్వరుని స్మరింపుము.

**నీలవేణి :** (కన్నులు మూసికొని భక్తిపారవశ్యంతో)

మ॥ జయశంభో! జయశంకరా! జయ కృపాచాంద్రీ వికాసద్యుతీ!
జయ వాగాభరణా! జయోస్తు! జయశిక్షా శాస్త్రవిద్వన్మణీ!
జయగౌరీ వదనార విందమృదు వీక్షానంద! గంగాధరా!
జయ భక్తాంతర వాంఛితార్థ! జయరక్షా దీక్ష! మాహేశ్వరా! 7

**ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ! ఓం నమశ్శివాయ!**

(నేపథ్యంలో శంఖారావాలు, శివాలయఘంటాధ్వనులు డమరుక నాదాలు మార్రోగుతాయి)

**అలివేణి :** (ఆశ్చర్య సంభ్రమాలతో కనులెత్తి) ఓహెూ అపార కరుణా వరుణాలయా! పరమ జంగమమూర్తీ! పాహిమాం! పాహిమాం! పరమశివా! శ్రీ కాళహస్తీశ్వరా! నీకృప అనన్యం ప్రభూ! మీ హస్తమస్తక సంయోగంతో నీలవేణి తిరిగి వినీల కచభరంతో ఎలా సార్థక నామధేయగా వెలుగొందుతుందో చూసారా? మీ భక్తురాలిని దయాసముద్రులై రక్షించారా స్వామీ! ఎంత అదృష్టం ప్రభూ! మాది.

**ఉ॥ ✷ ఎత్తిన నింద్రజాల గురుడెత్తిన బ్రహ్మమనంగ, మన్మథుం**
**డెత్తిన పువ్వు వింటి మదమెత్తిన తుమ్మెదపిండు నారినా,**
**జిత్తజ రాజ్యలక్ష్మి కభిషేకము సేయ, శివుండు కాంతకై**
**యెత్తిన నీలకుంభ రుచి హిండన మో యన నద్భుతంబుగన్! 8**

**క॥✷ నెఱి మిగుల గలిగి నల్లపై**
**తలచై, మదనప్రతాప దావాగ్ని శిఖల్**
**మెఱయు నవధూమ మనగా**
**దెఱవకు గచభరము వచ్చె దేవుని కరుణన్! 9**

**నీలవేణి :** (కనులుతెరచి, తన తలనిమురుకొని వినీలకచభరాన్ని గాంచి ఆనందపారవశ్యంతో స్వామికి మ్రొక్కి-)

అహెూ! అర్థ నారీశ్వరా! శ్రీకాళహస్తీశ్వరా! శరణు! శరణు!! మహాప్రభూ! నా భవబంధాలను తొలగించి, నాకు కైవల్యప్రాప్తి నిచ్చిన వీరమాహేశ్వరా! ప్రభూ! పాహిమాం! పాహిమాం! ఈ దీనురాలిని ఘోరపరాభవాన్నించి రక్షించి ఆదుకున్నావా స్వామీ! తిరిగి పునర్జన్మ నెత్తినట్లుంది నాకు శివా! దయాసాగరుడైన ఓ

పరమశివా! ఈతనూ మనః ప్రాణాలు నీకర్పిస్తున్నాను. రా ప్రభూ! నన్ను రక్షించు. నన్ను కరుణించు జంగమస్వామీ! నమోన్నమః

**ఉ॥*** నీ దయ యన్న పెన్నిధిని నింపిన ముత్యపుజిప్ప నేను! బ్ర
**హ్మాది సురల్ కనుంగొనని మాధురులీ శివభక్తురాలికీ**
**ఆదిసతీ తనూ హృదయ మందు శివార్పిత కామకేళి – లో**
**కాధిప! చూఱయిచ్చితి వహా! మనమెల్ల శివార్పణమ్మునై!** 10

(అని స్వామి పదములపై వ్రాలిపోతుంది)

**అలివేణి :** (ఉచ్చైస్స్వనంతో) శంభో మహాదేవ! హరహర! శంభో శంకరా!..

(నేపథ్యంలో శంఖధ్వానం, ఘంటానినాదం వినిపిస్తాయి)

**–సమాప్తం–**

**సూచన :** 1. ఈ పద్యనాటిక, మహాకవి ధూర్జటివారి 'శ్రీకాళహస్తి మాహాత్మ్యం' లోని ప్రథమాశ్వాసమందుగల నీలవేణి కథ ఆధారంగా రచింపబడినది.

2.* ఈ నాటికలోని 1వ పద్యం శ్రీనాథుని హరవిలాసంలోనిది (2-138) 3, 5, 6, 8, 9 పద్యాలు - ధూర్జటి వారి శ్రీకాళహస్తి మాహాత్మ్యంలోని, ప్రథమాశ్వాసంలోని పద్యాలు (1-30, 1-49, 1-51, 1-52, 1-53)

3.* 2, 4, 7, 10 పద్యాలు, స్వీయ కవితలు.

4. ఈనాటిక ఫిబ్రవరి, 1972లో ఆకాశవాణి, విజయవాడ, కేంద్రం నుండి ప్రసారమైనది.



# గోపికా విరహం

నాటిక

రచన

జి.వి.సుబ్బారావు

# గోపికా విరహం

## (నాటిక)

నేపథ్యం

తే.గీ ః వేణు గాన సుధాబ్ధి నావిర్భవించి,
లలితమోహన శరదిందు లహరి దేలి,
బాలగోపాల ప్రణయ భావములదేలి,
పరవశాత్మలు, వల్లవ భామ లపుడు!

(శ్రీకృష్ణుని వేణుగానము క్షణకాలము వినబడి ఆగిపోవును)

(శ్రీకృష్ణుని వెదకుచు గోపికలు ప్రవేశింతురు)

ఒకటవ గోపిక ః(నిట్టూర్చి) కృష్ణా! ఎంతమోసగాడివయ్యా! నీ మృదుమధుర వేణుగానం విని, పిదుకుతున్న పాల పాదుగునలా వదిలేసి పరుగెత్తానయ్యా! ఈయమునాతటానికి. ఇదేనా నా ప్రయాసకు ఫలితం? ఇలా నీ పిల్లనగ్రోవి మాధుర్యంతో మమ్మల్ని, మంత్రరుద్ధ భుజంగినులను జేసి ఆడిస్తావా? కృష్ణా? అదేం చిత్రమోగాని-

సీ ✷ "నీ పాద కమలంబు నెమ్మి డగ్గఱగావి
తరలి పోవంగ బాదములురావు,
నీకరాబ్జంబులు నెఱి నంటితివ గాని
తక్కిన పనికి హస్తములు సారవు,
నీ వాగమృత ధార నిండ గ్రోలగగావి
చెవు లన్యభాషలు సేరి వినవు,
నీ సుందరాకృతి నియతి జూడగ గావి
చూడ వన్యంబుల జూడ్కి కవలు
విన్న కావి పలుక నేరవు మా జిహ్వ,

లొల్ల ననుచు బలుక నోడ వీవు,
మా మనంబు లెల్ల మరపి దొంగిలితివి
ఏమి సేయు వార మింక గృష్ణ? ! – 2

రెండవ గోపిక : (వగరుస్తూ వచ్చి) పోవే, గోపికా! నువ్వే మహా యిదయి పోతున్నట్లు చెప్తున్నావు. నా సంగతి చెప్తావిను. పొంగిపోతున్న పాలకుండనలా ప్రొయ్యి మీదనే వదిలేసి పరుగులెత్తా నీ నల్లనయ్య చిన్ని గీతాలు విందామని. అత్తయ్య "లబో, దిబో" అన్నా, చంటి వాడు పాలకు కేరుమన్నా, వినిపించుకోక, సర్వమూ వదిలి, ఈ వెన్న దొంగను, ఈ గోపికాజన మనోహరిని, వెదుక్కుంటూ ఈ శరద్రాత్రిలో పడివచ్చాను. అయినా ఏం లాభం.? ఇంత శ్రమా, వ్యర్థం! క్షణంలో కను మొరగి పోయినాడమ్మా! ఈ తుంటరి గోపాలుడు?–

మూడవ గోపిక : (ఆవేశంతో ముందుకువచ్చి) ఏమిటే? చెల్లెలా! స్వామినలా దూషిస్తావు. నీకేమైనా మతిపోయిందా? అయినా భక్తజన సులభుడు, వ్రజవనితా లోలుడు, ఆ గోపాలుని – ప్రార్థనలచే వశం చేసుకోవాలే పిచ్చిదానా! అందుకే వినమ్రతతో ఆయన్ని సేవిద్దాం. వేడుకొందాం. పద! – ఈయమునానికుంజాలు స్వామిక్కి–అనుగుచుట్టాలు. విశ్రమస్థలాలు. వాటి నడుగుదాం పద–ఏమమ్మా! లతానికుంజమా?–

ఉ॥* నల్లనివాడు పద్మనయనంబుల వాడు, కృపారసంబుపై
జల్లెడివాడు మౌళిపరి వర్తిత పింఛమువాడు, నవ్వురా
జిల్లెడు మోమువాడొకడు, చెల్వల మానధనంబు దెచ్చెనో
మల్లియలార! – మీ పొదల మాటున లేడు గదమ్మ! చెప్పరే? 3

ఓహో! తరులారా? స్వామి మీ కడకురా లేదా?–

ఉ॥✷ అంగజునైన జూడ హృదయంగముడై కరగించువాడు శ్రీ
రంగ దురంబువాడు, మధురంబగు వేణురవంబువాడు, మి
మ్మంగజు పువ్వుదూపులకు నగ్గముసేసి—లవంగలుంగ నా
రంగములార! మీ కడకు రాడుగదా!—కృపనున్న జూపరే?— 4

(అని ఏడుస్తుంది)

నాల్గవ గోపిక: (నవ్వుతూ) ఓసి! పిచ్చితల్లీ! అలా దిగాలుపడి, ఈ లతలకు, తరులకు నమస్కారాలు చేస్తుంటే, మన పని అయినట్లే! అయినా మన చిన్నికృష్ణయ్య అసలే నల్లనయ్య. ఈ తమాలపల్లవచ్ఛాయల్లో. ఈ గుబురుచీకటి పొదల్లో, ఏ మూల, నక్కిదాగి ఉన్నాడో, ఎలా తెలుస్తుంది మనకు? ఆ నీలమేఘ సుందరుడు, ఏ నీలి నీడలలో కలసిపోయినాడో మరి? అందుకే ఆ మానినీ జనమనోహరుని చెట్టుచెట్టునా, పుట్టపుట్టనా గాలిద్దాం. అసలే పుచ్చపూవులా, తెల్లని ఈ పండువెన్నెల అచ్చమైన ఈయమునా సితసైకతాలలో, ఆ నల్లనిస్వామి, ఇట్టే కొట్టవచ్చినట్లు కనిపిస్తాడు. చంద్రుని పైన మచ్చలా, తెల్లని గొడుగు పైని నల్లని పిడిలా—అందుకే పిచ్చి గొల్లవనితలారా! పదండి వెదుకుదాం తీవ్రంగా. అయినా ప్రియావియోగ సంతప్తలగు మనకు ఈ తరులతా మతల్లులు ఈ మాత్రం తోడ్పడవా?-

సీ॥✷ అదె నంద నందనుం డంతర్హితుండయ్యె
బాటలీ తరులార! పట్ట రమ్మ!
హేలావతుల గృష్ణ! యేల పాసితివని
యైలేయ లతలార! యడుగరమ్మ!
వనజాక్షుడిచటికి వచ్చి, దాగడుగదా!
చూత మంజరులార! చూడరమ్మ!
మానినీ మదనుతో మా రాక యెఱిగించి

మాధవీలతలార! మనుపరమ్మ!
జాతిసతుల బాయ నీతియే హరికని
జాతులార! దిశల జాటరమ్మ!
కదళు లార! పోయి కదలించి, శిఖిపించ
జూటుదెచ్చి, కరుణ జూపరమ్మ! – 5

**ఒకటవ గోపిక :** (నిట్టూర్చి, వగర్చి) అక్కా! నేనింక వెదుకలేనే? అయ్యో! నే నీ వియోగవ్యథ భరింపలేనమ్మా! (అని కూలబడి అక్కడ నేలపై కనుపించిన కృష్ణుని పదచిహ్నములను జూచి పరవశయై) ఓసీ! చెలీ! చూడవే! మన చిన్ని కృష్ణయ్య పాదాలగుర్తులు. అమ్మా! ఓ భూమాతా! –

క॥ ✷ కిటియై కౌగిట జేర్చెను,
వటుడై వర్ధిల్లి కొలిచె, వడి గృష్ణుండై
యిట పద చిహ్నము లిడె, గ్రిం
దటి బామున నేమినోచితమ్మ? ధరిత్రీ! – 6

**రెండవ గోపిక :** (సంతోషంతో ముందుకు వచ్చి) ఏవే! గోపికా? ఏవే? నా స్వామి మృదుమధుర చిహ్నాలు? అవి ఎంత పూజనీయార్హాలో నీకు తెలుసా? – (అని వంగి కళ్ళకద్దుకొని)

సీ॥ ✷ ఈ చరణంబులే ఇందు విభానన!
సనకాది మునియోగ సరణి వొప్పు,
ఏ పాద తలములే యెలవాగ! శ్రుతివధూ
సీమంతవీథుల జెలువు మిగులు,
ఏ పదాబ్జంబులే, యిభకులోత్తమ యాన!
పాలేటి రాచూలి పట్టుగొమ్మ;
లీ సుందరాంఘ్రులే, యిందీవరేక్షణ!
ముక్తి కాంతా మనో మోహనంబు,

**లీ యడుగుల రజమె యింతి! బ్రహ్మేశాది**
**దివిజవరులు, మౌళి దిశల దాల్తు!—** 7

**మూడవ గోపిక :** (నవ్వుతూ) పోవే! పిచ్చిదానా! నీ గొడవే నీది. కేవలం స్వామి పద చిహ్నాలతో ఈ ఓర్వలేని విరహానల జ్వాలలు చల్లారేనా? ఆ వెన్నుని మృదుమధుర మందహాసంతో ఆ గోపికా వల్లభుసాంగత్యంతోగాని ఈ మదనతాపం శమించేటట్లు లేదు. ఓయి! ప్రభూ! శ్రీకృష్ణా! మన్మథార్తను! నన్ను రక్షింపవయ్యా! స్వామీ!—

**ఉ॥ ✷ గోవుల వెంట ద్రిమ్మరుచు, గొల్చిన వారల పాపసంఘముల్**
**ద్రోవగజాలి, శ్రీ దనరి, దుష్టభుజంగ ఫణాలతాగ్ర సం**
**భావితమైన నీచరణ పద్మము చన్నుల మీద మోపి, త**
**ద్భావజ పుష్ప భల్ల భవ బాధ హరింపు, వరింపు, మాధవా!—8**

కృష్ణా! గోపికా హృదయేశ్వరా! నీవే మా సర్వస్వమని నమ్మి పరువులెత్తి వచ్చిన, మాకీ నట్టడవియే గతియా? మా సౌందర్యా ర్చనలూ, మా వెఱ్ఱి గొల్లవలపులూ, మాజీవిత కుసుమాలూ, ఇవన్నీ అడవిగాచిన వెన్నెలేనా? గోపాలా? - మాకీ యమునాతరంగాలేనా గతి? ఈ మన్మథ శరా ఘాతాలతో, ఈ విరహాగ్నులతో, మా అల్పప్రాణాలు గుటుక్కు మంటాయి! ప్రభూ! ఎంత మోసగాడవయ్యా! నీవు! అరచేతిలో వైకుంఠం చూపిస్తానంటావు. ఇదుగో, అని కనిపించి, కళ్ళారా చూసి తనివి చెందేలోపునే, తుర్రుమంటావు. ఇదేనా నీప్రేమ? నీకల్ల బొల్లి కబుర్లతో మమ్మల్ని మభ్యపెట్టకు స్వామీ! అయినా నీ మేనెంత నల్లనిదో, నీ హృదయమంతటి మలినమైనదీ, కర్కశమైనదీను. కృష్ణా! అబలలం వెఱ్ఱి గొల్లపిల్లలం. మాతోనా నీ చెలగాటం

ప్రభూ! మేమీ విరహావస్థ భరింపలేము. మమ్మింకనైనా రక్షించు, నీదరిజేర్చుకో కృష్ణా! ఆర్తత్రాణ పరాయణా! పాహిమాం! హా కృష్ణా! (అని మూర్ఛపోతుంది)

**మిగిలిన గోపికలు :** గోపాలా! నంద గోపాలా! మమ్ము రక్షించు శ్రీకృష్ణా! (అని అందరూ మూర్ఛపోతారు) (అంతలో దూరాన మృతసంజీవినివలె, మనోహరంగా వేణుగానం వినిపిస్తుంది. లేచివచ్చిన ప్రాణాలతో, గోపికలందరు నిలిచి నమస్కరిస్తారు కృష్ణుని దెసగా)

**ఉ॥ ఆయెడగాంచి రంగనలు, అద్భుత రూపమనోహరమ్ము, ప్రే**
**మాయిత దివ్యలోక పరమార్థము, గోపసతీ నిగూఢ కో**
**పాయత తాప సంశమన పావన మేఘము, వేణుగానమో**
**హాయిత సర్వజీవ మణిహారము, కృష్ణమనోజ్ఞ రూపమున్ 9**

**గోపికలు:** (అందరూ, పారవశ్యంతో, సంతోషంతో, ప్రేమావేశంతో, నమస్కరించి)

**A. మ॥ జయ! గోవింద! ముకుంద! చక్రధర! కంసద్వేషి! సాత్రాజితీ**
**ప్రియ! నారాయణ! కౌస్తుభా భరణ! కుంభిత్రాణ పారీణ, కా**
**ళియ దర్పఘ్న! పతంగ వాహ! వనమాలీ! కృష్ణ! వైకుంఠ, శౌ**
**రి! యశోదాత్మజ! భక్తవత్సల! మురారీ! గోపికా వల్లభా!–10**

(కృష్ణుని మృదుమధుర వేణుగానంసన్నగా వినిపించి, ఆగిపోతుంది)

**–సమాప్తం–**

సూచన :(1). ఇది బమ్మెరపోతనామాత్యుని, మహాభాగవతం, దశమస్కంధం ఆధారంగా రచింపబడినది.

(2) ✷ ఈ క్రింది పద్యములు పోతవ భాగవతం దశమస్కంధం లోనివి.
2 – 988, 3 – 1010, 4 – 1011, 5 – 1013,
6 – 1017, 7 – 1029, 8 – 1040

(3) A ఈ క్రింది పద్యం, ముక్కు తిమ్మన, పారిజాతాపహరణం ద్వితీయాశ్వాసం లోనిది 10–(2–56)

(4) (1) వ పద్యం (9)వ పద్యం– స్వీయ కవితలు



# విప్ర సందేశం

(గేయనాటిక)

రచన

జి.వి.సుబ్బారావు

# విప్ర సందేశం

## గేయనాటిక

### I

(విదర్భనగరం - రాజోద్యానవనంలో, వసంత ఋతువులో, నిండుపున్నమిరాత్రి, రుక్మిణి చెలికత్తెలతో ఆడుతూ, పాడుతూ విహరిస్తుంటుంది)

**రుక్మిణి :** (ఆనందంగా నృత్యం చేస్తూ) :

**ఆమని కోయిల చివురుల మెసవీ,**
**నా మది కోరిక కూహూ యనెను,**
**మింటను చంద్రుడు మిలమిల మెరిసీ**
**జంటగు ప్రియునీ వెన్నెల దాచెను,**
**పూవులతావుల గాలుల నూగీ**
**కోవెల గంటలు వేణువులూదెను! -**

**చెలికత్తెలు :** (చుట్టూ చేరి, ఎగతాళి చేస్తూ)

**ఎవరే కోయిల? - ఏమా కోరిక?**
**ఎవరే చంద్రుడు? - ఏదా వెన్నెల?**
**ఎవరే గాలులు? - ఏదా వేణువు?**

**రుక్మిణి :** (సిగ్గుపడి)

**నల్లని మబ్బుల పోలుపగువాడు,**
**చల్లలు త్రాగెడి చెలువపు వాడు,**
**గొల్లల బ్రోచెడి ఉల్లమువాడు,**
**పిల్లన గ్రోవితొ పిలిచెడి వాడు! -**

**చెలికత్తెలు :** (వెటకారంగా)

చెమ్మ చెక్కా! చేరెడేసి మొగ్గా!
నమ్మ మక్కా! పేరదేమి? సిగ్గా? –

**రుక్మిణి :** (వెనక్కి తగ్గి, నమస్కరించి)

ఉ॥ "నల్లని వాడు, పద్మనయనంబులవాడు, కృపారసంబు, పై
జల్లెడు వాడు, మౌళి పరిసర్పిత పింఛమువాడు, నవ్వు రా
జిల్లెడు మోమువాడు" – వికసించిన కోర్కెల రూపువాడు, నా
యుల్లము దోచుకొన్న ప్రణయోజ్వలుడా యదువీరు, డమ్మరో! 1

**చెలికత్తెలు :** (చుట్టూచేరి, గంతులు వేస్తూ)

ఎంత చక్కని వాడే? ఇంతి! నీ చెలికాడు,
కాంతల వలువలా కమ్మగ దోచెను
ఇంతుల మూతులా వెన్నల పూసెను
పంతము పోయినా, దైత్యుల ద్రుంచెను ॥ఎంత చక్కని వాడే॥

నల్లనీ గోపన్న – మా – తెల్లనీ రుక్మిణీ!
చెల్లెనా? ఓయమ్మ – జతకుదిరెగానీ,
వైదర్భి! గారాల వనితవో యమ్మ!
పైదోడు – నీకేల! నల్లనీధవుడు?!– ॥ఎంత చక్కని వాడే॥

**రుక్మిణి :** (కోపంగా)

మీకేమి తెలియునే? – నాస్వామి సొగసు?
నాకాల దొరలెల్ల– శ్రీకాంతు కెదురె?
నల్లనీ మేనులో – పల్లవిస్తూను లేవె,
తెల్లనీ నా యెదలోని – తీయతేనియలు! –

**చెలికత్తెలు :** (చుట్టూ చేరి, చప్పట్లు కొట్టూ)

గోపన్న – పెండ్లి కొడుకాయెనే!
మా చెల్లి – పెండ్లి కూతు రాయెనే?

రుక్మి : (కత్తి దూసి, కోపంగా ముందుకు వచ్చి)

ఎవడురా? గోపన్న – వెఱ్ఱి నాగన్న?
చవటరా! వాడన్న – కఱ్ఱి గోపన్న!
చిదిమితే – పాల్గారు చిట్టి – నా చెల్లి!
కదుపులా గాచేటి గొల్ల – నే నొల్ల!
పసి దానవే – నీవు – ప్రణయ బంధములేల!
శిశుపాలునే – నీకు – వశము జేసెద – చెల్లి!–

రుక్మిణి : (భయపడుతూ)

మందార మకరంద మాధుర్యమా స్వామి!
అందాల కనువిందు – గోపాలుడో యన్న!
మన్నించు నా మనసు – మాధవార్పితము,
అన్నయ్య! నీ చెల్లి – చిన్ని కన్నయ్యకే జెల్లు!–

రుక్మి : (మండిపడి – చిందులు త్రొక్కుతూ)

ధిక్కారమును సైతునా? – రుక్మిణీ! – నీ
దిక్కెవరొ – నే జూతునే – భామినీ!
మసి జేతు – నే – కృష్ణు – మాదారి నిల్వనీ – ఆ
శిశుపాలుతో – పెండ్లి – తథ్యమే – రుక్మిణీ!!–

రుక్మిణి, చెలికత్తెలు : (భయంగా, వెనుదిరిగి చూస్తూ వెళ్ళిపోతారు)

II

(అంతఃపురంలో రుక్మిణి దిగులుగా కూర్చొని ఉంటుంది. అంతలో చెలికత్తె విప్రవరుని తీసుకొని వస్తుంది)

రుక్మిణి : (లేచి, నమస్కరించి)

స్వాగతమ్మో! నీకు భూసురవర్య!
వేగిరపడు – నాకు – ఆశలందేన?–

విప్రుడు : (ఆశీర్వదిస్తూ)

కోరిన కోర్కెలు తీరెడునమ్మా!
సారస నాభుడు – వీరుడు సుమ్మా!
గౌరియె నీమది – చేరున యమ్మా!
శౌరియె – నీ పతి – స్థిరముగ నమ్మా!

రుక్మిణి : (దిగులుగా)

విప్రులు, పూజ్యులు – విద్యాగురువులు – మీరు!
అప్రియ మాడరు – తప్పరు – ఆడిన మాటలు – మీరు!
సింహము గోరిన – చేడియ నేను!
సింహము గాదని – చేరను నక్కను!
కన్నియ మనమును – కానగలేక
అన్నయె! ద్రోహము – తలచెను నాకు!
పున్నెము లొదవును – భూసుర వర్య!
వన్నెను – మాధవు – సన్నిధి గూర్చు!
గోపాలు వలపునే – ఎదలోన నిలిపినా
నా పాలి స్వామిగా – కాపాడ గోరినా–
నాపైన జాలితో – గోపాలు జేరవా?
తీపైన సందేశ – మాపైన జెప్పవా?–

విప్రుడు : (సంతయంగా)

ఎక్కడా? – ద్వారక? ఏమొ? నాకెఱుక!
మక్కువ – నీపైన – మాధవుని కెఱుక!

వృద్ధుడ! – పదయాత్ర – నే జేయగలనె?
సిద్ధమె? – హృదయమ్ము – శ్రీకాంతుకలియ?

రుక్మిణి : (ఆవేదనతో)

మురళియే వినిపించు కర్ణముల లోన
హరిని గానగ లేక ప్రాణములు లేవు!
దయతోడ భూవరా! – ద్వారకను జేరు,
స్వయముగా తావచ్చి – నను బ్రోవమనుము!

విప్రుడు : (సంతోషంతో)

ఓ! కలికి! రుక్మిణీ! – నా పలుకు సత్యమే!
నే వెడలి తెత్తునే! – నీ ప్రణయ మూర్తినీ! (అని వెళ్తాడు)

రుక్మిణి : (నవ్వుతూ సాగనంపుతుంది)

III

(శ్రీకృష్ణుడు పిల్లనగ్రోవి వాయిస్తుంటే, గోపికలంతా చుట్టూ జేరి, ఆనందంగా నృత్యం చేస్తుంటారు)

గోపికలు: ఓ! మురళీ మనోహరా! ఓ మృదు మధురాధరా! –
కమ్మని వేణువూ – రమ్మనీ పిలిచెను
యమునా తటిలో – రమణీ మణులను!
నల్లని కృష్ణుడే – ఉల్లమూనిలిచెను
గొల్ల పిల్లలం – కల్ల మేమెరుగం!

మము కాపాడర! – గోపకిశోరా!
మము రక్షింపర! – వేణుమనోహరా!
ఓ! మురళీ మనోహరా! – ఓ! మృదు మధురాధరా!

కృష్ణుడు: (అభయహస్తంతో)

భక్తుల పాలిట – దేవుడ నేను!
పడతుల నేలెడి – కృష్ణుడ నేను!
వెన్నల దోచెడి – గోపుడ నేను!
కన్నెల గాచెడి – కృష్ణుడ నేను!

విప్రుడు: (ప్రవేశించి – నమస్కరించి)

నమో! వాసుదేవాయ! – నమో! నందకిశోరాయ!
నమో! గోపికా మనోహరాయ! – నమో! నవనీత చోరాయ!
నమో! శ్రీ కృష్ణ దేవాయ! – నమో! రాధామనోహరాయ!
నమోన్నమః – నమోన్నమః –

కృష్ణుడు: (నవ్వుతూ ముందుకు వచ్చి, స్వాగతం పలికి)

క॥ ఊరక రారు మహాత్ములు!
కోరిక లవియేమొ దెలుప గోరెద విప్రా!
కారణమది యేమైనను
నీ రాక శుభంబు మాకు, నిజము మహాత్మా! 2

విప్రుడు: (చుట్టూ ఉన్న గోపికలను చూచి సందేహిస్తాడు. కృష్ణుడు చిరునవ్వునవ్వి సైగ చేస్తాడు. గోపికలందరు వెళ్తారు)

విప్రుడు: (వినయంగా నమస్కరించి)

ప్రణయ సందేశ – విప్రవాహిని నేను!
ప్రాణ పరిరక్షణార్థ – దౌత్యలహరి నేను!
కన్య రుక్మిణి – నిన్ను – మనసార వలచె!
అన్న రుక్మికి – తలపు – అన్యవిధము
కన్నె సిగ్గు విడిచి – కాంక్షించె శ్రీ కృష్ణ!
చిన్నదాని మనసు – చిక్కెను నీయందు! –

**కృష్ణుడు:** (సంతోషంగా)

**ఓహో! – నా ప్రణయరూపిణీ! రుక్మిణీ!**
**ఓహో! నా మనోకలభాషిణీ! రుక్మిణీ!**

**తామర రేకుల కన్నులందానా! – నామది దోచిన చిన్నరిదానా!**
**సామజవర ఘన గమనా! – కోమల శశి విభవదనా!–**

(అని విప్రుని వైపు తిరిగి)

**విప్రోత్తమ! నీ దౌత్యము – సంప్రీతిని గొలిపె నాకు!**
**రుక్మిణి జేపట్టెద నుమ్మీ – రుక్మికి తలవంపులె నుమ్మీ!**
**ఎవరెదురొచ్చిన గానీ – జవరాలిని – నే విడువను**
**తెచ్చెదనయ్యా! వైదర్భిని – మెచ్చితినయ్యా! నీమైత్రిని!**

**విప్రుడు :** (ఆనందంతో దీవించి)

**జయము! జయము! నీకు చాణూరమర్దన!**
**జయము! జయము! నీకు రుక్మిణీ శోభన!!–**

(అని వెళ్ళిపోతాడు)

## IV

(రుక్మిణి పెండ్లికూతురై గౌరి ఆలయానికి చెలికత్తెలతో వెళ్తుంటుంది)

**రుక్మిణి :** (సంశయంగా)

**నమ్మితినమ్మా! గౌరమ్మా! – ఇమ్ముగ హరినీ జేర్పమ్మా!**
**కన్నులు లేవే, అన్నకు తల్లీ! – వన్నెక ఊయిగ తలచెను తల్లీ!**
**వెన్నుడె నా మది దైవము తల్లీ! – కన్నులు, వానినె వెదుకును తల్లీ!**

(అని హఠాత్తుగా రథం శబ్దంవిని, ఆశ్చర్యంగా తలపైకెత్తి చూస్తుంది)

చెలికత్తెలు :(ఆశ్చర్యంతో, సంతోషంతో, ముందుకు వస్తున్న శ్రీకృష్ణుని జూచి)

వందన మోయీ! గోపాలా! – సుందరి! రుక్మిణి! గోపాలా!
డెందము నీ పదములనే – బంధము నీ హృదయమునే
తహ తహలాడెడి మాచెలియ – ఇహమూ, పరమూ నీవే నోయి!
వలచిన సుందరి, వధువయ్యా! – వలపుల తొణికెడి మధువయ్యా!

శ్రీకృష్ణుడు : (నవ్వుతూ ముందుకు వచ్చి, రుక్మిణి చేయిపట్టుకొని)

నేలకు వ్రాలిన శశిరేఖా! – జలధిని దేలిన శ్రీరేఖా!
రావే! కమ్మని వలపుల దేల్చెద! – రావే! తియ్యని పెదవుల
వావెద!
పదవే! ద్వారక, ప్రణయ సుధా! – పదవే! రుక్మిణి! ప్రాణసఖీ!

(అని సిగ్గుపడుతున్న రుక్మిణిని తీసుకొని రథంతో కదులుతాడు)

రుక్మి : (హఠాత్తుగా, కత్తిదూసి వచ్చి)

ఎవడురా! గొల్లడా–దొంగలా జవరాలి గొని పోయెదవా?

కృష్ణుడు: (నవ్వుతూ, ఎదిరించి నిలిచి)

బావగారిని రోయి! రుక్మి! – జవరాలు, నాదెసుమీ్మ!–

రుక్మి : (కత్తిపై కెత్తి, కోపంగా)

మా సరివాడవా? – మా పాప గొనిపోవ?
పసుల దోలుదు వీవు – బావ వౌదె?
మానహీనుడ వీవు! – మర్యాద లెఱుగవు!
వెన్న దొంగవీవు! వెఱ్ఱిగొల్ల! –
కాచుకొమ్ము! కృష్ణ! – నాదు కత్తిపోటు! – (అని మీదికి
వస్తాడు)

**కృష్ణుడు:** (కోపంగా, రుక్మి కత్తిని లాగుకొని, అతని జుట్టు పట్టుకొని)

చెల్లి మనసు నెఱుగలేవురా! తల్లి దండ్రి నడుగ బోవురా!
పుల్లవిరుపు మాట లేలరా! – కల్లబొల్లి కబురు మానరా!
– (అని నరుక బోతాడు)

**రుక్మిణి :** (భయంతో, ముందుకు వచ్చి, నమస్కరించి)

శరణు! శరణు! కృష్ణ! శ్యామసుందర వర్ణ! –
శరణు! శరణు! కృష్ణ! వేణుమోహనరూప!
కన్నె కోరికలు ఫలియించిన వేళా – కన్నె వలపులే పండిన వేళా,
రక్తపాతములు – తగునా! కృష్ణా! I భక్తుల ప్రార్థన వినవా! కృష్ణా!
ఈ కన్నియపై చనవుంచీ – నా అన్నను మన్నించూ!
నీ పున్నెము ప్రసరించీ – నా కన్నుల వెలుగుంచూ!!–

**కృష్ణుడు:** (శాంతించి, రుక్మిని జుట్టు కత్తిరించి, వదిలివేసి, రుక్మిణిని దగ్గరకు తీసుకొంటాడు)

**చెలికత్తెలు :** (సంతోషంగా)

వేణు మాధవా! శ్రీకృష్ణా! – రుక్మిణీధవా! శ్రీకృష్ణా!
మురళీమోహన! శ్రీకృష్ణా! – కరుణాసాగర! శ్రీకృష్ణా!
మంగళమోయి! శ్రీధరా! – మంగళమోయి! మాధవా!!–

–సమాప్తం–

(ఇది పోతన భాగవతం – దశమస్కంధం ఆధారంగా రచించిన గేయనాటిక)



# కిన్నెరసాని

## గేయనాటిక

రచన

**జి.వి.సుబ్బారావు**

# కిన్నెరసాని

## గేయనాటిక

# అంకితము

## గురువర్యులు

– కవి సమ్రాట్ శ్రీవిశ్వనాథ సత్యనారాయణ గారికి –

మధ్యాక్కర

విశ్వనాథ కవీంద్ర గేయ విస్తృత కీర్తికిఁ బ్రమసి,
అశ్వ వల్గన సామ్యగతికి, నానంద మొంది – నాటిక – న
నశ్వర గేయ నిర్ఝరుల, నంకితమ్మిత్తు – మద్గురున
కీశ్వరార్పణ మంచు! ధ్వను లహీనరసార్ద్ర గీతులుగ! 1

–...–

ఉ॥ కిన్నెరసాని పాటలవి, గేయఝరీ మృదులాస్య చిత్రణల్!
సన్నుతి నొందె రమ్యరస సాగరమై, రసికాంధ్ర లోకమం
దెన్నగ, 'విశ్వనాథ' రమణీయ కవిత్వము తేటపాటలై!
క్రొన్నన వోని నాటిక – గురుఁ బ్రణుతింతు, కృతజ్ఞతామతిఁ 2

–..–

కం॥ ఇది ఉడుతా భక్తిగ మీ
కిది గురుదక్షిణగను, రచియించితి – నెదలో
పదిలంబై – కిన్నెర – మృదు
మధురధ్వనులు, రసఝరులు – మద్గురుకృపలై! 3

–జి.వి. సుబ్బారావు

# కిన్నెరసాని

## గేయనాటిక

I

(కిన్నెర ఱేడు, కిన్నెరసాని ప్రవేశం)

కిన్నెర ఱేడు : (ఆనందంగా)

ఓహో! కిన్నెరసాని!
ఓహో! కిన్నెరసాని!

ఊహలా అందాలు రూపుకట్టిన రాణి!
సాహితీ నందన సౌరభమ్ముల వేణి!
మోహవార్ధుల ముంచు మురిపాల విరిబోణి!
నా హృదయగిరులలో దొరలేటి జలరాణి!
తెలుగు పడతుల దీప్తి వెలిగించు అలివేణి!

ఓహో! కిన్నెరసాని!
ఓహో! కిన్నెరసాని!

కిన్నెరసాని : (ప్రణయకోపంతో, అభిమానంతో)

కిన్నరా! మోహాలు మానరా!
మిన్నులా తాకె నా అలుకరా!

భక్తితో నిను గొల్చు పడతి నేనైతిరా!
చిత్తమే విందతో చివికి నీరాయెరా!
అత్తయ్య నాపైన కత్తినే గట్టెరా!
మెత్తని కత్తితో గొంతునే కోసెరా!

కపట ప్రేమలు మానరా!
కుపిత కిన్నెర వెఱుగరా!

ఆవేశమున మండు ఆడుబిడ్డను నేనురా!
నీ వేషభాషలా నేను నమ్మను పోర!
అడవులాబడి పోదు ఆవేదనాకుల్యనై
కొండలా బడి పోదు కోపాన వాగునై

కిన్నరా! మోసాలు మానరా!
మిన్నులా తాకె నా అలుకరా!

కిన్నెరతేడు : (దుఃఖంతో, పశ్చాత్తాపంతో)

రావె! కిన్నెరసాని!
రావె! వెన్నెల సోన!

దండాలు! దండాలు! ప్రణయ దాసుడ నేను!
మెండైన కోపాలు మానవే చెలియ!
మగనిపై కోపించి మాటాడబోవ?
వగలతో పెగలతో వార్ధి కలిసేవ?
వెడలకే! నా ప్రణయ రాణీ!
వెడలకే! నా హృదయ వాణీ!

కిన్నెర : (విసుగ్గా, కోపంతో వెళ్ళిపోతూ)

మానమే ప్రాణమై బ్రతికాను నేను!
మానినీ శీలమై నిలిచాను నేను!
చానలకు విరహమే మంటలయ్యేను!
కానలకు ఒంటిగా పయనమయ్యేను!

కిన్నెరతేడు : (విషాదంగా)

ఓహో! కిన్నెరసాని!
ఓహో! వన్నెలచాన!

వాగువై కోపాల ఊటవైనావ?
సాగుచూ విరహాల బాటవైనావ?
గుండెలో వేదనలు మండెనో చాన!
బండఱాయిగ ఒడలు పండె లోకాన!
సాగలేనే చాన! చలనాలు లేక,
మూగనైతి నేను! పలుకులే లేక–

నిలిచాను ఓ చాన!
శిలయౌచు నేను!
ఉలుకు పలుకూ లేక
శిలయైతి నేను!
మలయైతి నేను!

(అని బండఱాయిగా మారి నిలిచిపోతాడు)

II

(కిన్నెరసాని వాగుగా కదిలిపోతుంటుంది. ఆమె ననుసరించి, భూదేవత, వనదేవత, జలదేవత, లేడి, నెమలి, కోకిల, దీనంగా పోతుంటారు)

నేపథ్యగీతం :

కరిగింది! కరిగింది!
కరిగి కిన్నెరసాని, వరదలై పారింది!
తరుణి కిన్నెరసాని, తరకల్లు కట్టింది!
పడతి కిన్నెరసాని, పరుగుల్లు పెట్టింది!
పతి రాయివలె మారి

పడియున్న చోటునే,
పడతి కిన్నెరసాని విడలేక తిరిగింది!
ముగుద కిన్నెరసాని విడలేక తిరిగింది!
వెలది కిన్నెరసాని గలగలా తిరిగింది!

కిన్నెరసాని: (దిగులుగా)

ఓనాథ! ఓనాథ!
ఓనాథ! ఓనాథ!

నాకు మల్లే నీవు నదివోలె పారరా!
జలముగా యిద్దరము కలిసి పోదామురా!
కెరటాలు కెరటాలు కౌగిలిద్దామురా!

భూదేవత
జలదేవత: (విషాదంగా)
వనదేవత

నా చిన్ని కిన్నెరా! నాయమ్మ కిన్నెరా!
నా వన్నె కిన్నెరా! నా తల్లి కిన్నెరా!

శాపాలు తొలగెనే, పాపాలు విరిసెనే
కోపాలు తీరెనే, తాపాలు తటిగినే

మా పాప కిన్నెరా! మా వలపుకిన్నెరా!
మా వాగు కిన్నెరా! మా సొగుకిన్నెరా!

వనితగా నీ జన్మ పసివాడి పోయెనే!
మనిషిగా నీ జన్మ పొలిమేర దాటెనే!

జలమైన కిన్నెరా! చలమేల కిన్నెరా!
బిలబిలా కిన్నెరా! గలగలా కిన్నెరా!

కిన్నెరసాని: (ఆవేదనతో, దుఃఖంతో)

రారా! ఓహో నాథ!
రారా! ఓహో నాథ!

వెలది, నీ కిన్నెరా! కలగి పోయిందిరా!
నాతి, నీకిన్నెరా! నలిగి పోయిందిరా!
పడతి, నీ కిన్నెరా! బడలిపోయిందిరా!

ఓ నాథ! ఓ నాథ!
ఓ నాథ! ఓ నాథ!

లేడి,నెమలి
కోకిల : (అనునయంగా, చనవుగా)

కిన్నెరసానీ! స్వాగతం!
వన్నెలచానా! స్వాగతం!

ఎఱ్ఱని పెదవుల కిన్నెరసానీ!
బిర్రున జాఱెడి కిన్నెరసానీ!

కోకిల గొంతున కూసెడిదానా!
పింఛము విప్పుచు ఆడెడిదానా!
చెంగున లేడిగ ఎగిరెడిదానా!

పల్లపు చాయల పరుగిడు రాణీ!
ఉల్లము దోచెడి రసమయ వాణీ!

కిన్నెర సానీ! స్వాగతం!
వన్నెలచానా! స్వాగతం!

కిన్నెరసాని : (ఆపలేని దుఃఖంతో, శిలచుట్టూ తిరుగుతూ)

పోలేను పోలేను నినువీడి, ఓస్వామి!
పోలేను శిలవైన నినువీడి ఓనాథ! ॥పోలేను॥

మనసునా మమతలూ – పెన వేసికొన్నాయి.
తనువునా, వలపులూ – తాదాత్మ్యమందాయి.
నీ యెదలు నా యెదలు విడలేవు కౌగిలిని
నీ మదులు నా మదులు ముడివైచె ప్రేమలను ॥పోలేను॥

ఇలపైన శిలవుగా నిలిచావు నీవూ
ఇలజారి సెలయేరు పరువుగా నేనూ
నీ వలపు నా తలపు అతుకవేమో యింక ?
నీ హొయలు నా వగలు కలియవేమొ యింక?
మాటమంతీలేని మౌనశిలవై నీవు!
దాటనలవిగాని దాక్షిణ్యకుల్యనై నేను!
నంచలన శూన్యమౌ పంచాస్త్రుడై నీవు
వంచనల వాగులో వరదనై నేను!
కలియబోమింక – శిలయైన నా స్వామి!
నిలువ లేనింక – సెలయేఱు నీబోటి! ॥పోలేను॥

తిమిరాల ప్రోవునై, భ్రమర సంగీతమై
అలలుగా కన్నీరు, మరుగులా వగపులై
కదిలి పోతున్నాను కారడవిలోన
వదలిపోతున్నాను వాగునై నేను
మునిగి పోతున్నాను విరహాల జలధిలో
మనవి చేస్తున్నాను మరి నాకు సెలవ?
నన్ను మన్నింపరా! ఓ నాథ!
నన్ను మన్నింపరా! నా నాథ!

(అని దీనంగా, గలగలా రవంతో సాగిపోతుంది)

కిన్నెరసాని
భూ దేవత
జల దేవత: (చుట్టూ చేరి, విన్నపంగా)
వన దేవత

కదలవే! కదలవే! ముదిత కిన్నెరసాని!
వదలవే! వదలవే! పతిని కిన్నెరసాని!

వెనువెన్క వెనువెన్క తిరిగి చూచెదవేల?
కనుగొనల కనుగొనల పతివిగాంచెద వేల?

కెరటాల, కెరటాల తరలిరావమ్మా!
నురుగులా, పరుగులా కెరలి రావమ్మా!

శిలయైన పతివేల తిలకింతు వమ్మా!
తొలకరి వానలా కులికి రావమ్మా!

కదలవే! మెదలవే! ముదిత కిన్నెరసాని!
వదలవే! వదలవే! పతిని కిన్నెరసాని!!

కిన్నెరసాని: (నిట్టూర్చి)

వదిలేను వదిలేను మగనాలి వలపునూ,
విడిచేను విడిచేను విడలేవి తలపునూ,

కదులుతా! మెదులుతా! చదలేటి తరగలా!
మెదులుతా! కదులుతా! మదిలోవి ఊహలా!

వదిలాను వదిలాను వాంఛలా తీరాన్ని!
విడిచాను విడిచాను విరహంపుటార్తివి!

(అని మెల్లగా సాగిపోతుంది)

కోకిల, నెమలి,
లేడి : (సంతోషంగా, చుట్టూచేరి)

కొమ్మరో! కిన్నెరా! కూయన్నదీ!
అమ్మరో! కిన్నెరా! సైయన్నదీ!

గలగలా, బిలబిలా పారుతానన్నదీ!
కిలకిలా కలకలా చేరుతానన్నదీ!

లేడిలా చెంగునా ఎగురుతా నన్నదీ
కోడెలా పొంగునా దూకుతానన్నదీ ||కొమ్మరో||

నెమలిలా పురివిప్పి ఆడుతావన్నదీ
రమణిలా గళమెత్తి పాడుతానన్నదీ

అంచలా గాలిలో సోలుతానన్నదీ
మంచులా నీటిలో తేలుతా నన్నదీ ||కొమ్మరో||

III

(నేపథ్యంలో సెలయేటి గలగలలు, తరగల రవరవాలు వినబడుతాయి)

కిన్నెరసాని: (ఆనందంతో నాట్యం చేస్తూ పాడుతుంది)

నా వయసు నా సొగసు నా మనసు పొంగేనులే
నా కులుకు నా బెళుకు నా తళుకు పొంగేనులే

ఈ అలలు ఈ కలలు ఈ వళులు నా వేనులే
ఈ నురుగు ఈ పరుగు ఈ మెఱుగు నా వేనులే

||నావయసు||

నేను కదలిన బాట కనులు చెదరెడితోట
నేను పాడెడి పాట వీను విందగు మాట
నేను పంచిన తావి మేను మరచెడి తావి
నేను మీటిన స్వనము వీణ జిందిన స్వరము

||నా వయసు||

ఈ బయలు ఈ మొయిలు ఈ హొయలు నా వేనులే
ఈ గళము ఈ రవము ఈ స్వనము నా వేనులే
ఈ పాలుపు ఈ మలుపు ఈ వలపు నా వేనులే
ఈ అతివ ఈ మగువ ఈ చెలువ నే నౌదులే

।నా వయసు।

(ఇంతలో భయంకరమైన మేఘగర్జనలా, కళ్ళు మిరిమిట్లు గొలిపే మెరుపులా, సాగర భీకర తరంగ రావాలు, ఉత్తుంగ ఫేనశీకరాలూ వినిపిస్తాయి, కనిపిస్తాయి. బెబ్బులి గాండ్రింపులకు బెదరిన లేడికన్నెలా, కిన్నెరసాని గజగజ వణికిపోతుంది. కిన్నెరకు సానుభూతిగా అడవిలోని వృక్షాలు, మృగాలు, పక్షులూ ఆర్తనాదాలు చేస్తాయి)

సాగరుడు: (గంభీరస్వరంతో కిన్నెరసాని దారి కడ్డంగా నిలబడి)

రావె! కిన్నెరసాని! రతనాల సోన!
రావె! కిన్నెర సాని! వెన్నెలలలోన!
కోయిలా! పాడింది నీ నోటి పాటనీ
గాలిలో తేలింది నీ మువ్వసవ్వడీ
మింటిలో తోచింది నీకంటి వెలుగూ
మబ్బులో మెరిసింది నీవంటి హొయలూ
రావె! కిన్నెరసాని! రతనాల సోన! రావె!
రావె! కిన్నెరసాని! నా అలల లోన!

కిన్నెరసాని: (భయంతో, కోపంతో)

మగవాని వేడాదురా! ఓ సాగరా!
వగచింది వాగైతిరా! ఓ సాగరా! ।మగవాని।

పగయేల ఓ సాగరా! ఈ బాలతో –
రగిలేను నాగుండె శోకాలతో
వలపేల ఓసాగరా! ఈ బేలపై –
కులకాంత లున్నారుగా నీపొందుకై ।మగవాలి।

సాగరుడు: (వికటాట్టహాసం చేసి, నవ్వుతూ)

కోపమేలవే ఓ బాలా!
తాపమోర్వనే ఓ బాలా!

వాగువైతివే ఓ చానా!
సాగిపోతివే ఓ చానా!

వాహినీ! నా పతీ! నీవేనే!
మోహినీ! నా సఖీ! నీవేనే!

తే.గీ.। కరగి కన్నీరు వాగులై కెరలినపుడె,
పొరలి దుఃఖాలు కుల్యలై పొంగినపుడె,
మరలి రాలేని పల్లంపు మార్గమయ్యె!
తరుణి! కిన్నెరసాని! నా దాన విపుడు!

నదియై పుట్టిన, నదమై వరలిన
గతియది సాగరుదేవకే!
మతియది సంద్రపు కౌగిలికే!

నీవన్న నాకెందుకో ప్రేమొలుకు!
నేనన్న నీ కెందుకే ఈ వణకు?! –

(అని పగలబడి నవ్వుతాడు)

కిన్నెర : (దుఃఖంతో, దీనయై)

మగనాలిపైన మోహావేశమా?
భయమాయెనే సతీ! గౌతమీ!
తగదనవే! మాతా! గౌతమీ!
దయ గనవే! రాజ్ఞీ! గౌతమీ!

(ఇంతలో దూరాన గోదావరీ నదీ తరంగరావాలు గంభీరంగా మృదు మధురంగా వినిపిస్తాయి. సాగరుడు జంకి వెనుకంజ వేస్తాడు. కిన్నెర భయం తొలగి గౌతమి వైపుగా ముందుకు సాగుతూ)

కిన్నెర : (ఆవేదనతో, ఆర్తనాదంతో)

కరుణామయి! వాహిని! గోదావరి!
శరణాగత వత్సల! నా గౌతమి!
నను బ్రోచెడి కాత్యాయని!
నను గాచెడి రాజ్ఞీ మణి!
నను కరుణించెడి మందాకిని!

శరణంటిని కరుణింపుము ఓ మాతా!
శరణంటిని దరిజేర్చుము! ఓ జననీ!

గోదావరి: (అభయముద్ర వహించి, గంభీర తరంగా రావంతో)

తే.గీ॥ అభయ మిచ్చితి నీకు కుల్యావతార!
శాప వశమున, విరహ సంతాపజలధి,
మ్రగ్గి సగమైన మగనాలి! రక్షనిత్తు
కడుపులోనన దాత్తు, నా కన్న తల్లి! 2

(అని, సాగరునివైపు తిరిగి, పట్టపురాణి దర్పంతో, కోపంతో)

సాగరా! రత్నాకరా! నీకేలరా?
వాగురా! కన్నీటిలో తేలేమురా! ||సాగరా||

తలలే పండెను తెలి నురుగుల లోనా
తలపే పండుదు తొలి సగరుని లోనా

నీ కేలరా? ఈ మోహమూ? నా తల్లిపై
నీ కేలరా! కామాంధమూ? ఓ సాగరా! ॥సాగరా॥

తే.గీ॥ పతిని విడలేక విడలేక మతి గలంగి,
కరగి కన్నీరు వాగుగా కెరలివచ్చి,
శాపవశమున దిరుగు సంతాపకుల్య!
కలికి, కిన్నెరసానిపై కన్నదేల? 3

సాగరుడు: (పశ్చాత్తప్తుడై, వినయంగా)

దిట్టతనమ్మున తెల్గు-పడంతివి!
కట్టడి జేసిన కాదన గలనా?
గుట్టుగ బ్రోవుము కోమలి కిన్నెర!
పట్టపు రాణికి పాదాక్రాంతుడ!

తే.గీ॥ గౌతమీ మహారాజ్ఞి! లోకాలవేలు
పరమ కారుణ్య వార్ధివో ప్రణయమూర్తి!
పొరలు తొలగెను, నీదు సంబోధనమున !
తరుణి, కిన్నెర, నాకును తనయ సుమ్మ! 4

(అని వినమ్రతతో వెడలిపోతాడు)

కిన్నెరసాని: (సంతోషంతో భక్తితో నమస్కరించి)

తే.గీ॥ తెనుగు తల్లికి తొలికాన్పు తేజమీవు!
తెనుగు ప్రజలకు సర్వార్థ దీప్తి వీవు!
గౌతమీ మాత! పుత్రికా గౌరవమున
కడుపు లోనన దాచి నన్ గావుమమ్మ!- 5

వడి వడిగ వాగునై, తడబడని కుల్యనై
పాపి కొండలలోన బడకుండ నేను

నీ కన్న కడుపులో నేనొదుగుతాను!
రామదాసుని గీతి – రవముగా నలంతో
భద్రాద్రి రాములా పాదాల ప్రణమిల్లి
చిరకాల విరహాన చేరుకొందును స్వామి!

(కిన్నెరసాని సంతోషంగా, గలగలా పారుతుంది)

(నేపథ్యంలో)

కిన్నెరల పాటలా, కన్నియల మనసులా,
యువరాణి కిన్నెరె, పువు బోణి వెన్నెలై
కదిలింది కదిలింది కలికి కిన్నెరసాని!
పరువెత్తె పరువెత్తె పడతి కిన్నెరసాని!
గోదావరి హృదయ వీథి విపంచి!
ఆంధ్రావనీ జన కవితా విపంచి!
శ్రీ విశ్వనాథ – రమణీయ కవితా స్రవంతి –
శ్రీ విశ్వసాహితీ– భావనాగేయస్రవంతి–
వేణువుల గానమై, వీణియల నాదమై
తెలుగు కన్నియ పోలె వెలిగె కిన్నెరసాని!
తెలుగు కవితను పోలె వెలసె కిన్నెరసాని!

ఓహో! కిన్నెరసాని!
ఓహో! కిన్నెరసాని!

(హోరుమని కిన్నెరసాని అలల శబ్దాలతో నృత్యంచేస్తూ కనుమరుగౌతుంది)

–సమాప్తం–

(కవి సమ్రాట్టులు, గురువర్యులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి 'కిన్నెరసాని పాటల'కు కృతజ్ఞతాంజలిగా ఈ గేయనాటిక రచింపబడింది)

(ఇది వారికే అంకితం)

సూచన : (1 నుండి 5 పద్యాలు స్వీయ కవితలు)

★ ★ ★

# నిమిత్త మాత్రులు

## నాటిక

రచన

జి.వి.సుబ్బారావు

# నిమిత్త మాత్రులు

## ప్రథమాంకం

**నేపథ్యం :** ముక్కోటి ఏకాదశి పర్వదినాన, తెల్లవారు జామున, పెన్నానదిలో స్నానం చేసి, చలికి వణకుతూ, తంబురమీటుతూ, వృద్ధుడైన దాసరి రంగడు, శ్రీ రంగనాథ స్వామి వారి ఆలయం వైపుగా, ఏటి ఇసుకలో మెల్ల మెల్లగా నడుస్తూ పాటపాడుతుంటాడు.

**రంగడు :** (తంబుర మీటుతూ)

**పెన్నమ్మ జలములూ—పున్నెము లార్జింప**
**మిన్నున నుండకా—నిన్ను చేరగవచ్చె**
**శ్రీ రంగ నాథుడా! – శ్రీ నాథ! మేలుకో!**
**రంగడా! మేలుకో! – శ్రీ రంగా! మేలుకో!!**

**॥రంగడా మేలుకో॥**

**అష్టదిక్పాలురూ—ఆ బాల వృద్ధులూ**
**నిష్ఠతో నినుగొల్వ—నిల్చియున్నారయ్య!**
**రంగనాయక స్వామి!—రమణి శ్రీ దేవి!**
**ఏలుకో భక్తులా—మేలు కొల్పుల తోడ!—**

**॥రంగడా మేలుకో॥**

(ఇంతలో ప్రాతఃమలయానిలానికి, రంగనాథస్వామివారి ఆలయధ్వజ ఘంటలు కదలి, ఘలంఘలారావాలు మంద్ర మంద్రంగా వినిపిస్తుంటాయి. దూరంగా నదీ తీరంలో—

**"కౌసల్యా సుప్రజారామ! పూర్వాసంధ్యాప్రవర్తతే,**
**ఉత్తిష్ఠోత్తిష్ఠ శ్రీ రంగ! ఉత్తిష్ఠ గరుడధ్వజ!"**

అని శ్రీరామానుజాచారి, వైష్ణవశ్రేష్ఠుల గంభీర కంఠస్వనం వినవస్తుంది)

రంగడు : (భయపడుతూ మెల్లగా తంబుర మీటుతూ)

**వాచామ గోచర–వాగర్థ రూపుడ!**
**నీల నీరద వర్ణ–నిగమాంతశ్రేష్ఠుడ!**
**అంధుని, అధమునీ–డెందాన మేలుకో!**

**|రంగడా మేలుకో|**

**శ్రీ రామానుజాచారి :** (కొంత సమీపించి-బిగ్గరగా)

ఎవడా వాచాలుడు? ఒరే! ఆగమసూత్రాలను, శ్రీవైష్ణవ సూక్తాలను పల్లె వేసిన నాకా?–ఈ వేదాంత సారము పదేశించే సాహసము? ఎవరక్కడ?–ఆ!–

**రంగడు :** (భయంతో గజగజ వణకిపోతూ)

అయ్యయ్యో! శ్రీరామానుజ దేశికులా? దండాలండి మహాప్రభో! దండాలు! నేనే నయ్యా! దాసరి రంగడిని. బాబూ! నా యీ అపచారాన్ని మన్నించండి. అయినా తమ బోటి పెద్దోరికి, చదువుకున్నోరికి చెప్పేటంత సాహసం నాకు లేదయ్యా! స్వామీ! అయినా, నాకు తోచిన ఏ పల్లె పదాలతో, కూని రాగాలతో పాడుకుంటున్నాను బాబూ! ఈ ముసలితనంలో ఆ రంగడిని తలుసుకొంటున్నానయ్యా! అంతే–

**రామానుజాచారి :** (దగ్గరగా వచ్చి, పరకాయించి చూచి బిగ్గరగా నవ్వి)

ఆరి! నీ వటరా! ముసలి దాసరీ! అయినా ఈ తుది ఘడియల్లో, ఈ చలిలో, నీ కీ మాఘస్నానా లేమిటిరా? హాయిగా నీ గుడిసె ముందు కూర్చొని, తంబుర మీటి పాడుకోరా! పిచ్చి సన్నాసీ! అంతేగాని, తగుదునమ్మా! అని నీవేదాంతం నాకు వినిపించకు పరేవా! వెళ్ళు! వెళ్ళు!!–

**రంగడు :** (దిగులుగా భయంగా) చిత్తం స్వామీ! చిత్తం! అలాగే! (అని

వెళ్ళిపోతాడు)

**రామానుజాచారి :** (నిట్టూర్చి, నదిలో నీళ్ళలో దిగి చెంబుతో నెత్తిన నీళ్ళు పోసుకుంటూ)

"ఏకో నారాయణో హరిః!" శ్రీరంగరంగా! పినాకినీతట తరంగానీత పునీత మోహనాంగా! శ్రీ రంగనాయకా! నమోన్నమః

**శా॥ వేదంబుల్ గొని రాగ, మత్స్యమయి, నిర్వేదాప్తి శ్రీ కూర్మమై**
**భూదేవిన్ మరులై, వరాహమయి, ఆ భూపాల రక్తమ్ములో**
**భూదేవిన్ జలకమ్ము లార్చిన మహాభూదేవుడై, కృష్ణుడై**
**వైదేహీ సహితుండు రాముడగు, శ్రీవైకుంఠు డీ రంగడై! 1**

**గీ॥ ఆ దశావతార విశేష హాసదీప్తి,**
**ఆ యలౌకిక, తేజో మహానుభూతి,**
**ఆ వినీల నయన రోచు లైక్యమయ్యె-**
**పెన్న తీరాన వెలయు రంగన్న యందు! 2**

(అని స్నానం పూర్తి చేసుకొని, జపం ముగించి, ఇంటికి వెళ్తాడు)

(విరామ సంగీతం)

–...–

(శ్రీరామానుజాచారి పూజామందిరంలో)

**రామానుజాచారి :** (దేవతార్చన ముగించి) మంగా! స్వామి వారికి నైవేద్యం పట్టుకొనిరా! ఆలస్యమై పోతుంది. (అని భార్యను పిలుస్తాడు)

**మంగతాయారు :** (భయభక్తులతో) ఆ! వచ్చే! నైవేద్యం సిద్ధంగానే ఉంది. ఇదిగో తెస్తున్నా (అని నైవేద్యం తెచ్చి ఇస్తుంది)

**రామానుజాచారి :** (నైవేద్యం సమర్పించి, హారతి వెలిగించి గంట వాయిస్తూ)

తాయారూ! మంగళం పాడవే స్వామికి!

మంగతాయారు : (గబగబా చేతులు తుడుచుకొనివచ్చి) ఆ! అలాగేనండీ! (అని)

మంగళం కోసలేంద్రాయ, మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళం।
శ్రీ రంగనాథాయ, శ్రీ నివాసాయ మంగళం।

(అని పాడుతుంది)

(ఇంతలో వాకిట దాసరి రంగడు, మండుటెండలో తంబుర మీటుతూ వచ్చి పాటపాడుతాడు)

రంగడు : ఏకాదశీవ్రత-మేకాగ్రతను జేతు
ద్వాదశీ పారణ-దయతోను సేయవె
రంగనాథ స్వామి-రార వన్నెలుకో। ।రంగనాథ స్వామి।

వేద విప్రుల యింట-వెన్నల పొంగలి
చెన్నుగ వాయింట-జొన్నల యంబలి
।రంగనాథ స్వామి।

మన్నించు దయతోడ-మధ్యాహ్నవేళాయె
పెన్నమ్మ తీరాన-చెన్నుగ వెలసిన। ।రంగనాథ స్వామి।

(అని తన్మయత్వంతో పాడుతాడు)

మంగ : (కంగారుగా వెలికి వచ్చి) ఒరే! రంగడూ! అయ్యవారు ఇప్పుడే నైవేద్యమిచ్చారు స్వామి వారికి. కాస్సేపాగి రారా! నైవేద్యశేషం-చక్రపొంగలి, దద్ధోజనం-ఇస్తా! తిందువుగానీ-

రామానుజ : (ఇంతలో విసుగ్గా వెలుపలికి వచ్చి) ఓరి! త్రాష్టుడా! ప్రొద్దున్నే ఏటి ఒడ్డున తగలడ్డావు. మళ్ళీ సరిగ్గా భోజనాలవేళకు, ఈ మండుటెండలో సరాసరి మా ఇంటికే దాపురించావా! వెళ్ళు

వెళ్ళు! (అని భార్యవైపు తిరిగి) అయినా మంగతాయారూ! ఈ ముసలి దాసరిని కమ్మకమ్మగా నేయి పోసిన చక్రపొంగలితో ఎందుకూరిస్తావు? జొన్నలంబలి తినే ఈ దాసరి కిది తగదు! అపాత్ర దానం చెయ్యబోకు! పద వడ్డించు. నా కాక లెక్కువవుతుంది ఈ వేళ. మంగా! కాస్త విశ్రాంతి తీసుకొని, సాయంకాలం వేదాంతచర్చలకు వెళ్ళాలి మరి (అని రుసరుసలాడుతూ లోనికి వెళ్తాడు)

**రంగడు :** (దిగులుగా భయంగా) మంగమ్మ తల్లీ! అయ్యగారికి ఈయాల ప్రొద్దుటాలనుంచీ నామీద సానా కోవం వచ్చేసింది. ఆకలెక్కువైందేమో? సాములు మఱీంత ఱెచ్చిపోతున్నారు. ముందు ఆయన భోజనం చూడమ్మా! నాదేంటి బిచ్చగాణ్ణి. తల్లీ! మళ్ళీ వస్తాలే! (అని తంబుర విషాదంగా మీటుతూ వెళ్ళిపోతాడు)

(విరామ సంగీతం)

## ద్వితీయాంకం

(శ్రీ రంగనాథస్వామి వారి ఆలయప్రాంగణంలో, ఆ సాయంకాలం విద్వత్సభ జరుగుతుంది. దేశికాచార్యులు, శ్రీమాన్ తాతాచార్యులు అధ్యక్షత వహిస్తారు. శ్రీరామానుజాచారి ఉపన్యాసకులు)

**రామానుజాచారి :** (లేచి సవినయంగా) సభా సరస్వతికి నా నమస్సులు. ఈనాడు చర్చనీయాంశం – మోక్షోపాసనలో ఏది ఉత్తమం? ఏది అనుసరణీయం? ఏది సర్వజన సమ్మతం? – నా అభిప్రాయంలో – శ్రీ రామానుజమతానుసారమైన శ్రీ వైష్ణవ భక్తిప్రపత్తులే శ్రేష్ఠము అన్న దానికన్నా–వేదాంతసారాన్ని మథించి, ఉపనిషత్తులను అవగాహన చేసుకొని, ఈ జ్ఞాన వాహినిని ఆత్మాభిముఖంగా ప్రసరింప చేసి, జ్ఞానసాగర సుధా మధుపానంలో కైవల్యం పొందడమే మహోత్కృష్టం! అదే నా జీవిత ధ్యేయం (అని ఆగాడు)

**తాతాచారి:** (మెల్లగాదగ్గి) నాయనా! రామానుజాచారీ! ఈ నాడు నీవాదం సరి క్రొత్తపుంతలో నడుస్తున్నదేమిరా? 'అహం బ్రహ్మాస్మి' అన్న ఆదిశంకరుల పరిధిలో నీవూ పరిభ్రమిస్తున్నావా? అది అద్వైతం. కానీ మన సంప్రదాయం - జ్ఞానమార్గం కన్నా, భక్తి సులభుడైన ఆ శ్రీరంగశాయియే, వారి పాదసేవయే పెన్నిధి! పామరజనానికీ, ఆ భక్తి ప్రపత్తులే పూల బాటలు, శ్రీరామానుజుల వారి ప్రవచన సారం ఇదే గదా నాయనా!-

**రామానుజాచారి :** (ఆవేశంగా) తాతగారూ! మీరన్నది నిజమే కావచ్చును. కానీ జ్ఞానమార్గమే, నిరంతర సత్యాన్వేషణమే ధ్యేయంగా ఉంచుకొన్న నాకు - ఈ పూల బాటలక్కరలేదు. ఆ కఠోరాద్వైత మార్గాన్నే అనుసరిస్తాను. ఆ ముళ్ళబాటనే పయనిస్తాను. అదే నా అభీష్టం!

**తాతాచారి:** (మెల్లగా నవ్వుతూ) భేష్! రామానుజాచారీ! కష్టాలు కొని తెచ్చుకొంటానంటావు. సరే! నీ ఆశయం మంచిదే! కానీ ఆచరణలో ఎలా ఉంటుందో? అందులో నీవెంతవరకు కృతకృత్యుడౌతావో, భవిష్యత్తు నిర్ణయించాలి. అలాగే కానీ!-

**రామానుజాచారి :** (సంతోషంతో) తాతా! అది నాకు వదిలెయ్యండి! ఆచార్యా! మీవంటి పెద్దల ఆశీర్వాదం, నాదృఢ సంకల్పం,- ఆపైన శ్రీరంగనాథుని దయ-ఉంటే నెరవేరకపోతుందా నా ధ్యేయం? అందుకోలేక పోతానా నా గమ్యం?

**తాతాచారి:** (ఆనందంగా) అలాగే కానీ నాయనా! ఆ! - ఎవరక్కడ? - సభ అంతా ఈ తీవ్ర శాస్త్రచర్చలతో వేడెక్కి అలసిపోయినట్లుంది. ఆలయనర్తకిని, రంగనాయకిని పిలిపించండి. స్వామి సన్నిధిలో, దాని నృత్యగానాలతో, మన పెన్నమ్మ చల్లని పిల్లగాలులతో సేద దీర్చుకొందాం. (అని ఆగుతాడు)

(అంతలో నర్తకి రంగనాయకి, ఒయ్యారంగా కాలిగజ్జెల సవ్వడులతో రంగప్రవేశం చేస్తుంది)

**రంగనాయకి :** సభాసరస్వతికి, రసికులు, విజ్ఞులైన సభాసదులకు నమస్కారం

(అని నాట్యం చేస్తూ పాట పాడుతుంది)

**ఎంత చక్కని వాడే? – ఇంతి! నా రంగడు!**
**నీల నీరద వర్ణుడు – నిత్య మంద స్మితుడు!**
**|ఎంత చక్కని వాడే|**

**కడగంటి చూపుల – కలికి రంగనాయకి**
**నినుజేర వచ్చేను – నీలమేఘశ్యామ!**
**కౌగిట జేర్చవే – కరుణాలవాల! |ఎంత చక్కని వాడే|**

**నీ మ్రోల నృత్యమ్ము – నా తనువె ధన్యమ్ము**
**శృంగార రసరూప – రంగనాయక స్వామి!**
**|ఎంత చక్కని వాడే|**

(ఆఖరి చరణం, రెండు మూడు సార్లు తదనుగుణమైన భావాభినయం చేస్తూ పాడుతుంది. దానికి శ్రోతలందరూ పరవశులై 'శభాష్' అని మెచ్చుకొంటారు. సభ ముగుస్తుంది. చప్పట్లతో, ఆనందోత్సాహాలతో)

(ఆద్వాదశి రాత్రి లేత పండువెన్నెలలో పెన్న ఏటి ఒడ్డున, చల్లగాలిలో, మృదుతరంగాల మృదంగవాదంలో పరవశుడై పరధ్యానంగా రామానుజాచారి నడుస్తుంటాడు)

**రామానుజాచారి :** (స్వగతంగా)

**నీ మ్రోల నృత్యమ్ము – నా తనువె ధన్యమ్ము**
**శృంగార రసరూప – రంగనాయక స్వామి!**

(అని మెల్లగా పాడుతూ)

అహో! ఎంత మధురంగా ఎంత భావగర్భితంగా పాడిందీ

చరణం? రంగనాయకి అభినయం, తదనుగుణ రామణీయకత నన్ను ముగ్ధుణ్ణి చేసాయి. అయినా, ఈ నిశాసమయంలో నా మనసు మనసులో లేకుండా, పరవశించి, పరువులెత్తు తుంది? ఎందుకో రంగా!- (అని బిగ్గరగా అంటాడు)

(ఆ సమీపంలోనే నడుస్తున్న నర్తకి రంగనాయకి సంభ్రమంతో)

**రంగనాయకి :** ఆ! పిలిచారా? స్వామీ! (అని బదులు పలుకుతుంది)

**రామానుజాచారి :** (తత్తరపాటుతో) ఓ! నీవా! రంగనాయకీ! ఈ రాత్రి వేళ నీవేం చేస్తున్నావిక్కడ?

**రంగనాయకి:** (నవ్వుతూ దగ్గరకు వచ్చి) ఓహో! తమరా! రామానుజాచారి గార్లూ! అయినా తమరీ వేళలో ఏం చేస్తున్నారో, నేనూ అదే చేస్తున్నాను స్వామీ! చల్లని పిల్లగాలులలో, ఈ పండు వెన్నెల పరచుకొన్న పెన్నమ్మ ఏటి ఇసుకలలో తేలిపోతున్నాను నేనూ! మీ కల నిజమైందని ఆశ్చర్యపోతు న్నారా? స్వామీ!

**రామానుజాచారి :** ఆ! నేనా?...కల గన్నానా? లేదే? (అని తడబడుతాడు)

**రంగనాయకి :** (గలగలానవ్వి) కలలు గంటున్నారో? కాంతామణిని స్మరిస్తున్నారో తెలియదుగాని - 'నీ మ్రోల నృత్యమ్ము - నా తనువె ధన్యమ్ము' అన్న చరమ చరణాన్ని పదేపదే స్మరిస్తున్నారెందుకు స్వామీ? అయినా స్మర బాణపరంపర ఆచార్యుల వారి రసిక హృదయానికి సూటిగా తగిలి నట్లుంది. అందుకే కళవళ పడ్డారు. శ్రీవైష్ణవ స్వాములు. అవునా?...(అని మళ్ళీ నవ్వుతుంది)

**రామానుజాచారి :** (తేరుకొని, తనూ నవ్వుతూ) అది కాదే! రంగనాయకీ! నీవుపాడిన ప్రతిపదం మధురాతి మధురంగా ఉంది. నీ అభి నయం చిరస్మరణీయంగా ఉంది. నృత్యగానాలు రెండూ ఏకోన్ముఖమై రసానందానికి దారితీసాయి రంగనాయకీ!

అందుకే నా యీ తన్మయత్వం, ఈ పారవశ్యం - (అని ఆగిపోతాడు)

**రంగనాయకి :** (చిలిపిగా నవ్వుతూ) రసిక వరేణ్యులను రంజింప చేయటమే మా వృత్తి స్వామీ! అయినా, తమరు అన్యథా భావింపక, మా మందిరానికి ఒకసారి విచ్చేసారంటే, నా ఆటపాటల్ని అన్నీ మీకు చూపిస్తాను. మిమ్మల్ని ఏ స్వర్గలోకపు టంచులకో తీసుకొని వెళ్తాను. ఏమంటారు స్వాములవారు?.. (అని బదులుకు ఎదురుచూడకుండా, ఒయ్యారంగా కదిలిపోతుంది. గజ్జెలచప్పుడు ఆపాతమధురంగా వినిపిస్తుంది)

**రామానుజాచారి :** (ఉప్పొంగిపోయి) రంగనాయకీ! నా మనసెందుకో ఈనాడు ఉప్పెనలా పొంగి, పెన్నలా నీ నెయ్యం కోరుతుంది. నీ నృత్య గానాలను తనివి దీరా చూచి, విని, పరవశించాలని పరుగులు పెడుతుంది. యౌవనోద్రేకం యెడదలో భరతనాట్యం చేస్తుంది. పదవే రంగనాయకీ! పద! (అని ఆవేశంతో రంగనాయకి చేయిపట్టుకొని విలాసంగా కదుల్తాడు)

**-విరామ సంగీతం-**

(రంగనాయకి పడకగదిలో, మల్లెల మత్తులో అగరువత్తుల సువాసనలలో ద్రాక్షాసవం కైపులో కామతరంగిణిలో మునిగి తేలుతున్న రామానుజాచారి ముందు, రంగనాయకి వీణపై పాట పాడుతుంటుంది)

**రంగనాయకి :** (గొంతెత్తి)

**కోటినదులు—ధనుష్కోటిలో నుండగ**
**ఏటికి తిరిగేవే—ఓమనసా!**
**సూటిగ శ్యామసుందరమూర్తిని**
**మాటి మాటికి జూచే—మహరాజులకు॥ ॥కోటి నదులు॥**

గంగ నూపురంబుగను జనించను
రంగని గావేరిగని రాజిల్లను
బొంగుచు శ్రీ రఘునాథుని ప్రేమతో
బొగడే – త్యాగరాజ మనవి వినవే! ॥కోటి నదులు॥

**రామానుజాచారి :** (లేచి, మత్తులో తూలుతూ, మంద్రస్వరంతో)

ఆపవే! రంగనాయకీ! ఆపు! నాకీ..కృతులు – త్యాగరాజ కృతులసలక్కర లేదు. నీ గానామృతం త్రావి, త్రావి...రంగా! నాకు నిజంగా పిచ్చెక్కింది. ఏదీ నీ అధరామృతం మఱొక్క సారి...ఊ...అందియ్యవే నెచ్చెలీ! లేచిరా? రంగా! నీ ఎడబాటు నేనిక క్షణమైనా సహింపలేను...రంగనాయకీ!

**తరముగాని...ఎండవేళా...కల్ప**
**తరుపీడ...దొరికి నట్టాయె...ఈ వేళ**
**నన్ను విడచి...కదలకువే!...రామ!...(రంగా! కదలకు)**

**విన్నెడ బాసి...అరనిముష మోర్వనులే**
**నన్ను విడచి...కదలకువే!... (రంగా!)...కదలకువే!**
**నా రంగ...నా..య..కీ... కో...టి..న...దు...లు...**

(అని తూలుతూ మూలుగుతూ వచ్చి రంగనాయకిని గట్టిగా కౌగిలిస్తాడు)

(విషాదసంగీతం)

(ఆ నాటి వేకువను, రంగనాయకి కౌగిలిలో పరవశుడై పడిఉన్న రామానుజాచారికి దూరాన ఇలా పాటవినిపిస్తుంది)

**దాసరి రంగడు :** (నేపథ్యంలో తంబురమీటుతూ)

**వాచామ గోచర – వాగర్థ రూపుడ!**
**నీల నీరదవర్ణ–నిగమాంతరూపుడ!**
**అంధునీ, అధమునీ–డెందాన మేలుకో!**

॥రంగడ మేలుకో॥

**రామానుజాచారి :** (ఉలిక్కిపడి, కౌగిలి విడిపించుకొని లేచి, కంగారుగా) అయ్యో! రంగ రంగా! ఇంతలో తెల్లవారిందా? వెళ్ళివస్తానే రంగనాయకీ! నా స్నానపానాలకు, జపానికి వేళయింది. (అని గబగబా ఏటి వైపునడుస్తాడు)

**—విరామ సంగీతం—**

(మళ్ళీ మరునాటి రాత్రి రంగనాయకి శయ్యాగృహంలో పూలపాన్పుపై విలాసంగా రామానుజాచారి పండుకొని ఉంటాడు)

**రంగనాయకి :** (కులుకుతూ ప్రక్కనుచేరి, ఆకుచిలక అందిస్తూ) స్వామీ! శాస్త్ర చర్చలు, వేదాంత భాష్యాలు చేసే పండితులు, గీర్వాణాంధ్రా లలో కవనమల్లే విద్వత్కవులు, ఏమిటిలా మౌనం భజిస్తున్నారు? అయినా మీరిలా కన్నులతోనే నన్ను జుర్రు కుంటుంటే నాకు సిగ్గేస్తుంది బాబూ! అయినా మీకీ మూగ నోమేమిటి?

**రామానుజాచారి :** (గలగలా నవ్వుతూ) మాటాడనా చెలీ! ఏదో తెలియని ఆనందం. అనురాగం మహార్ణవంలా పొంగిపోతుంది నా మనస్సులో. ఈ మధురానుభూతికి అవధులు లేవు రంగా! నాకళాజిజ్ఞాసకు, నా రసికతకు నీవే పరమావధివని ఈనాడే తెలుసుకొన్నాను ప్రియా! నీ మనోహర నృత్యం, నీ సుమధురగానం, నీ ప్రణయరమ్య సాంగత్యం, నా మూగవీణకు వేయి నాదాలు పలికిస్తున్నవి. నీ అధరాల మధురిమ, నా పెదవులపై కోటి వసంతరాగాలు చిలికిస్తున్నవి. ఈ బాహ్యాబంధాలు త్రెంచుకొని నా మనస్సు పెన్న వెల్లువలా, హఠాత్తుగా, నీ వైపే, నీ అనురాగ సాగరాభిముఖంగా ప్రవహిస్తుంది రంగా! దీని కెదురీద లేకున్నాను. అయినా నీ సాన్నిధ్యమే నాకు కైవల్యం. నీవే నా సర్వస్వం. రంగా...(అని ఆగిపోతాడు)

**రంగనాయకి :**(నివ్వెఅపోయి) స్వామీ! కాస్త ఆపండి మీ కవితా ప్రవాహం! కాస్త కళ్ళెం వేయండి మీ మనోతురంగానికి. అన్నట్లు, ఇన్నాళ్ళు కాపురం చేసిన మీ శ్రీమతి మంగతాయారు సాంగత్యంలో తమరికి ఆనందానుభూతి లేదా? లేక, ఇది కేవలం నన్నుబ్బి, తబ్బిబ్బు గావించటానికి మీరంటున్న ముఖస్తుతా?

**రామానుజాచారి :** (కోపంగా) రంగా! చాలు! ఆపు నీ అధిక ప్రసంగం. ఆ పాతచింతకాయ పచ్చడి ప్రసక్తి నాకిక్కడ తేవద్దు. ప్చ్. అలాంటి వాళ్ళతో ఒకే చిక్కు! ఎంతసేపూ ఆచారం, మడీ, సంప్రదాయం. భక్తీ.. వీటితో ముదిసి ముత్తైదువలై, అకాలవృద్ధులై మగణ్ణి విసిగిస్తారు. ఈ చాదస్తపు తాయార్లు! అందుకే ఆ కూపస్థ మండూకాల సాహచర్యం నాకు విసుగెత్తింది. మొహం మొత్తి- క్రొత్తదనం కోసం, మార్పుకోసం, స్వేచ్ఛకోసం, చైతన్యంకోసం- ఇలా పరుగులెత్తాను ఆ బంధాలనుండి. వెదుక బోయిన తీవలా నీవు తగిలావు రంగా! నా జీవితమే క్రొత్త మలుపు త్రొక్కింది. అందుకే నేనొక శృంగార రసచక్రవర్తినయ్యాను నీ ప్రణయ సాంగత్యంలో..(అని నవ్వుతాడు)

**రంగనాయకి :**(విట్టూర్చి) పాపం! ఆ వెఱ్ఱి బాగుల ఇల్లాలి మనోవ్యథ మీకేం తెలుస్తుందిప్పుడు స్వామీ! అయినా అపర వైదికశ్రేష్ఠులు, పరమ నిష్ఠాగరిష్ఠులు, ఒక్కసారి ఈ శృంగార రసతరంగిణిలో తలమున్కలైతే, రసికాగ్రేసరులైతే, భావుక శిరోమణులైతే-ఫలితం ఇలాగే ఉంటుంది మరి!-

**యినువ కచ్చడాల్ గట్టుకొను మునిమ్రుచ్చులెల్ల**
**దామరసనేత్రలిండ్ల బందాలుగారె"?**

అని ఊరికే అన్నదా వరూథిని? ఈ లౌకికానందపు టంచులు చూసేవరకు తమకు తనివి తీరేటట్లు లేదు! ఆగండి! స్వామీ! ప్రణయానికైనా సమయా సమయాలు లేవా మరి?

**రామానుజాచారి :** (నవ్వుతూ) రంగనాయకీ! మనకింకా సమయా సమయా లేమిటే పిచ్చిదానా? మన మనసులు - సంగీత సాహిత్యాలు పెనవేసుకొన్నట్లు, శబ్దార్థాలు కలిసిపోయినట్లు - ఏకమైనాయి. అందుకే ఈ ఆనందపు టంచులు చూసేదాకా- నీ సాంగత్యంలో మైమరచే దాకా నాకు తృప్తి లేదు. తనివితీరదు రంగా!

**గీ॥ మధుర గీతమ్ము, మమతల మధువు నింపి**
**నృత్యమాధురి, ప్రణయ సాంగత్యమొసగి,**
**రసిక హృదయమ్ము శృంగార రసములొల్కి**
**జన్మతరియించె! రంగ! నిస్సంశయముగ!** 3

**రంగనాయకి :**

(భయంగా నిట్టూర్చి) మీ కామావేశపు ఉరకలు చూస్తుంటే నాకేదో భయంగా ఉంది స్వామీ! దేనికైనా హద్దులు మీరకూడదు ప్రభూ! నా మాట వినరా!

**రామానుజాచారి :** (నవ్వుతూ) అయ్యో! ఇంత బేలవైపోయావేమి రంగా? ఒక్క చుక్కేడు మధువుతో, నీ స్వామి గుక్కతడిపితే, అన్ని భయాలు మటుమాయమైపోతాయి. ఏదీ? ఇవ్వు ఆ మధుపాత్ర!...

(అని మధుపాత్ర బలవంతంగా అందుకొని, గటుగటా అంతా త్రాగుతాడు)

**రంగనాయకి :** (విషాదంగా) ప్రభూ! రంగనాథా? ఎంత దుఃస్థితి? ఎంత తపన? ఎంత పతనం? ఎంత కామావేశం? రంగ రంగా!..

**—విషాద సంగీతం—**

## తృతీయాంకం

(అది మండువేసవి మిట్ట మధ్యాహ్నం దాసరి రంగడు చెమటలు కార్చుకుంటూ తంబుర మీటుతూ, ఆయాస పడుతూ వస్తుంటాడు)

**రంగడు :** (నిట్టూర్చి, భారంగా)

మండేటి ఎండలు–మెండైన కామాలు
పండంటి కాపురం–పచ్చనీ తోరణం
నిండునా దహియించె–నిలువునా గాల్చె!
రంగనాథ స్వామి–రార! నన్నేలుకో! ।రంగనాథ।

సర్వమ్ము భారమ్ము– శ్రీ రంగ శాయిరో
నీ పైన ఉంచాను–నిన్నె నే నమ్మాను!
రంగనాథ స్వామి–రార! నన్నేలుకో! ।రంగనాథ।

(అని పాడుకుంటూ వచ్చి, మంగతాయారు ఇంటిముందు ఆగి) మంగమ్మతల్లీ! ఈ ముసలి దాసరి కింత అన్నంపడేయి తల్లీ! (అని అడుగుతాడు)

**మంగతాయారు :** (దిగులుగా వెలుపలికి వచ్చి, ఏడుస్తూ నిలబడుతుంది)

**రంగడు :** (కంగారుగా) ఏమైందమ్మా! మంగమ్మా! ఎన్నడూ కంట తడిపెట్టని భూదేవివి! నీకేం కష్టం వచ్చిందమ్మా? అయ్యగారింకా భోజనానికి రాలేదా? తల్లీ!–

**మంగమ్మ :** (గద్గదకంఠంతో) ఏమని మాటాడను రంగన్నా! నేనేదో మహాపరాధం చేసాను. లేకుంటే నా స్వామి నన్నిలా తృణీ కరిస్తాడా? ఆ రంగనాయకి వలలోపడి–నా స్వామి–మధువులు గ్రోలుతూ–రంగరంగా! దైవాన్ని, జపాన్ని, వేదాధ్యయనాన్ని– తుదకీ ఇంటినీ, అగ్నిసాక్షిగా పెండ్లాడిన ఇల్లాలిని నన్నూ – అన్నీ మరిచి సంచరిస్తాడా? ... తాతా! నువ్వే చెప్పు... ఈ సంసారం చక్కబడుతుందా? నా పతి మళ్ళీ నాకు దక్కుతాడా?..(అని వలవలా ఏడుస్తుంది)

**రంగడు :** (నివ్వెరపోయి) తల్లీ! నేననుమానించిన దంతా నిజమైందా? నీ ఏడుపు నీ కన్నీళ్ళు చూస్తుంటే, నా కడుపు తరుక్కుపోతుంది

మంగమ్మ తల్లీ! అన్నీ తెలిసిన శ్రీరామానుజాచార్యులవారే, ఇలా వార వనితావ్యామోహంలో పడితే, ఎవరేం అనగలరు? (నిట్టూర్చి) అయినా ఈ దుఃఖం మీలోనే అణచుకోండి. నాతో గనుక అన్నారు. గానీ–'కడుపు చించుకొంటే కాళ్ళ మీద పడుతుంది' గదా! అమ్మా! అసలు అయ్యగారు ఈ ఇంటి చాయలకే రావటం లేదా? తల్లీ!

**మంగతాయారు :** (అతికష్టంతో వెక్కిళ్ళ నాపుకొని) ఆ! వస్తారు రంగన్నా! వస్తారు! ఏ మూడు నాలుగు రోజుల కొకసారి లేక ఏ వారాని కొకసారో? అదీ తూలుతూ కళ్ళెర్ర చేసుకొని వస్తారు. ముళ్ళ మీదున్నట్లు, మూడు నిముషాలుండి, ఆదరాబాదరాగా తిరిగి వెళ్ళిపోతారు. తాతా! నావైపు కన్నెత్తైనా చూడరు. వారి పరిస్థితి చూస్తే నాకు దిగులేస్తుంది. నీవైనా నాకు తరుణోపాయం చెప్పు రంగన్నా! నేనెలా బ్రతకాలి ఇంక?..(అని ఏడుస్తుంది)

**రంగడు :** (పేలవంగా నవ్వి) పిచ్చిమంగమ్మ తల్లీ! నేనా? నీకు దారి చూపించేది! అయ్యగారి మనస్సు కొండకొమ్మనుండి క్రిందికి దుమికే సెలయేరులా ఉంది. తల్లీ! దాన్నెవరు మళ్ళింపగలరు? అది ఆ జగన్నాథుడు రంగనాథస్వామికే తగును. ఆయనే మన కందరికీ శరణ్యం? రంగరంగా! ఎంతకష్టం వచ్చిందే? తల్లీ! నీకు–

**మంగతాయారు :** (ఆవేశంతో) ఇంతేనా తాతా? నాగతి! వాకే కన్నీళ్ళు, ఈ రాత్రి జాగరణలు, ఈ నిత్యుపవాసాలు, ఈ నిరీక్షణలు తప్ప వామరి? ఇదేనా ఆడపుట్టుకకు పరమార్థం – వేదనలు, రోదనలేనా? రంగన్నా! ఇదేనా! నావిధి?

**రంగడు :** (ఆవేదనతో) కాదుతల్లీ! కానేకాదు! కాలం కలిసి వచ్చేవరకు నీవు ఓపిక పట్టాలి మంగమ్మా! ధైర్యం కూడ గట్టుకొని దుఃఖాన్ని దిగమ్రింగాలి. అంతేనమ్మా! అంతే! ఈ ముసలి దాసరి నీ కింత

కన్న ఏంచెప్పగలడమ్మా?.. (అని దిగులుగా తంబుర మీటుతూ కదిలిపోతాడు)

**మంగతాయారు :** (పెద్దగా ఏడుస్తూ) రంగ రంగా!..నా గతి ఇంతేనా ప్రభూ!.. (అని లోనికి గబగబా వెళ్ళిపోతుంది)

**—విరామసంగీతం—**

(రంగనాయకి శయ్యామందిరంలో)

**రామానుజాచారి :** (నిషాలో మత్తుగా గొంతెత్తి)

**గీ॥ నిత్య వాసంత మధుర సాంగత్య మెనసి,**
**వార్షికాభ్ర తటిల్లత, వలపుదనిసి,**
**సిత శరజ్జ్యోత్స్న-ప్రియురాలి స్మితము లొలికి,**
**శీధుశీతల రమ్యమౌ శిశిరనిశలు!** 4

ప్రియా! రంగనాయకీ! నీ మృదుమధుర గానంతో నా కవితా హృదయరంగస్థలంలో నాట్యం చెయ్యి! ఏదీ ఒక్కజావళీ పాడు. ఒక్క మృదుమధుర పదవిన్యాసం-చూపవే రంగా! ఆడవే-పాడవే నా రంగనాయకీ! ఒక్కసారి..రంగా..ఏదీ మఱొక్కసారి..అబ్బా..(అని విపరీతమైన దగ్గు తెరవచ్చి ఆగిపోతాడు. మళ్ళీ తేరుకొని ఆయాసంతో నోటమాటరాక నాట్యం మొదలు పెట్టమని సంజ్ఞ చేస్తాడు.)

**రంగనాయకి :** (దిగులుగా నాట్యం చేస్తూ)

**పున్నమచంద్రుని – వెన్నెల సొగసున**
**వెన్నలదొంగని – వన్నెల మగటిమి**
**మిన్నయౌ నవిపించు – చిన్ని నా స్వామియె**

। పున్నమ।

(అని శోకంతో, రామానుజాచార్యుని దగ్గ విని ఆగిపోతుంది)

**రామానుజాచారి :** (తేరుకొని, దీనంగా) పాడవే రంగా! నీ పాట వింటూ, నీ కాలి గజ్జెల సవ్వడులు వింటూ, ఈ మధువు సేవిస్తూ ఉంటే, ఆ వైకుంఠమే దిగివచ్చి నట్లుంది. రంగనాయకీ! నీ పాట ఆపితే, నా గళం మూగవోతుంది. నీ నృత్యమాగితే నా గుండె ఆగిపోతుంది నెచ్చెలీ! ఏదీ మళ్ళీ మొదలు పెట్టు ఆ పాట! ఏదీ నీ ఆట? సాగించు నీ నృత్యం - రంగా! - నా జీవన తంత్రిని మ్రోగించి, నా హృదయవీణ నాలపింపవే - ప్రియా! (అని దగ్గుతాడు ఆయాసంగా)

**రంగనాయకి :** (పట్టరాని దుఃఖంతో వెక్కి వెక్కి ఏడ్చి, తేరుకొని, మళ్ళీ నాట్యం, గానం మొదలు పెట్టుంది.)

**వన్నెలు తరిగెను – పున్నెము లొరిగెను**
**రాహువు మ్రింగిన – రాజు, నా జాబిల్లి!**
**ధర్మము దప్పిన – కర్మపు పథమున**
**దిగజారె, దిగజారె – దివినుండి భువికి !** ।పున్నమ।

(అని ఆపైన పాడ లేక గొంతు బొంగురు వోయి పెద్దగా ఏడుస్తూ కూలబడుతుంది కుప్పగా నేలమీద)

**రామానుజాచారి :** (అతికష్టంతో కనులెత్తిచూసి) ఓసీ! పిచ్చి రంగనాయకీ! ఎందుకే నీకీ దుఃఖం? నా గురించేనా? ఈ తుది ఘడియలలో కూడా నీమీద నా కనురక్తి తరిగిపోలేదే రంగా! నీ కౌగిలే నాకు ముక్తి. ఈ మధువు నాకు రక్తి. అదే నాకు కైవల్య ప్రాప్తి రంగా! అబ్బా ! గుండెల్లో ఏదో ఆరని మంట! తీరని ఆవేదన! రంగా! ఏదీ మరొక్కసారి ఆ మధుపాత్ర ఇలా ఇయ్యి! (అని రంగనాయకి ఒడిలో బాధతో వ్రాలిపోతాడు) (రంగనాయకి బాధగా, ప్రేమగా అతని తల నిమురుతుండగా, నేపథ్యంలో దాసరి రంగని పాట వినవస్తుంది)

(నేపథ్యంలో)

**రంగడు :** (తంబుర మీటుతూ)

జో అచ్యుతానంద ! జోజో ముకుందా!
లాలి పరమానంద ! ... లీల గోవిందా    ।జో అచ్యుతా।

ఓ రంగ! నా రంగ! నీ మందహాసాల
శిశిరర్తు చంద్రికలు –తెల్లబోయాయి!
నీ కంటి వెలుగుల – నిత్య హేమంతాల
లోకాల యిడుములే – చీకట్ల నణగాయి !    ।జో అచ్యుతా।

ఆదర్శ వైష్ణవుని – అధమాధముని నన్ను
కామినీ లోలునీ – దాసానుదాసునీ
ఇల్లాలి తాయారు – వెలయాలి రంగనూ
సమభావదృష్టితో – సాయుజ్య మిచ్చేవు !    ।జోఅచ్యుతా।

**రామానుజాచారి :** (ఉలిక్కిపడి లేచి తూలుతూ) రంగా! .. ఎందుకో నాకు నా మంగతాయారును ఉన్నవళంగా చూడాలనిపిస్తుంది. వె....ళ్తు....న్నా....రంగా! (అని గబగబా వెళ్ళిపోతాడు. రంగనాయకి విభ్రాంతయై చూస్తుంది)

**– విరామ సంగీతం–**

## చతుర్థాంకం

( రామానుజాచారి స్వగృహంలో, శయనాగారంలో విపరీతమైన దగ్గుతో ఆయాసంతో ప్రక్కపైన రామానుజాచారి బాధ పడుతుంటాడు)

**రామానుజాచారి :** (ఆయాసంగా నిట్టూర్చి, ఖంగున దగ్గి)

ఊఁ! మంగా!... ఎందుకే నాకీ మందులు చావుకు సిద్ధమైన వాడికి నాకీ పాడు చేదు మందులు, ఈ పెన్న నీళ్ళతో గొంతు తడి ఆరటం లేదు. మంగా! దయచేసి – అబ్బా!... ఒకే ఒక్క గ్రుక్కెడు... ఆ ... మధువు... తాయారూ!.. నా కందించవే! నీకు పుణ్యముంటుంది... (అని విపరీతమైన దగ్గు తెర వచ్చి

ఆగిపోతాడు)

**మంగతాయారు :** (వెక్కివెక్కి ఏడుస్తూ) నన్ను మన్నించండి స్వామీ! మధువు మీకపథ్యం! దాన్ని ముట్టనైనా ముట్టవద్దని అన్నారు వైద్యులవారు! అయినా మహాపర్వదినం! ఈనాడు ముక్కోటి ఏకాదశి! ఉపవాస ముండలేరు సరిగదా! ఈదినమా, మద్యపానం? అయ్యయ్యో! రంగరంగా! ఎంత నైష్ఠికులకు ఎంత కర్మ భ్రంశం? (అని పెద్దగా విలపిస్తుంది)

(ఇంతలో రంగనాయకి, దీనవదనయై రంగనాథస్వామి తీర్థ ప్రసాదాలతో జంకుతూ లోనికి వస్తుంది. ఈ దృశ్యం చూచి కరిగి నీరై భరింపలేక -)

**రంగనాయకి :** (వెక్కి వెక్కి ఏడుస్తూ) స్వామీ! రామానుజాచార్యా! తమరు చివరికీ స్థితికి దిగజారారా? రంగ రంగా! ఎంతఘోరం జరిగింది నా మూలంగా!

**మంగతాయారు :** (ఉలిక్కిపడి లేచి తలెత్తి కోపంగా)

ఆ! నీవా? మహా తల్లీ! నా స్వామి ఇంకా బ్రతికే ఉన్నాడని చూడటానికి వచ్చావా? వారి నీ దుఃస్థితికి తెచ్చింది చాలక, 'తగుదునమ్మా' అని నన్నవహేళన చేయడానికి, నా పసుపు కుంకుమలు నేలపాలు చేయడానికి తలపడ్డావా? రంగనాయకీ! తల్లీ! తమరు చేసిన నిర్వాకం చాలు! నీ కిక్కడ స్థానం లేదు నడు బయటకు! (అని గద్దిస్తుంది)

**రామానుజాచారి** (స్పృహ వచ్చి, లేచి, తూలుతూ వచ్చి మంగతాయారు చేయి పట్టుకొని) ఆగు! మంగా! ఆగు! ఎవరినే నీవంతలేసి మాటలంటున్నావు? నా చిన్ని రంగనాయకినా? ఎంత పిచ్చిదానివే మంగతాయారూ? అబ్బా! (అని బాధతో గుండె పట్టుకొని) ఇదంతా నా స్వయంకృతాపరాధం మంగా! పాపం రంగనాయకి నన్ను మొదటి నుంచీ ఈ 'అతి'- మానమనే వారిస్తున్నది. కానీ-ఈ రేగిన - చెలరేగిన - మనో బుద్ధ్య హంకారాలనే ఆబోతు -

విజృంభించి - తల పాలమునగాని నిలువలేదు. అందుకే - ఈనాటి నా దుఃస్థితికి ఎవ్వరూ బాధ్యులు కారు! నా రంగనాయకి అసలే కాదు! ఇప్పటికైనా నన్ను నమ్ముతావా? మంగా! రంగా! ఎందుకా కంగారు? నీవూ ఇలా దగ్గరికిరా!

(అని ఇరువురినీ చేరదీసి, మంగ ఒడిలో వ్రాలిపోతాడు)

**మంగతాయారు :** (ఏడుస్తూ) చెల్లీ! రంగనాయకీ! ఈ నా అర్థం పర్థం లేని దురహంకారాన్ని, ఆవేశాన్ని మన్నించు తల్లీ! ఆడదాని సహజ ఈర్ష్యాసూయలతో, నా యీ ఆవేదన ఆపుకోలేక నిన్ను నోటికొచ్చినట్లు మాట్లాడాను. నన్ను క్షమించు రంగమ్మ తల్లీ! నన్ను రక్షించు రంగనాయకీ! (అని మంగతాయారు రంగనాయకి చేతులు పట్టుకొని ప్రార్థిస్తుంది)

**రంగనాయకి :** (భారంగా నిట్టూర్చి) అయ్యో! ఎంత మాట! ఎంత మాట! మంగతాయారుతల్లీ! నిన్ను 'అక్కయ్యా' అని పిలిచే ధైర్యసాహసాలు నాకు లేవు. అయినా నీ హృదయ వైశాల్యం, నీ మహోన్నత సంస్కారం... నన్ను 'చెల్లీ! అని ఆప్యాయంగా పిలిచింది. అదే నాకు పదివేలు తల్లీ! స్వామివారు తమ ఈ క్షీణదశ స్వయంకృతాపరాధమన్నారు. కానీ ఇందులో నా స్వార్థమూ కొంత ఉంది తల్లీ! ఆ నాడు ఆలయ ప్రాంగణలో నా ఆట పాటలు చూచి, నాపై మోజు పడిన, ఈ పరమ వైష్ణవ నిష్ఠాగరిష్ఠుణ్ణి ఈ స్వామిని నాపాదాక్రాంతునిగా చేసికొందామన్న అహం, సౌందర్యగర్వం నాతో కొంత ఉంది. అంతే మంగమ్మా! ఆ పైన వారన్నదే నిజం. వారిని సన్మార్గం నుండి భ్రష్ఠుని చేయగలిగానే కాని, గతి తప్పిన వారి వైదిక జీవిత గమనాన్ని తిరిగి సరిదిద్ద లేకపోయాను. అయినా ఏటికెవరడ్డు ఈదగలరు? 'నదీనాం సాగరోగతిః' అదే నా పరమాపరాధం మంగమ్మతల్లీ! (అని వలవలా ఏడుస్తుంది).

**మంగతాయారు** : (నివ్వెరపోయి, తేరుకొని) అయ్యో! పిచ్చితల్లీ! రంగా! అయినా ఎవరి కర్మ కెవరు బాధ్యులు? విజ్ఞత, విధి ప్రభావంతో తప్పుదారి పట్టిస్తుంది. నీవు కేవలం నిమిత్త మాత్రురాలివి! నా దుష్కృతం, ఇలా నా స్వామిని పట్టిపీడిస్తుంది ఈ ఘోర వ్యాధితో.! లేకుంటే ఈ పాడు రోగం నాకు సంక్రమించి, వారి కళ్ళ ముందే నేను పసుపు కుంకుమలతో వెళ్ళిపోతే ఎంత బాగుండును. అయినా నాకంత అదృష్టమా? రంగనాథా! (అని విలపిస్తుంది)

**రంగనాయకి** : (నిట్టూర్చి) నీవలా ఎందుకు చింతిస్తావు తల్లీ! ఇప్పుడే రంగనాథ స్వామిని అర్చించి వస్తున్నాను. నా స్వామి ప్రాణాలు నిలబెట్టి, నీ కాపురం చక్కబెట్టమని. వారిని కోలుకోనిచ్చి, నా ప్రాణాలు బలితీసుకొమ్మని, రంగనాథుని మనసారా వేడుకొని వచ్చాను. మంగమ్మతల్లీ! నన్ను నమ్ము! (అని ఏడుస్తుంది. మంగతాయారు కూడా చలించి, ఏడుస్తుంది)

**రామానుజాచారి** : (తేరుకొని నిట్టూర్చి) ఓః ఎంత పిచ్చిపిల్లలు మీరిద్దరూ! ఎందుకు మీకీ వ్యామోహం నాపైన. అబ్బా! దాహం! గుండెల్లో మంట. గొంతులో కాలాగ్ని జ్వాలలు!... నేనీ బాధ భరింపలేను. నా ఎదలో, దవాగ్ని రగిలి, నా నెత్తురు పిండుతున్నట్లుంది. అయ్యో! నా కీ యమయాతన నుండి విముక్తి లేదా? రంగనాయకీ!... ఇలా దగ్గరికిరా! (అని పిలుస్తాడు దీనంగా)

**రంగనాయకి** : (భయంగా, మంగతాయారుమ చూస్తూ) స్వామీ! నన్నేనా? మీరేనా పిలిచేది?

**మంగతాయారు** : (నిట్టూర్చి) వెళ్ళమ్మా! వెళ్ళు చెల్లీ! నిన్నే ఆయన మనసారా పిలిచేది. వెళ్ళు!...

**రామానుజాచారి** : (రంగనాయకి చేతిని తన చెంపలకానించుకొని నిమురుతూ)

చూడు రంగా! నీ కరస్పర్శ గూడా నాకీ నాడు మనశ్శాంతి కల్గించటం లేదు. ఈ చివరి ఘడియల్లో, ఈ మరణ యాతనలో నేను సుడిగుళ్ళు తిరిగి పోతున్నాను. ఈ గూటిలో గువ్వ ఎగిరి పోవడానికి ఎంత తంటాలు పడుతుందో చూసావా? రంగా! నా రంగా!... అబ్బా! (అని మూర్ఛపోతాడు).

**రంగ, మంగ :** (ఇద్దరూ భయంతో ఏడుస్తారు పెద్దగా)

(ఇంతలో దాసరి రంగడు తంబుర మీటుకుంటూ లోనికివచ్చి, ఈ దృశ్యం చూచి కన్నులు చెమ్మగిలి...)

**రంగడు :** (దిగులుగా) ఏమిటమ్మా? మంగమ్మతల్లీ! అంత నీరు గారిపోతే ఎలా? అయ్యగారికి నిండా జబ్బుగా ఉందని పరుగెత్తు కొచ్చానమ్మా! అయినా మనం ఇప్పుడు చేయగలిగిందేమీ లేదు తల్లీ! మనం కేవలం నిమిత్త మాత్రులం! ఆపైన అంతా శ్రీరంగ నాథస్వామివారి దయ! ఆ పెన్నమ్మ తల్లిచలవ! అంతేనమ్మా! అంతే! (అని పరకాయించి చూచి) ఆ! రంగనాయకమ్మ తల్లీ! మీరూ ఇక్కడే ఉన్నారా? అమ్మా! సరిగ్గా సమయానికే వచ్చినట్లున్నాను నేను ఇక్కడికి (అని ఆగుతాడు)

**రామానుజాచారి :** (దాసరి రంగని మాటలు లీలగా వినబడి తేరుకొని, కన్నెత్తి చూస్తూ బాధగా) ఒరే! నీ వటరా? దాసరీ! నా జాత్యహంకారం, నా శాస్త్రవైదుష్య గర్వం - నా కళ్ళు తలకెక్కింప చేసాయి రా! రంగడూ! ఇదంతా అమాయకుడవు పరమభక్తుడవైన నిన్ను, దూషించిన ఫలితమేరా! అది, ఈ, నా తుది ఘడియలలో తెలిసివచ్చింది నాకు. కానీ ఏం ప్రయోజనం? జరుగవలసిన అపచారం జరిగిపోయింది స్వామివారికి. ముసలి దాసరివని నిన్ను వెక్కిరించాను. కానీ నీవు పరమ భాగవతోత్తముడవని తెలుసుకోలేక పోయిన అజ్ఞానిని నేను. దురహంకారినినేను. (అని ఆయాసం ఎక్కువై ఆగి)అబ్బా! బాధగా ఉందిరా గుండెలోతుల్లో!

గుణం, భక్తి! ప్రధానం అని ఈనాడు నా కళ్ళు తెరిపించావురా! దాసరీ! పరమ నిష్ఠాగరిష్ఠుడైన శ్రీవైష్ణవుణ్ణి నేను. ఈనాడు అధః పతన మొందాను. జాఊను డిగ జాఊను నైతికంగా, మానసికంగా! నా పతనం దుర్భరం. అనూహ్యం. కానీ ఈనాటికీ ఆనాటికీ – తామరాకుపై నీటి బొట్టులా మసలుతూ, నిర్వికారుడివై. నా జ్ఞాన జ్యోతిగా. నా అంతరాత్మ ప్రబోధంగా. భగవద్భక్తుడి గానే మిగిలిపోయావు నీవు. నీవు నిమిత్తమాత్రుడివి కాదురా! సాక్షీ భూతుడైన నా రంగనాథ స్వామివే నీవురా!... అబ్బా... ఈ నా అంతిమ ఘడియలలో కలిగిన ఈ జ్ఞానోదయానికి ఫలితం మాత్రం శూన్యం. నాకు గాఢాంధకారమే మిగిలింది చివరికి! (అని పెద్ద దగ్గు తెరవచ్చి ఆగాడు) (మళ్ళీ తేరుకొని) రంగా! నీవైనా బెట్టుచేయక నా కా మధువు కాస్త అందియ్యవే! నా మంగ వెఱ్ఱి బాగులది. నే నింకా బ్రతికి బట్టకట్టుతాననే, అది పిచ్చిగా... పగటి కలలు గంటున్నది. అబ్బా! బాధ! మంట!. (అని చేయి సాచి ఆగిపోతాడు మూల్గుతూ)

**రంగనాయకి :** (భయంతో వణికి పోతూ) మధువా? స్వామీ!... ఇప్పుడా?... ఈ పరిస్థితులలోనా?.. (అని సంశయిస్తుంది)

**మంగతాయారు :** (ముఖం చేతులలో కప్పుకొని) స్వామీ! ఏమిటివిధి? (అని ఏడుస్తుంది)

**దాసరి రంగడు :** (నిట్టూర్చి) తల్లీ! రంగనాయకీ! ఇవ్వమ్మా మధువు! ఇవ్వు! అయ్యగారి ఈ స్థితి ఊహ కందనిది. అందులో పథ్యం లేదు. అపథ్యం లేదు. ఆ గూటిలో చిలక ఎల్లాగైనా పారిపోవడానికే శాయశక్తులా ప్రయత్నిస్తుంది తల్లీ! దాన్ని మన మాపలేం. మనం నిమిత్తమాత్రులమే! ఈ చివరి క్షణాలైనా అయ్యగారిని శాంతింపచేయండి. భయపడకుండా అందియ్యి తల్లీ! ఆ మధుపాత్ర! త్రాగనీ వారిని. త్రాగనీ తృప్తిగా!... ఆ మధువుని...

**రంగనాయకి :** (వణికిపోతూ) ఆ! ఇదుగోనండీ! మధుపాత్ర! స్వామీ! కొంచెమే త్రాగండి. చాలు.... ఆ! చాలు!...

**రామానుజాచారి :** (ఆత్రంగా అందుకొని గబగబా రెండు గుటకలు మ్రింగి తేరుకొని) ఒరే దాసరీ! ఆ శ్రీరంగశాయి నీ రూపాన తంబుర మీటుతూ నాకు ప్రత్యక్షమైనాడురా! ఈనాడు నీ పుణ్యమా అని నా ప్రాణం కుదుట బడింది. అయినా సునిశిత మేధావుల కందని ఈ పరమవేదాంత రహస్యాలు నీకెలా వంట బట్టాయిరా! చెప్పరా పిచ్చి సన్నాసీ! (అని పేలవంగా నవ్వుతాడు)

**దాసరి రంగడు :** (గంభీరంగా) అవును స్వామీ! అవును! నాకా రహస్యాలు ఆ పెన్నమ్మ తల్లి చల్లని మెల్లని పిల్ల అలలు చెవిలో ఊదాయి. ఆ శ్రీరంగశాయి కోవెలలో గుడిగంటలు గుండెల్లో ప్రతిధ్వనించాయి. అయినా చదువూ చట్టు బండలూ లేనోణ్ణి నాకేం తెలుస్తుంది స్వామీ! అవన్నీ. అయినా మీ ప్రాణం మరింత కుదుట బడటానికి నేనొక చిన్న చిట్కా చెప్తాను వింటారా? మరి!... (అని ఆగుతాడు సాలోచనగా)

**రామానుజాచారి :** (పరమానందంతో) ఆ! ఆ! చెప్పరా! దాసరీ! చెప్పు! ఈ క్షణంలో నీవేది చెప్పినా నేను వినడానికి సంసిద్ధమే. నాకది ఋగ్వేదమే మరి! ఈ నరకయాతన నేనింక భరింపలేనురా!.. చెప్పు అదేదో త్వరత్వరగా! (అని గుండె పట్టుకొంటాడు బాధతో దగ్గి)

**దాసరి రంగడు :** (తృప్తిగానవ్వి) ఆ! అలాగే చెప్తాను స్వామీ! వినండి మరి! (అని తంబుర శృతి చేస్తాడు)

**రామానుజాచారి :** (పెద్దగా నవ్వి) భలేరా! దాసరీ! భలే! ఒరే! రంగడూ! నీవు పరమలౌక్యుడివిరా! అవునులే! నా యీ అవసాన సమయంలో శ్రీరంగనాథస్వామి వారికి- శ్రీ సూక్తం, విష్ణుసూక్తం, సహస్రనామాలు, తిరుమంత్రం - అవన్నీ భజించి తరింప

లేనురా! ఏకాదశీ ఉపవాస వ్రతం అంతకన్నా చేతకాదు. పాపిని, వేశ్యాలోలుణ్ణి, మధుపాన మత్తుణ్ణి, క్షయవ్యాధి పీడితుణ్ణి! అబ్బా! (అని బాధగా దగ్గి) నా మంగనూ, ఈ రంగనాయకినీ - మిమ్మల్నందరినీ - ఇలా వదిలేసి, ఒంటరిగా వైతరణిని వెదుక్కుంటూ వెళ్తున్నాను. ఎంత చిత్రంగా ఉందికదూ నా కథ? ఒరే దాసరీ! ఈ వివేక భ్రష్టుని పతనం - ఎంతవరకు వచ్చిందంటే - ముసలి దాసరివనీ అజ్ఞానుడివనీ, అంధుడవనీ - ఈసడించుకొన్న - నీలో - వంశపరంపరాగతమైన మహోన్నత సంస్కృతీ, అతిలోకరమణీయమైన ఆ పల్లె పదాలలోని, నవనీతం లాంటి వేదాంతం - నీ తంబురా శృతులలో మేళవించి, నీ కూనిరాగాలు నన్ను జోకొడుతుంటేగాని, నాకు తరుణోపాయం రాదు. ముక్తి లేదు. అవునా దాసరీ!... అబ్బా!... ఇదీ నా భావ విపర్యయం! ఇదీ నా జీవిత నాటక పతాక స్థితికి అవ్యయీ భావం! నా వేదన పరాకాష్ఠ నందుకొన్నది. నా జీవన మథన, తారాస్థాయిని చేరింది. ఈ నా చరమాంక ప్రహారంలో - (అని దగ్గువచ్చి ఆగి).... తరతమ భేదాలు లేవు. పాడరా! రంగడూ! కమ్మగా పాడు నీ పాట! ఏదీ ఒకే ఒక్కసారి నీ పల్లె పదాలు, నీ జానపదరామణీయకత వెల్లివిరిసిన, ఆ తత్త్వాలు పాడు. నీ తంబురమీటు! నీ హంస గీతాన్ని ఈ క్షుభిత హృదయానికి వినిపించు. నీ అమాయకపు మేలుకొలుపుతో, నాలోని జీవాత్మను పునీతంచేసి, ఆ, విశుద్ధాత్మలో కలుపు. పాడరా రంగన్నా పాడు! ఇక ఆలస్యం చేయకు! యమ ఘంటికా నినాదాలు చెవిలో మార్మోగుతున్నాయి. ఈ యాతన నేను భరింపలేనురా! అబ్బా! నన్ను రక్షింపరా దాసరీ! రంగ రంగా! (అని సొమ్మసిల్లి మంగతాయారు ఒడిలో వ్రాలి పోతాడు)

**రంగనాయకి :** (లేచి గుండెనిమిరి. తీర్థం గొంతులో పోసి) ఊరడిల్లండి స్వామీ! లేవండి.

**రామానుజాచారి :** (తేరుకొని భారంగా కనులెత్తి చూస్తూ) ఊఁ పాడరా! దాసరీ! ఏదీ నీ ఆ నాటి పాట మళ్ళీ వినిపించు! ధన్యుణ్ణౌతాను...

**రంగడు :** (నిట్టూర్చి దిగులుగా తంబుర మీటుతూ) అలాగే! అయ్యగారూ! అలాగే!

**పెన్నమ్మజలముల – పున్నెములార్జింప**
**మిన్ననుండక – నిన్నుజేరగ వచ్చె**
**శ్రీరంగనాథుడ! శ్రీ నాథ! మేలుకో**
**రంగమేలుకో – శ్రీరంగా! మేలుకో! ॥రంగ మేలుకో॥**

**పామర జనములు – పరమవైష్ణవులు**
**పాపాతి పాపులు – పరమ పవిత్రులు**
**ముంగిటలేచారు – ముక్కోటి దేవతలు**
**రంగడ మేలుకో – శ్రీరంగ! మేలుకో!!॥రంగ మేలుకో॥**

**రామానుజాచారి :** (ఆనందంతో లేచి కూర్చొని)

ఒరే! దాసరీ! గుర్తుందా? ఒకనాడు – ఆ! ఆ ద్వాదశినాటి తెల్లవారు ఝామున, మాఘస్నానం చేసి వస్తుంటే నీవు నాకెదురు పడ్డావు. అబ్బా...

**రంగడు :** (బాధగా నిట్టూర్చి) అవును స్వామీ! నాకిప్పుడు గుర్తు కొస్తుంది. అయ్యగారికి ఆవేళ నామీద మా చెడ్డ కోపం వచ్చింది. ఏమేమో అరిచారు నన్ను తమరా వేళ. అయినా అవన్నీ నేను పట్టించుకోను స్వామీ!.

**రామానుజాచారి :** (పశ్చాత్తాపంతో) అవునురా దాసరీ! అవును! నేనా నాడు క్రొవ్వెక్కి అహంకారంతో నిన్ను 'పుట్టంధుడవు గ్రుడ్డివాడవు...” అని ఏవేవో నోటికొచ్చినట్లు మాట్లాడినాను. కానీ నే నీనాడు – దాసరీ! నీకన్న చాలా హీనస్థితిలో ఉన్నానురా!... అబ్బా!...

శా॥పుట్టంధుండను.. గ్రుడ్డివాడను.. మహాభోగంబులన్ ముగ్గి – నా
పట్టెల్లన్ జెడిపోయె – దుస్సహజరాభారంబు – లీ వ్యాధితో
పుట్టెన్ ప్రాయమునందె! – నా యఘములంభోరాశులై పొంగె – క
న్పట్టెన్ దవ్వున–మృత్యుదేవత – మహానాట్యమ్ము – నిత్యమ్ముగా !5

అబ్బా! ఎంత బాధ! (అని గుండెపట్టుకొని మూల్గి) – ఏదీ మళ్ళీ ఒక్కసారి ఆ నాటి చరణం, పాడరా! రంగడూ! అబ్బా! అదేదో చప్పున గుర్తుకు రావటం లేదురా!... ఆ.. మెల్ల మెల్లగా గుర్తొస్తుందిప్పుడే! అదేరా! రంగడూ! అదే... "అంధునీ, అధమునీ.. డెందానమేలుకో!"... నన్ను మన్నించి మరొక్కసారి ఆపాట పూర్తిగా పాడి వినిపించరా! నీకు పుణ్యముంటుంది. నేనూ తరిస్తాను. (అని బాధగా ఆగిపోతాడు)

రంగడు : (పేలవంగా నవ్వి తంబురమీటి) సరే స్వామీ! అలాగే పాడతాను!

వాచామ గోచర!.. వాగర్థ రూపుడ!
నీల నీరద వర్ణ! నిగమాంత రూపుడ!
అంధునీ, అధమునీ - డెందాన మేలుకో
రంగడ మేలుకో - శ్రీరంగా! మేలుకో!

రామానుజాచారి : (ఆనందంతో భక్తి పారవశ్యంతో పులకించి చేతులెత్తి నమస్కరించి) భేష్ దాసరీ! శభాష్! రంగడూ! ఇదే నా అంతిమ యాత్రాపథ సుగమసంగీతం! నీ పామరజన తారక నామ సంగీతం! ఇదేనా నీపాట రంగడూ! ఏదీ నేను పాడనా?..

**వా..చా...మ... గోచర. వాగర్థ...రూ..పు...డ!**
**నీలనీరదవర్ణ – ని.గ. మాంత... రూపుడ!**
**అంధుని, .... ఈ... అధమునీ... డెందాన.... మే...లు..కో.**
**రంగడ..మే..లు..కో!..శ్రీ..రం..గా! మేలు..కో.. రంగా!..**

(అని మంగ ఒడిలో స్పృహతప్పి పడిపోతాడు. మంగతాయారు కూడా ఏడుస్తూ వ్రాలి పోతుంది భర్తపై స్పృహతప్పి)

దాసరి రంగడు : (నిట్టూర్చి లేచి వచ్చి, దంపతులిరువురినీ స్పృశించి, వాడి చూసి.

పెదవివిరిచి) అయ్యో! లాభం లేదు! రంగనాయకమ్మా! ఈ ఇద్దరు పుణ్యదంపతులు మనకిక లేరు! ఒకరినొకరు విడలేని పవిత్ర దాంపత్య బంధం వారిది. అందుకే ఇలా కన్ను మూసారిద్దరూ ఒకరి ఒడిలో మరొకరై! ఒకే ఒక్క క్షణంలో! శ్రీరంగనాథా! అంతా నీ లీల!

**రంగనాయకి :** ( పెద్దగా ఏడుస్తూ) స్వామీ!... అక్కా!... నన్నిలా ఒంటరిదాన్ని చేసి, వెళ్ళారా మీరిద్దరూ! ఆలుమగల అనుబంధం ఇంత పునీతమైందా! తల్లీ! మంగతాయారూ! పుంస్త్రీగా వెళ్ళిపోయావు ధన్యురాలివై! పాపిష్ఠిదాన్ని నేనే మిగిలాను జీవచ్ఛవంలా! అయ్యో! రంగరంగా! నాకేదిగతి?.. (అని వ్రాలిపోతుంది)

**దాసరి రంగడు :** (లేచి, కళ్ళు తుడుచుకొని వారికి నమస్కరించి, దీనంగా తంబుర మీటుతూ) రంగరంగా! శ్రీరంగనాథ స్వామీ! నాకళ్ళ ముందే ఈ పుణ్యదంపతుల నిద్దరినీ ఒకేసారిగా నీలో లీనం చేసుకొన్నావా? తండ్రీ! నన్ను కేవల నిమిత్త మాత్రునిగా చేసి, నీవే ఈ నాటకం ఆడావా స్వామీ! రంగనాథా! నీకరుణ అపారం. తండ్రీ! ఈ దీనుణ్ణి కూడా ఎన్నడు కటాక్షిస్తావో మరి!

**వాచామగోచర! వాగర్థ రూపుడ!**
**నీలనీరదవర్ణ! నిగమాంతరూపుడ!**
**అంధునీ...ఈ... అధమునీ.. డెందానమేలుకో!**
**రంగడ! మేలుకో... శ్రీ రంగా! మేలుకో!!!**

(అని విషాదంగా తంబుర వాయిస్తూ కదలిపోతాడు. దూరాన మంద్ర మంద్రంగా శ్రీ రంగనాథాలయ ధ్వజస్తంభంపైని చిరుగంటల ఘలంఘలారావాలు దైన్య సూచకంగా మ్రోగుతాయి. పెన్నమ్మ తల్లి చల్లని అలల మృదురాగాలు, శోక భరితంగా వినిపిస్తాయి.)

– సమాప్తం –

(సూచన : 1 నుండి 5 పద్యాలు స్వీయకవితలే)

☆ ☆ ☆

# పాదాభివందనం

పద్యనాటిక

రచన

జి.వి.సుబ్బారావు

# పాదాభివందనం

## నాంది (PROLOGUE)

(నేపథ్యంలో :-

**శరణు! తథాగతా! శరణు! శ్రావణ పూర్ణశశాంకబింబమా!**
**శరణు! మహాప్రవక్త! నుతశాక్య కులాంబుధి చంద్ర బింబమా!**
**శరణు! యశోధరా ప్రణయచారు మహోజ్జ్వల భావరూపమా!**
**శరణు! ప్రపంచ శోకగత శాపవినాశన! బుద్ధదైవమా! !-**
బుద్ధం శరణం గచ్ఛామి! సంఘం శరణం గచ్ఛామి! ధర్మం శరణం గచ్ఛామి)

(ఆచార్య నాగార్జునులు, వారి శిష్యులు ఆనంద వర్ధనులు, శ్రమణిక వెంటరాగా, అమరావతీ స్తూపశిల్ప నిర్మాణ కార్యక్రమాన్ని పరిశీలిస్తూ, బౌద్ధారామంలో తిరుగాడుచుందురు. దూరాన, సన్నగా, మంద్రముగా పైన జెప్పిన బౌద్ధ భిక్షువుల ప్రార్థనారావములు, మధ్య మధ్యలో శిల్పుల ఉలుల చెక్కుడు మ్రోతలు" ఖణోఖణో మని వినిపిస్తుంటాయి.)

**ఆనందవర్ధనుడు :** (ఆనందంతో) : ఆచార్య నాగార్జున దేవా! ఈ అమరావతీ స్తూపశిల్పాలు ఎంత రమణీయంగా ఉన్నవి. సజీవ సుందరములైన ఈ శిల్ప మూర్తులు చరితార్థతను పొందుతాయి ఈ భారతావనిలో.

**శ్రమణిక:** (నవ్వుతూ) అందుకు సందేహమా ఆనందవర్ధనా! గురుదేవుల పర్యవేక్షణలో ఈ తెనుగు శిల్పి తనలో నిగూఢమైన, ప్రతిభావ్యుత్పత్తులను, ఈ ఉలిలో దాచి, ఈరమణీయ శిల్ప కళాఖండాలను, ఈ జడమైన శిలారూపంలో నుండి, సజీవంగా వెలికి దీసి, ప్రదర్శిస్తున్నాడు. ఈ తెనుగు బిడ్డ హస్తకళా నైపుణ్యం అనన్యం. అద్వితీయం, అజరామరం. ప్రభూ! అటు చూడండి! యశోధరా దేవిని, రాహులుని వీడి, నిర్మమత్వంతో కదిలే, ఆ తథాగతుణ్ణి చూస్తే-నా కన్నులు చెమ్మగిల్లుతున్నవి

గురుదేవా! (అని ఆగిపోతుంది)

**నాగార్జునుడు** : (ఉత్సాహంగా) అవునమ్మా! శ్రమణికా! అవును! నయన పర్వంగా ఉంది ఆ తథాగతుల వియోగ సన్నివేశం! అహో! ఈ ఆంధ్ర శిల్పుల మహత్తర శిల్పకళా చైతన్యం! వీరి శిల్పకళా ప్రాశస్త్యమే నన్నీ బౌద్ధ స్తూపనిర్మాణానికి పురికొల్పింది. ఎంత పరమోత్తమమైన కథా వస్తువు గదా! కరుణారస భరితమైన తథాగతుని జీవితచరిత్ర! దానిని శాశ్వతంగా ముందు తరాల వారికి అందించాలంటే ఈ శిల్ప కళాఖండ ప్రదర్శనే ఉత్తమమైన మార్గం! అవునా? ఆనందవర్ధనా!–

**ఆనందవర్ధనుడు** : (ఉత్సాహంతో) అవును ఆచార్యా! బోధిసత్త్వుని కమనీయ గాథా కదంబం, ఈ స్తూప శిల్పాలలో, ఈ అపురూపమైన నల్లపాలఱాతి విగ్రహాలలో, సజీవంగా ప్రతిఫలిస్తుంది. ప్రశస్తమైన, ఈ బౌద్ధమత ధర్మపతాక, ఈ అమరావతీ స్తూప శిల్పాలతో పరాకాష్ఠనందుకొంది. ఈ కృష్ణవేణీ వినీల తరంగ సంచలనంలో, ఆ కీర్తి రేఖ, ఆ ప్రతిభా శిల్పపతాక, పదికాలాల పాటు చల్లగా నిలిచి ఎగరాలి!

**నాగార్జునుడు** :(నిట్టూర్చి) అవునోయీ! ఆనందవర్ధనా! అదే నా ధ్యేయం! ఈ మహత్తర శిల్ప సృష్టిలో, ఇదే బుద్ధ భగవానులకు ఈ శిష్య పరమాణువు సమర్పించు గురుదక్షిణ! వినయంతో, అత్యంత భక్తి ప్రపత్తులతో నే నందించే నివాళి!

**శ్రమణిక** : (ఆనందంతో) ఆచార్యా! అటు చూడండి! ఆ నల్ల పాలరాతి శిల్పమెంత మనోహరంగా ఉందో? ఎవరో చూడండి. ఆ ఇరువురు యువతులు, బుద్ధ భగవానుని పాదాలపై మ్రోకరిల్లి, పాదాభివందనం చేస్తున్నారు. అహో! ఎంతటి శ్రద్ధాభక్తులు! ఎంత తన్మయత! గురుదేవా! అదేమి? ఒకరి కనులలో అనంతమైన ఆవేదన, వేరొకరి నయనాలలో అనన్యమైన

ఆనందం వెల్లి విరిస్తున్నాయి. ఈ వైవిధ్యభావ ప్రదర్శనం ఎలా సాధ్యమైందో, ఈ శిల్ప కళా నైపుణ్య మేమిటో నా కర్థం గావటంలేదు. ఆచార్యా! ఏమిటిది?...

**ఆనందవర్ధనుడు :** (సంకోచంగా) అంతేగాదు. గురుదేవా? ఒకరు తలవంచి, కన్నులు అర్ధనిమీలితాలుగా పాదపూజ చేస్తుంటే, వేరొకర్తె తల్లక్రిందులుగా తలవ్రాల్చి, జుట్టు విరియబోసుకొని, అధోగతిగా, కనులెత్తి, భగవానుని పాదాలనే వెఱ్ఱిగా చూస్తున్నది. అది ఆమె హృదయావేదనో, తన్మయత్వమో, లేక ఉన్మాదమో, ఏదీ తెలియ రాకుండా ఉంది. ఆచార్యా! ఇది ఈ మహాంధ్ర శిల్పుల ఊహా రమణీయ చిత్రమా? లేక (అని ఆగిపోతాడు)

**నాగార్జునుడు :** (గట్టిగా నిట్టూర్చి) నాయనా! ఆనందవర్ధనా! తల్లీ! శ్రమణికా! ఈ మహత్తర శిల్పకళాఖండం, నిజంగా జరిగిన, ఇద్దరు యువతుల విషాద రమణీయ గాథ! అహెూ! అది తలచుకొంటేనే నా ఒడలు పులకరిస్తుంది. ఒకనాడు నా హృదంతరాలలో, గాఢంగా హత్తుకొని పోయిన, హృదయ విదారకమైన, కరుణారస భరితమైన సన్నివేశమేయిది! ఊహకన్న, కల్పనకన్న, వాస్తవమే ఒక అపూర్వమైన వింత. ఈ మహత్తర శిల్పం. నిజంగా ఒక మహాదృశ్యకావ్యం. జరిగి ఎన్నాళ్ళో అయినా, ఈ నాటికీ, నా కన్నుల కది, నిత్యనూతనంగా, మనసు హత్తుకొనేలా అనుభూతికి వస్తుంటుంది. అహెూ! మహాంధ్రశిల్పి! నీ వెంత అమరుడివయ్యా! శిల్పకళానైపుణ్యంలో. నా మనోదర్పణంలో, నా యీ ఎదలో గాఢంగా ముద్ర వేసుకొన్న, ఈ కరుణారస తరంగితమైన వాస్తవానికి, ఎంత మనోజ్ఞమైన రూపకల్పన చేసావయ్యా! తెలుగు శిల్పి! ఎంత సజీవ సుందరం? ఎంత చైతన్యవంతం? ఎంత భావనా సాంద్రత. అహెూ! ఎంత తన్మయత! ఇది కేవలం వల్లిపాలరాతి విగ్రహాలని తెలిపిన నేనే భ్రమిస్తుంటాను. ఈ రమణీయ దృశ్యాన్ని తిలకించి. తిరిగి.

తిరిగి ఆనాటి దృశ్యాన్ని నాకన్నులగ గట్టినట్లు చేసిన ప్రతిభామూర్తి
విగదయ్యా! అమరశిల్పీ! తెనుగు బిడ్డా! నిజంగా నీవే ధన్యజీవివి
ఈ భారత కళాసాహిత్య చరిత్రలో !

**శ్రమణికః** (ఆవేగంతో) ఆచార్యా! ఏమిది? నేడు మీరింతగా తన్మయులై నారు ఈ పాదాభివందన శిల్పాన్ని తిలకించి. గురుదేవా! ఈ మహత్తర శిల్పం వెనుక దాగిన కరుణామయ గాథ, మీ ఎదలో ఇన్నాళ్ళూ నిక్షిప్తమైన, ఆ విచిత్ర సన్నివేశం మాకు వినిపించరా? నా హృదయం ఆ ఆవేదనా మూర్తుల కన్నీటి గాథ వినాలని పరితపించి పోతుంది. ఎందుకో నా మనస్సు ఆర్ద్రమై పోతుంది ఈ దృశ్యాన్ని చూస్తుంటే! – గురుదేవా! చెప్పండి ః –

**ఆనందవర్ధనుడు** ః (ఆతృతగా) నాకూ అలాగే ఉంది ఆచార్య దేవా? మీ నోటనే ఆ రసార్ద్ర గాథ వినాలని కుతూహల పడుతున్నాము. మమ్మల్ని మన్నించి మాకా విచిత్ర గాథ వినిపింపరా ప్రభూ!

**నాగార్జునుడు** ః (నిట్టూర్చి) చెపుతానమ్మా! శ్రమణికా! చెప్తానోయ్! ఆనంద వర్ధనా! వినండి ! శ్రద్ధగా ఆర్ద్ర హృదయంతో – అవి నేను గురువర్యులు, తథాగతుని శ్రద్ధతో, శుశ్రూష చేస్తున్న పుణ్యదినములు. బోధిసత్త్వులు మహాజ్ఞుల తేజంతో పరివ్రాజక చక్రవర్తులై, మహాప్రవక్తలై, తమ వాక్సుధలతో బోధనలతో భారతావనిని సమస్తం ఊపి వేస్తున్న చరిత్రాత్మక ఘట్టమది! అవమానాలకు, అపవాదులకు జంకక, శిష్యకోటితో బయలుదేరి దేశమంతా తిరిగి బౌద్ధ ధర్మాన్ని ప్రపంచించేవారు గురుదేవులు! అజ్ఞానాంధకారంలో, వైదికమూఢమతాచారాలతో, కర్మ బంధాలతో నతమత మవుతున్న భారతావనికి, కరుణా సముద్రంలో పొడిచే భానుమూర్తిలా, జ్ఞానజ్యోతిలా, నిశ్చలమైన, నిత్యమైన వెలుగును, సత్యాన్ని చూపించిన, ఆ తథాగతుని బౌద్ధమత ప్రచారం ముమ్మరంగా సాగుతున్న శుభ దినములవి.

వారికి అంతే వాసిగా, వారి శిష్యపరమాణువునై. వారి కరుణకు, అత్యంత ప్రీతికి పాత్రుడనై. సంచరిస్తున్న పవిత్ర ఘడియలవి. ఒక పరి గురువు గారితో కలిసి మేమందరం, నంద మహారాజు వారి నగరం వెలుపల, మధురోద్యానవనంలో విడిది చేసాం. జనమంతా తండోప తండాలుగా వచ్చి, తథాగతుల ధర్మబోధలు విని తన్మయులై, తరిస్తున్నారు. ఆ సమయంలో ఒకనాడు.

- (Flash back)

## ప్రథమాంకం

(నేపథ్యంలో :

**శరణు ! తథాగతా! శరణు! శ్రావణ పూర్ణ శశాంక హాసమా!**
**శరణు! మహాప్రవక్త! నుతశాక్య కులాంబుధి చంద్రబింబమా!**
**శరణు! యశోధరా ప్రణయ చారు మహోజ్జ్వల భావరూపమా!**
**శరణు! జగత్ప్రశస్త మత సాధక! గౌతమ! బుద్ధదేవమా!** 2

**బుద్ధం! శరణం గచ్ఛామి!**
**ధర్మం! శరణం గచ్ఛామి!**
**సంఘం! శరణం గచ్ఛామి!**

(రాజనర్తకి మాలిని, ఆమె చెలి సుందరి, ఉద్యాన వనంలో కాలిగజ్జియలు ఘల్లు ఘల్లుమని శబ్దం చేయగా సంచరిస్తుంటారు.)

**మాలిని :** (ఎగతాళిగా) సుందరీ! ఎవరే? ఆ తథాగతుడు? వేలం వెఱ్ఱిగా, ఈ పిచ్చి ప్రజ, ఆ సన్యాసిని చూడటానికి, ఊరి వెలుపల మామిడితోపు వైపుకు పరుగు లిడుతున్నారట! ఎంత ఆశ్చర్యం? ఎంతవింత?

**సుందరి :** (దీనంగా) మాలినీ! నీవెంత రాజనర్తకివైనా, అంతటి మిడిసి పాటు తగదమ్మా! బుద్ధ భగవానుల వారి మహిమ నీవు

వినలేదా? ఆ తథాగతుని దివ్యబోధనలలో, జనమంతా పులకితు లౌతున్నారు. మనమూ వెళ్ళి, ఒకసారి ఆ పరివ్రాజక శ్రేష్ఠుని, దర్శించి తరిద్దాం. ఏమంటావు మాలినీ? –

**మాలిని :** (వికటంగా నవ్వి) హ్హా!హ్హా! దర్శించి, తరిస్తావా? పిచ్చి సుందరీ! తరించడమేం ఖర్మ! ఈ భవబంధాల నుండే విముక్తి పొంది రావే, పిచ్చితల్లీ! ఆ! ఏదో సామెత ఉందిలే! "సన్యాసి, సన్యాసి రాచుకుంటే బూడిదే రాలిందట!" అలా ఉంది నీ పరిస్థితి. అయినా నాకీ పిచ్చి పరివ్రాజకులతో పనియేమి? పాటలీ పుత్ర ప్రభువులు, నందమహారాజులు, నా నృత్యగాన కళా నైపుణ్యానికి తన్మయులు కాగా, రసికులైన సభికులను మెప్పించి మన్నన లందడం, కళాసాగరంలో బ్రహ్మానందంలో ఓలలాడడం, ఇదీ. నా పని. తెలుసా! అన్నట్లు ప్రభువుల దర్శనానికి వేళయింది. త్వరగా తెమిలి రావే! వెళ్దాం రాజుగారి కొలువుకు. (అని చిరాకుగా వెళ్ళిపోతుంది)

**సుందరి :** (నిట్టూర్చి) హే! బుద్ధ భగవాన్! ఈ అమాయకురాలిని, ఈ అజ్ఞానిని మన్నించి రక్షించు ప్రభూ! అంతా నీ దయ తండ్రీ! బుద్ధం శరణం గచ్ఛామి! (అని నమస్కరించి, ఆమె వెనువెంట పరుగెత్తుతుంది)

–...–

(నందుని కొలువులో మాలిని నృత్యం చేస్తుంటుంది. సుందరి వీణ వాయిస్తూ పాట పాడుతుంటుంది. వసంతోత్సవ సందర్భంగా ఏర్పాటయిన ఈ నృత్యానికి విచ్చేసిన సభికులంతా తన్మయులై ఆలకిస్తూ, తిలకిస్తూ ఉంటారు.)

**సుందరి :** (వీణమీటుతూ)

**అందము మాదేకదా! – ఆ**
**నందము – మీదేకదా!** ‖ అందము‖

నా చెలి మాలిని నాట్యమాడగా
పూచెను పూలవి సౌరభాలుగా,
నాచెలి మాలిని నృత్యమాడగా
ఆశల వెల్లువ పొంగి పొరలెగా ।అందము।

మాలిని : (నృత్యం చేస్తూ)

గానము మాదే కదా ! సం
ధానము మీదే కదా ! ।గానము।

సుందరి వీణియ తీగ మీటగా
ఎందును వినవీ రాగమాయెగా
కోమలి గొంతుక విప్పిపాడగా
ఆమని కోయిల కూత దోచెగా ।గానము।

(ఇద్దరూ కలిసి పాడుతారు. మాలిని నృత్యం చేస్తూ పాట పాడుతుంది)

గానము, నృత్యము, మాదు సొంతమూ!
ఆనగ మధువులు మీదు స్వాంతమూ!
సర్వకళామయ జీవనమ్ములో
ఉర్విని మన్మథు డేలె వలపులో! ।గానము।

అధరము జిందెడి తేనియ మేమూ.
మధువుల గ్రోలెడి మధుపము మీరూ
ఆమని వెలసిన వెన్నెల మేమూ
కామన దేలెడి మదములు మీరూ! ।అందము।

సభికులు: (సంతోషంతో పెద్ద కరతాళ ధ్వనులు చేస్తూ)

భేష్ ! మాలినీ! శహభాష్! సుందరీ! మీ నృత్యగానాలచేత మమ్మల్ని రసతరంగాలలో ఓలలాడించారు. మీ కళా ప్రతిభ కివే

మా జోహార్లు! భళారె! భళా! (అని బంగారు నాణాలు బహుమతిగా విసురుతారు)

మాలిని : (సంతోషంతో, గర్వంతో) కళాభిజ్ఞులైన రసికులకు, నృత్యగాన సమ్మిళిత, లలిత కళాపోషకులైన రాజవంశీయులకు, రససమ్రాట్టులు, కళా మూర్తులునైన నందమహారాజులకు, ఈ రాజనర్తకి, మాలిని ఎంతైనా ఋణపడి ఉంది. మీ అందరి ఆదరాభిమానాలతో మేమెంత వారమై నాము. ఈ కళాభినివేశము ఈ రసార్ద్రత – అంతా మీ చలవే! సహృదయులు, రసజ్ఞులునైన ఈ సభాసదులకివే, మా జోహార్లు! – (అని నమస్కరిస్తుంది)

సుందరి : (వీణ విషాదంగా శ్రుతి చేస్తూ తలవంచుకొని కూర్చుని ఉంటుంది మౌనంగా) (సభికులంతా 'వాహెవా' 'భళారె' అని మెచ్చుకుంటూ రాజుగారి సెలవు దీసుకుని వెళ్ళిపోతారు. నందమహారాజు గద్దెదిగి వీరిని సమీపిస్తాడు మెల్లగా)

నందుడు: (విషాద గంభీరంగా) మాలినీ! ఈ నాడు నీ నృత్యం, సుందరీ! ప్రత్యేకంగా, నీ వీణా నాదం, గాత్రం మాకెంతో బాహ్యానందాన్ని కలిగించాయి. ప్చ్ – (నిట్టూర్చి) కానీ – మా ఎద లోతుల్లో – ఏదో తెలియని అవ్యక్తమైన ఆవేదనవిషాదబీజంలా మొలకెత్తింది. అదుగో! ఆ సుందరి మౌనంగా విపంచిపై ఒకే ఒక తీగను మౌనం భజిస్తూ విషాదంగా శ్రుతిచేస్తున్న విధంగా, గుండెల్లో ఏదో విషాదగానం మూల్గుతున్నది ఎలుగు పైకిరాక. అన్నట్లు – సుందరీ! నీ వెందుకిలా మౌనంగా, దిగులుగా ఉన్నావు. ఇంత ప్రశంసార్హమైన ప్రదర్శనానంతరం నీకే దిగులేమిటి?!

మాలిని : (ముందుకు వచ్చి, బిగ్గరగా నవ్వి) ప్రభువులు మన్నించాలి. ఈ దినం ఉదయం నుంచీ అది ఇలాగే మౌనంగా, అన్య మనస్కంగా ఉంది. దాని బేల మనసు [illegible]తో సన్నాసి దొంగిలించాడట! అందుకని, దిగులుపడి, దాని మనోమర్కటం శాఖాచంక్రమణం

చేస్తుంది ప్రభూ! అంతేగదూ సుందరీ!-

సుందరి : (తత్తర పాటుతో వీణ వదలి లేచి, నమస్కరించి) లేదు! ప్రభూ! లేదు! మాలిని తమతో పరిహాసమాడుతుంది. అయినా బుద్ధ భగవానులు, ఈ క్షుద్రురాలి, మనసుపై మోజుపడి, హరిస్తారా! కల్ల! (అని ఆగిపోతుంది)

నందుడు: (ఉలిక్కిపడి, కంగారుగా) ఆ! ఏమన్నావే? సుందరీ ఇది నిజమా! శాక్యవంశ శశాంకులు, తథాగతులు విచ్చేసారా? మన పాటలీపుత్రానికి? అయ్యయ్యో! ఎంత అపచారం జరిగింది. ఎంత ఘోరావమానం జరిగింది నా వలన బుద్ధ భగవానులకు (అని కోపంగా మాలిని వైపు తిరిగి) ఓసీ! రాజవర్తకీ! నీ కెంత కండకావరమే! మా మహారాణి సౌందర్యవల్లె నీవునూ, తుచ్ఛ సౌందర్యాన్ని, రాజభోగాలనీ చూచి త్రుళ్ళిపడకు. శాంత కరుణారస ప్రతిబింబమైన, నా అన్న, తథాగతులా, నీకు సన్యాసులని తోచిందా? ఓసీ, దుష్టురాలా! ఓసి మదవతీ! నీ కెంత అహంకారమే? నీకు పొగరెంత కండ కెక్కినదే నీచురాలా! (అని బిగ్గరగా చప్పట్లు చరిచి) ఆ! ఎవరక్కడ! - ఈ మదాంధురాలైన మాలినిని పట్టి బంధించి, చెరసాలలో పడవేయండి. కఠినకారాగార వాసమే దీని అహంకారమునకు తగిన శిక్ష (అని కదిలి పోబోతాడు)

సుందరి : (ముందుకువచ్చి భయంగా, పాదాలకు మ్రొక్కి) ప్రభూ! నందమహారాజా! ధర్మప్రభూ! దయాసముద్రులైన మీరు, బ్రహ్మాస్త్రాన్ని ఈ పిచ్చిదానిపై ప్రయోగిస్తారా? నా చెలి మాలిని, నిజంగానే అంధురాలు. దీనికి పిచ్చిదైన కనువిప్పు, ఆ బుద్ధ భగవానులే కల్పిస్తారు. తమరు, నా విన్నప మాలించి, నా చెలిని, ఈ కఠిన కారాగారవాస శిక్షనుండి తప్పించండి. మహాప్రభూ! నన్ను మన్నించి, మాలినిని రక్షించండి మహారాజా! (అని

ఏడుస్తుంది)

**నందుడు:** (తేరుకొని, నిట్టూర్చి) లే! సుందరీ! లే! నీ మాట మన్నించి, ఈ మూర్ఖురాలిని క్షమిస్తున్నాను. అది, ఇక ముందెన్నడైనా, నా ముందు ఇట్టి పిచ్చి వాగుడు వాగితే సహించను. జాగ్రత్త! నీదే పూచీ! సుందరీ! - (అని గబగబా వెళ్ళిపోతాడు)

**సుందరి :** (పెద్దగా నిట్టూర్చి లేచి) హమ్మయ్య! ఈ పెద్ద గండం గడిచి, బ్రతికాము తల్లీ! మాలినీ!

**మాలిని :** (కోపావమానాలతో రెచ్చిపోయి) సుందరీ! మహాతల్లీ! నీకొక నమస్కారం నీ మహారాజుల వారికొక పదివేల నమస్కారాలు. తల్లీ! నిజంగానే నాకీనాడు బుద్ధి వచ్చింది అయినా "క్షణక్షణముల్ జవరాలి చిత్తాలు కావు తల్లీ!" - ఈ మదాంధులైన ఏలికల చిత్తాలే అని ఈ నిజం, ఈ నిప్పు లాంటి సత్యం - నాకిప్పుడే తెలిసివచ్చింది సుందరీ! అవునులే! నిన్నటి వరకూ, సౌందర్యమహారాజ్ఞీ, శృంగార రసకేళీ పట్టభద్రులు ఈ రాజనర్తకి మాలినీ నృత్యగాన సమ్మోహిత కళావేత్తలు. మహారసిక చక్రవర్తులు కళాపోషకులు. కానీ, నేడో హఠాత్తుగా మారిన సర్వసంగ పరిత్యాగులు, కామ, మోహ విరహితులు, తథాగతుని అనుయాయులు, పరివ్రాజక సోదరులు - అవునా సుందరీ! - (బిగ్గరగా) హ్హ! హ్హ ఎంతలో ఎంత విపర్యయము తల్లీ! నాకీ చంచలులైన రాజుల కొలువక్కరలేదు. ఈ రాజనర్తకి పదవి అంతకన్నా అవసరం లేదు. నా బ్రతుకేదో నేను బ్రతుకుతాను. ఈ రాజపోషణ లేకుంటే నేను బ్రతుకలేనా? నన్ను పోనీవే! (అని విసురుగా వెళ్ళిపోతుంది.)

**సుందరి :** (నిట్టూర్చి దిగులుగా) యథారాజా! తథా ప్రజా! ప్రభూ! బుద్ధదేవా! తథాగతా! నీ కరుణారస బోధనా ప్రవాహంలో, ఇలా మనఃకల్లోలాలు రేగ వలసిందేనా ప్రభూ! నా చెల్లి, మాలిని,

అవేశపరురాలు, తొందరకత్తె కానీ ఒట్టి అమాయకురాలు! అజ్ఞాని. దాన్ని నీవెలా రక్షిస్తావోగదా! తండ్రీ! (అని మౌనంగా వెళ్ళిపోతుంది).

## ద్వితీయాంకం

(మాలిని పడకగది. తెల్లవారు జామున, నిద్రపట్టక, మనఃస్థిమితం లేక వ్యాధి గ్రస్తమైన మాలిని, పట్టుపరుపుపై, అటునిటు దొరలాడుచు, మూల్గుతుంటుంది. ఇంతలో పూజాద్రవ్యాలు తీసుకొని, సుస్నాతయై, జారు ముడివేసికొని, సుందరి ఆ గదిలోనికి వస్తుంది.)

**మాలిని :** (మూల్గి, భారంగా కనులెత్తి చూచి) ఊ!- నీవా? సుందరీ! ఇంత వేకువనే ఎక్కడికి ఊరేగినావే? ఓహొ!- ఆ తథాగతుని దర్శించి తరించావా? తల్లీ - అబ్బా! - (అని బాధతో ఆగిపోతుంది)

**సుందరి :** (దిగులుగా) అక్కా! మాలినీ! నీవా బోధిసత్త్వుని అపార్థం చేసుకొన్నావే! వదనంలో చంద్ర దరహాసం, కనుకొసలందు అపార శాంతి సుధాప్రవాహము వెల్లివిరిసే, ఆ కరుణామయమూర్తి, గౌతముని, కనులారా తిలకించిన చాలుచే ఈ జన్మ తరించడానికి. ఈ ప్రాపంచికమైన సర్వదుఃఖ సముద్రాల ఈదడానికి, ఆ భగవానుని పాదపద్మాలే శరణ్యాం తల్లీ, నామాట నమ్మవే! మాలినీ!-

**మాలిని :** (కోపంతో బాధగా) ఆడువే! - నీ అధిక ప్రసంగం. ఆ మహామాయలు మారి, తాను పరివ్రాజకుడై నదేగాక, నందమహారాజాను, ముండిత శిరస్కుని, భిక్షుకునిగా జేసి, రాజ్యపద భ్రష్టునిగా జేయలేదా? సౌందర్యమహా రాజ్ఞీ ప్రణయ నందనవనం సమూలాంగా నాశనం చేయలేదా? ఆ మహారాణి లేత గుండెల్లో మండు నిప్పులు క్రుమ్మరించి, వారి ప్రణయాన్ని భస్మీభూతం చేయలేదా? పతీ వియోగానలంతో దగ్ధమై పోతుంది ఆ మహాసాధ్వి? -

గాఢానుగాఢంగా ప్రేమించుకొన్న ఆ రాజదంపతులను విడదీయడమేనా మీ తథాగతుని బోధామృత సారం? రాజ్యం ఏలెడిరాజును సన్యాసిని జేసి, ఈ నందరాజ్య మరాజకమై, అల్లకల్లోలంగా చేయటమేనా మీ బౌద్ధ మత ప్రచార పరమధ్యేయం? ఏమే! సుందరీ? ఉలుకవు. పలుకవు? - అబ్బా! బాధ - దాహం - కాస్త మంచినీళ్ళయినా ఇయ్యవే తల్లీ!-

**సుందరి :** (నొచ్చుకుని, మాలినికి నీళ్ళు త్రాగించి, నిట్టూర్చి) అక్కా! ఆవేశంలో ఉన్నావు. కోపంతో మండిపడుతున్నావు. వ్యాధితో శరీరం, మనోవ్యథతో నీ గుండెలు మథన పడిపోతున్నాయి. అయినా మాలినీ! నీ కళ్ళకు క్రమ్మిన అహంకారపు పొరలింకా వైదొలగలేదు. నీ దురభిమానమే, కామెర్లుగా మారి, నీకు లోకమంతా పచ్చగా, దుష్టంగా కనిపిస్తున్నది. సర్వజగద్రక్షకుడు కరుణామూర్తి అయిన గౌతముడు నీకొక విప్లవవాది వలె కన్పిస్తున్నాడు. నిజమే మరి! మూఢ దురాచారాలకు అంధవైదిక కర్మానుష్ఠానికీ, ఆయన ఎదురు తిరిగాడు గదా! అందుకే ఛాందసులకు, అజ్ఞానులకు తథాగతు డొక మహా విప్లవమూర్తి! అదిసరే! నేడేమి నీవింతగా నీరసించిపోయావు. రాజవైద్యు లిచ్చిన మాత్రలు రాత్రి సరిగ్గా పాలతో కలిపి వేసుకున్నావా? పథ్యం తప్పలేదుగదా?-

**మాలిని :** (నిట్టూర్చి) ఆపు! తల్లీ! ఆపు నీ సొద. అయినా ఏదో తెలియని పాడు రోగము నన్నాక్రమించినదే. రాజవైద్యులకే అంతు పట్టటం లేదు. మందులన్నీ నిష్ఫలాలుగా ఉన్నవి. ఇదంతా స్వయంకృతాపరాధమే ననుకో! ఆనాడు నందమహారాజు గారిపై కక్షతో, నృత్యగానాలను విస్మరించి, విచ్చలవిడిగా కామప్రవృత్తితో సంచరించినాను. ఉన్నత రాజ వంశీయులందరిని, చేరదీసి, నా వయ్యారంతో, నా తళుకు బెళుకులతో, వశంచేసుకొని, నా దాసానుదాసులుగా జేసాను. ధన, కనక, రత్నరాసులను కొల్లలుగా ఆర్జించాను. అష్టైశ్వర్యాలు అనుభవించాను. ఇహలోక సుఖాలలో

తలమున్కలైనాను. నా కొంగు తాకిడికి కరగని, నా క్రీగంటి చూపులకు బెణకని విటుడీ రాజ్యంలో లేకుండా చేసాను సుందరీ! ఈ నంద సామ్రాజ్యమంతా నా సౌందర్యారాధనలో, నా కామకళా ప్రవృత్తిలో వెఱ్ఱెత్తి పోయేలా చేసాను. ప్చ్ (అని నిట్టూర్చి) ఏమి లాభం! చివరకు నాకు మిగిలిందేమిటి? - అబ్బా! - (అని మూల్గి ఆగిపోతుంది).

సుందరి : (ఆతృతగా) ఏమి మిగిలిందే అక్కా! నీకు! ఏం జరిగింది? -

మాలిని : (దిగులుగా) జరగకూడనిదే జరిగింది తల్లీ! విషయ వాంఛాలోలనైన నాకు ఈ భయంకర విషవ్యాధి సంక్రమించింది. నా అతిలోక సౌందర్యం చర్మ దగ్ధమైంది. నా హొయలు బట్టబయలైంది. నా విఱ్ఱవీగిన మేని సొగసు అద్దంలో వికృత స్వరూపంగా నిలిచింది. ఈ శరీర వ్యాధితో, ఈ భరింపరాని మనోవ్యథతో కృంగి కృశించి, నీరసించాను. ధన ధాన్యాలు అన్నీ ఉన్నా, సుఖసంతోషాలు లేక అలమటిస్తున్నాను. ఒకప్పుడు, అందరిచే, తుదకు నందమహారాజుచే ఆరాధింపబడి, మన్నన అందిన ఈ రాజనర్తకి ఈ సౌందర్యాధి దేవత, ఈ మాలిని, - ఈనాడు - అబ్బా! - (అని ఆగుతుంది).

సుందరి : (దిగులుగా) ఏమైందే అక్కా! నీకేమయిందే?-

మాలిని : (బాధగా మూల్గి) ఊ! - నేను ఈనాడు, నిక్రృష్టనై, బహిష్కృతనై అందరిచేతా ఏవగింపబడి, నిరసింపబడి, ఇలా దూరంగా, ఒంటరిగా మంచాన పడి, దుఃఖంతో, అవమానంతో, ఆవేదనతో, కృంగి కృశిస్తున్నాను. సుందరీ! నేను క్షణక్షణం దిగజారి పోతున్నాను. శారీరకంగా, మానసికంగా - అబ్బా! సుందరీ! నేనీ యమయాతన భరింపలేను, నాకేదైనా త్వరలో విముక్తి కలిగించే దారి చూపించవే తల్లీ! ఈ గుండెల్లో ఆరని మంటలు. ఈ శోకదావాగ్నికి నేను తాళలేను. ఓర్వలేను. - అబ్బా! (అని దగ్గి,

అలసి వ్రాలిపోతుంది ప్రక్కపై ).

**సుందరి :** (ఆత్రంగా వచ్చి ప్రక్కనే కూర్చొని గుండెపై చెయ్యివేసి, నిమిరి) చూడవే! అక్కా! నీ వెంతగా చిక్కిపోయావే మరి! మదనుని పూబంతుల్లా ఉండే నీ పయోధరాలు, వాడి వత్తలై గుండెలకు హత్తుకొని పోయాయి. అయినా నీ మనోవ్యాధికి మందు లేదా? మాలినీ! నీవు కోపగించుకోనంటే నీకొక మాట చెప్తాను. వింటావా? -

**మాలిని :** (అయిష్టంగా) ఆ! - ఏమో! - ఒక్కటి మాత్రం గుర్తుంచుకో! ఆ బుద్ధుని ప్రసక్తి మాత్రం నావద్ద తేవద్దు. తెలిసిందా! - అబ్బా! - ఊ! -

**సుందరి :** (దిగులుగా నవ్వి) అలాగే ! పోనీ మన సౌందర్య మహారాణీ వారి విషయం చెప్పనా మరి !-

**మాలిని :** (ఆయాసపడుతూ లేచి కూర్చొని) ఆ! చెప్పవే! చెప్పు! ఏమైందా మహాసాధ్వికి ! -

**సుందరి :** (నిట్టూర్చి) ఏమికాలేదే? ఆ మహాతల్లి కూడా నీలాగే, మొట్టమొదట తథాగతుని కసిదీరా తిట్టి, ఏవగించుకొని, నిరాశ జెంది, కృశించింది. పతి వియోగభారంలోకొన్నాళ్ళు, కానీ పరమదయాళువైన బుద్ధభగవానుని కృపవలన ఆమెలో తిరిగి మార్పు, చైతన్యం వచ్చాయి - (అని ఆగింది)

**మాలిని :** (ఆతృతగా) ఏమిటా మార్పు? ఏమా చైతన్యం? -

**సుందరి :** (గంభీర స్వరంతో) ఆమెలో మహత్తరమైన మార్పు వచ్చింది. ఈ లౌకిక సామ్రాజ్య భోగాలకన్న, ఆ అలౌకిక సార్వభౌమత్వమే, వందునికి సరియైన దని ఆమె గుర్తించినది. అందుకే ఆమె పశ్చాత్తప్తయై, బుద్ధునికి పాదాభివందనం చేసి, ఆయన శరణు గోరింది. శరణాగత వత్సలుడైన తథాగతు డామెను మన్నించి,

చేరదీసాడు. నేడు, బుద్ధభగవానుని సేవలలో, పరిచర్యలలో ఆమె పునీతయై, భగవానుని ప్రియ శిష్యురాలైంది. తెలుసా? మాలినీ! త్రికరణ శుద్ధిగా, సర్వసంగ పరిత్యాగులై తథాగతుల సేవించిన వారికి, ఏ బాధలూ ఉండవనీ, అదే పరమార్థమనీ - మహారాణిగారు - కాదు! కాదు! సౌందర్యభిక్షుకి - నాకీ వేకువనే సెలవిచ్చారు మాలినీ! - ఇదీ కథ!-

**మాలిని** : (దిగ్గున లేచి, ఉలిక్కిపడి) సుందరీ! ఇది నిజమా! లేక నీవు అల్లిన కట్టుకథా? అన్నట్లు నీవు కవయిత్రివి, గేయ రచయిత్రివి కదూ! ఆ నాడు నీ ఊహాగానంతో, కవితాప్రతిభతో, తేనెలొలికే పాటలల్లి ప్రజలకు మత్తెక్కించావు. నీ గాన మాధుర్యానికీ, నీ కవితా వైదుష్యానికీ ముగ్ధులైన సభికులను ఆ నాడు పరవశింపజేసావు. కానీ, ఈనాడు, ఆ పప్పులేవీ నా వద్ద ఉడుకవు! తెలుసా? నిజం చెప్పుమరి - (అని గద్దిస్తుంది).

**సుందరి** : (సంతోషంగా నిట్టూర్చి) అక్కా! నీ ముందు ఇంద్రజాలం చేసేటంతటి మాంత్రికురాలినా నేను? అయినా నీతో నేను ఎన్నడైనా అపహాస్యం ఆడానా? ఒకనాడు అపరరతీదేవిలా, అతిలోక సౌందర్యవతిలా వెలిగిపోయిన రాజనర్తకివి నీవు. కానీ, ఈనాడు అస్థిపంజరంలా నీవుంటే, నాకడుపు తరుక్కు పోతుంది. ఆనాటి మాలినేనా నువ్వు! నా కళ్ళను నేనే నమ్మలేకపోతున్నాను. నీ తోడు మాలినీ! నే నబద్ధమాడటం లేదు. నిజమే చెప్తున్నాను. తల్లీ! నన్ను నమ్ము!-

**మాలిని** : (దిగ్భ్రాంతిజెంది) ఆ!- అవునా! ఇది నిజమేనా సుందరీ! తథాగతు లంతటి కరుణా సముద్రులా? అంతటి మహిమాన్వితులా? అయ్యో! నేనెంత పాపిని. చెంతనున్న పెన్నిధిని జారవిడిచిన దురదృష్టురాలిని. మాయలోపడి, ఈ నా తుచ్ఛమైన సౌందర్యం, ఈ నా అల్పనృత్యగాన కళా వైభవం, ఈ నా సిరిసంపదలు -

అంతా నిత్యమని, అనశ్వరమని నమ్మి మోసపోయానే చెల్లీ! సర్వ నాశనమయ్యాను గదే! ఓ శాక్య ప్రభూ! ఈ దీనురాలికి, ఈ నిర్భాగ్యురాలికి విముక్తి లేదా? ప్రభూ!- (అని వలవలా ఏడుస్తుంది)

**సుందరి** : (కరుణతో మాలినిని దగ్గరకు తీసుకొని) అక్కా! మాలినీ! నీవంత నిరాశ జెందకు, బుద్ధభగవానులకు నీ విషయం అంతా తెలుసు. వారికి నీ పైననే అత్యాదరము. నీ విషయమై సౌందర్యమహారాణియు, నందుల వారును తథాగతులకు ముందే విన్నవించుకొన్నారు. కానీ, గురుదేవులు, నీలో, ఈ పరిణామానికి ఈ మార్పుకే ఎదురు చూస్తున్నారు. నేనూ, ఈ శుభ సమయానికే వేచి ఉన్నాను. నీలో ఇన్నాళ్ళకి ఈ పరివర్తన కలిగింది. అదే పదివేలు తల్లీ! పద, ఇప్పటికే కాలాతీతమైనది. అయినా లోకకళ్యాణం కోసం, ప్రజాభ్యుదయం కోసం వెచ్చించ వలసిన, ఈ తనువు ఇలా వ్యాధులతో నాశనమై, కృశించి పోకూడదు. దీపముండగానే, ఇల్లు చక్కబెట్టుకుందాం పద. మాలినీ!-

**మాలిని** : (దిగులుగా నిట్టూర్చి) చెల్లీ! నా కళ్ళు తెరిపించావమ్మా! ఈ కొనఊపిరితోనైనా తథాగతులను దర్శించి, ఆయనకు పాదాభివందనం చేసి తరిస్తాను. అయినా ఈ పాపిష్టిదాని అపవిత్రస్పర్శతో, పునీతములైన స్వామి చరణాలు మైల పడుతాయేమో? -

సుందరి : (నవ్వి) పిచ్చిదానా! మన వంటి అభాగ్యులను, ఎందరినో దరిజేర్చి, రక్షించిన ఆ గౌతమస్వామి, లోకకల్యాణార్థమై జన్మించిన మహనీయుడమ్మా! అయినా నీకా సందేహ మెందుకు పద కదులు త్వరగా! -

**మాలిని** : (నిట్టూర్చి) ఆ! పోదాం పదవే. స్వామి వారి సన్నిధికి (అని ఇద్దరూ కదిలిపోతారు)

## – (విరామ సంగీతం) –

(మాలిని, సుందరి ఊరి వెలుపల ఉద్యానవనంలో గౌతముని రాకకై నిరీక్షిస్తుంటారు. గౌతముడి రాక ఆలస్యమౌతుంది)

**మాలిని :** (దిగులుగా) సుందరీ! తథాగతులింకా రాలేదేమే? నా మనసేదో కీడును శంకిస్తుంది. సంకోచం, భయం, అవమానం నన్ను ముప్పిరి గొన్నాయి. అయినా ఈపాటలీ పుత్ర వీథులలో నాకెంత అవమానం జరిగిందే! ఈ శరీర మస్థిపంజరమైనను, ఈ కన్నులు కాంతి బాసి లొత్తలైనను, ఈ రాజనర్తకి వారి దృష్టిలో, ఇంకను విలాస వస్తువుగా కన్పిస్తున్నదా? ఛీ!ఛీ! ఈ పాడు కాయ మెంత హేయమై పోయినది గదా! సుందరీ! నేనీ నికృష్టపు బ్రతుకు బ్రతికి ఏమి ప్రయోజనమే? నాకిక మరణమే శరణ్యం. – (అని ఏడుస్తుంది).

**సుందరి :** (అనునయంగా) అక్కా! నీవు మళ్ళీ సందేహావస్థలో, లేనిపోని భయాలతో ఉక్కిరి బిక్కిరౌతున్నావు. అజ్ఞానులు, మూర్ఖులు అయిన ఈ పిచ్చి ప్రజల మాటలు నీవు లెక్కచేయవద్దమ్మా! అయినా ఈ మానావమానాలు తుచ్ఛమైన ఈ తనువు నంటునే గాని, విశుద్ధమైన, నీ అంతరాత్మ నంటవుగదా! పశ్చాత్తాపవహ్నిచే పరిశుద్ధమైన నీ ఆత్మ, శుచియై, స్వామి వారి దర్శనమునకు సుముఖముగా నున్నది. ఆయన నీ యెడల మిక్కిలి ప్రసన్నుడై నాడమ్మా! నీకే భయమక్కరలేదు. తల్లీ! నా మాటవిని ఊరడిల్లుము. ఆ! అదిగో బుద్ధభగవానులిటే వస్తున్నారు చూడవే!–

**మాలిని :** (తలపైకెత్తిచూచి) ఆహా! ఏమి తేజస్సు! ఏమి వర్చస్సు! ఏమి శాంతస్వరూపం. ఎంత కరుణామయస్వరూపం తథాగతుల వారిది. ఆ! సుందరీ! స్వామి వారి కుడివైపున వచ్చు, ఆ ఆజాను బాహుడు, ఆ సుందరాంగుడు, అతి కఠోర నియముడుగా దోచు ఆమహానుభావు డెవరే? –

**సుందరి :** (సంతోషంతో) అహెూ! నాగార్జునాచార్యులా! అక్కా! నే డెంత సుదినమే! తథాగతులవారి ప్రియశిష్యులు, పరమ పూజ్యులైన నాగార్జునుల వారును మనకీ నాడు లభించినారు పదవమ్మా! పద! సంశయములన్నీ వదలి, స్వామి వారికి పాదాభివందనం చేసి తరిస్తాం పదవే మాలినీ! (అని వెళ్తుంది)

**మాలిని :** (నిట్టూర్చి) అవునే! సుందరీ! ఈ పతితకు, స్వామి చరణాభివందనమే శరణ్యం పద, బుద్ధం శరణం గచ్ఛామి (అని కదులుతుంది)

– .. –

## తృతీయాంకము

(బుద్ధుడు, నాగార్జునుడు, నందుడు, సౌందర్య, మిగిలిన శిష్యులు – అందరూ నడిచి వస్తుంటారు. వారి కెదురుగా వెళ్ళి, మాలినీ, సుందరులు, సాష్టాంగపడి తథాగతునికి పాదాభివందనం చేస్తారు. మాలిని గౌతముని పాదముల నంటి విడువక, విలపిస్తూ, ఉన్మత్తవలె తలపై కెత్తి, స్వామిని తదేక దీక్షతో చూస్తుంటుంది.)

**బుద్ధుడు :** (వంగి, ఆమె శిరముపై చేయి వేసి, నిమిరి) లే! తల్లీ! లేవమ్మా! మాలినీ! దయనీయమైన నీ గాథ విని మా హృదయం ఆర్ద్రమైంది. మా కన్నులు చెమర్చాయి. నీ ఆవేదన చూస్తుంటే – (అని ఆగాడు)

(మాలిని మారుమాటాడక, పిచ్చిగా తలపై కెత్తి, బుద్ధునే చూస్తుంటుంది)

**సుందరి :** (నమస్కరించి లేచి)

**శా** నా యీ, వెచ్చెలి పిచ్చిదంద్రు ప్రభువా! నానాఘభావచ్ఛటా
హేయమ్మైన జగమ్మునై, బ్రతుకునన్ హ్రీభావ శూన్యమ్మునై
కాయమ్మెల్లను కామపీడిత విటః కాసార పంకమ్మునై
నా, యీ, వెచ్చెలి మ్రోడువోలె నిలిచెన్, వారిజగ్రద్రక్షకా! 3

**బుద్ధుడు:** (మెల్లగా నవ్వి) సుందరీ! అంధులకు, అజ్ఞానులకు నీ చెలి ప్రోడుగా తోచవచ్చును. ఆత్మ చిగిర్చి, అలౌకిక జ్ఞాన వసంతారామంలో పుష్పింపనున్న నీ చెలి, మాలిని, మాకు వసంతాగమనం వలెనే తోస్తుంది.

**మాలిని :** (పిచ్చిగానవ్వి పైటజారి, నగ్న వక్షోజాలతో పైకి చూస్తూ)అయ్యో! తథాగతా! చూడండి ప్రభూ! ఎండిన నా గుండెలు, వ్రేలాడుతూ లొత్తలైన నా యీ వక్షోజాలను చూడండి ప్రభూ! సౌందర్యరస నిధానమైన నేను, సకల కళాభినేత్రినైన నేను, ఈనాడు అసౌందర్యను. కళాశూన్యను. నిస్తేజను. ప్రభూ! ఈ పాపిని క్షమించి, రక్షించు. బుద్ధభగవాన్! ఈ దీనురాలికి ఇంక నిష్కృతి కల్పించు. (అని ఏడుస్తూ తథాగతుని పాదాలపై వ్రాలి పోతుంది.)

**వాగార్జునుడు :**(దిగులుగా) ఆచార్యా! ఈ దీనురాలికి విముక్తి లేదా? ఈ కరుణామయి కన్నీటి సెలయేళ్ళకు ఆనకట్టలు లేవా? ఈ దుఃఖ సముద్ర ఘోష కంతం లేదా? ప్రభూ! ఈమె దుఃస్థితి చూస్తుంటే నాగుండె తరుక్కు పోతుంది. అయినా ఈ ఉన్మత్తురాలిని చూస్తుంటే – (అని డగ్గుత్తికతో ఆగిపోతాడు).

**సుందరి :** (దిగులుగా నవ్వి) : నాగార్జునాచార్యా! – మీకింకా ఈ దీనురాలిపై సందేహం పోలేదా? (అని బుద్ధుని వైపు తిరిగి)

తథాగతా!–

**ఉ॥ నెయ్యపు తేనెలూరు రమణీయ దృగంత కృపాసముద్ర! నా**
**తొయ్యలి, నేను, మీ చరణతోయజ మందున, భక్తి భావమం**
**దియ్యగ, నగ్నరూప సముదీర్ణత, సొగిలి, మ్రొక్కినాము, మా**
**నయ్యెద జాఱునంచను ము భావము లేదు గదయ్య! దైవమా! 4**

అయినా, ప్రభూ! ఈ మూఢలోకం, దీనురాలైన మాచెలియపై ఎంత నిర్దయగా, ఎంత కఠినంగా ప్రవర్తించిందో, ఎంత ఈసడించి,

అవమానాల పాలుజేసిందో, తమకు తెలియదా గౌతమస్వామీ!

ఆ.వె॥ పైట సర్ది, వగలు పడతి జూపిననాడు,
పైట మాటు తనువు భ్రమసినారు! – – కానీ, నేడో –
పైట జారి చెలియ, ప్రభుని పాదమ్ముల
నగ్నమూర్తి యైన నవ్వినారు! – 5

బుద్ధుడు : (నిట్టూర్చి, నవ్వుతూ) అవును సుందరీ! ఈలోకపు పోకడలే, అతి విచిత్రములు గదా!–

ఉ॥ మానము, సిగ్గు, మీ రనలు మానితిరంచును, దూరుచుంద్రు, బే
మానులు లోకమందు, అవమానము, సిగ్గును, చర్మదఘ్నమై,
మానము లాత్మనంటెడి ప్రమాదము లేయెడలేదు, – మీదు, స
న్మానము, మా హృదంతర సమన్వయ రమ్య వికాసరోచియౌ! 6

మాలిని : (పిచ్చి, పిచ్చిగా నవ్వుతూ) మీరన్నది ఒక విధంగా నిజమే భగవాన్!

ఉ॥ పైటను సర్ది వాల్జడను బంగరు బంతుల పూలుజుట్టి, మో
మోటముతోడ, నాట్యరస ముగ్ధమనోహర శిల్పమూర్తినై,
పాటలిపుత్ర వీథుల, త్రపాభరుసౌచు, త్వదీయభిక్షుకా
వాటిని జేరబోవగ, నివారణసేతురు, – కామచింతనన్!

అదీగాక, తథాగతా! –

శా॥ మాలో యౌవన మున్నవాళ్ళు ప్రభువా! మాయందముల్ జుట్టికే
ళీలోలాత్ములువైరి, కామజలధీ లీలామహా పూరుషుల్!
మాలో యౌవన మంతరింపగనె, మ్మా, మ్మా, దేహశైథిల్య, హే
ళ్యాలావణ్యము లస్థిపంజరములై, హాస్యాస్పదం బయ్యెడిన్! 8

అయినా నా అహంకారానికి, నా అజ్ఞానానికి, నా అవజ్ఞతకు, నా కామాంధతకు అంతులేదు గదా ప్రభూ!

ఉ॥ చన్నులు పూవుబంతులని, చంపక గంధ మనోహరమ్ము, సం
ఛన్న మనోజ్ఞ మంచు, సరసజ్ఞులు బల్కఁగ, పొంగి పోతి, నా
చెన్నుదరింగి, లొత్తలయి, చిక్కిన, జారిన, చన్నుదోయి, నీ
మన్నన నంది, – పాదకుసుమమ్ముగ వ్రాలె నహా! తథాగతా!

బుద్ధుడు : (ఆమె పశ్చాత్తాపానికి, ఆమె హృదయవేదనకు కరగిపోయి, దయతో) తల్లీ! మాలినీ, నీ ఆవేదన మాకు నిజంగా ఆశ్చర్యం కలిగిస్తుంది. అయినా, హృదయదఘ్నమైన నీ పశ్చాత్తాపమే నిన్ను రక్షిస్తుంది. పులుకడిగిన ముత్యంలా, ఆత్మసౌందర్యంతో ప్రకాశిస్తున్నావు నీవు. మాలినీ! మాకదే పరమసంతోషం. నా యీ బౌద్ధ మత ప్రచారం, కుల, వర్గాలకు అతీతమైనది. స్త్రీ, పురుష-లింగ విభేదం లేనిది. కరుణారస పూరితమై, మానవతా భావ పరిపూర్ణమైన, మహత్తర జీవన మార్గమే నా బౌద్ధమతసారం. మూఢాచారాలకు, అజ్ఞానావృతమైన వైదిక కర్మాచరణానికి దూరమైన, అచంచలమైన, అనన్యమైన, సత్యాన్వేషణే, శాంతి పథగవేషణే, అహింసా పథమే ఈ బౌద్ధ పథధ్యేయం! మానవ సేవే మాధవ సేవ యని త్రికరణ శుద్ధిగా తలంచి చేసే నిష్కామకర్మయే నా మతమున నిర్వాణపథము. అదే సత్పథము. ముక్తికాంతా మనోరథము. అందుకే, మాలినీ! నీకు బౌద్ధబిక్ష నిచ్చి అనుగ్రహిస్తానులే! తల్లీ! లే!

మాలిని : (ఆనందంతో) మహాప్రసాదం! తథాగతా! తమరి కమగౌనల వెల్లి విరిసే అపార కరుణారస ప్రవాహమే, ఈ దీనురాలికి నిర్వాణమార్గము. నేను నిజంగా ధన్యురాలిని గురుదేవా! –

ఉ॥ మానము మాన మంచని, అమానుషవృత్తి జరించినాను, న
న్మానము లర్థశూన్యమని, మంగళరూప! త్వదీయ సేవయే
మానితమంచు, నా హృదయ మందిర మందున, నీ పదాబ్జసం
ధానము నిత్యమంచును, తథాగత! నమ్మి భజింతు నగ్నతన్ !10

ఇదుగో, ఇటు చూడండి ప్రభూ! మీ కారుణ్యంతో

**శా॥ నా,యీ, చన్నులు బోధిసత్త్వ విభు నానందమ్ములో దేల్చుసు**
**శ్రేయోభావ, పునీత చూతఫలముల్, శ్రీ మూర్తి కారుణ్యముల్!**
**నా,యీ, కన్నులు శాక్యవంశజలధిన్, నవ్యేందు బింబచ్ఛటా**
**ప్రేయోభావ, వికాస రమ్యనయన ప్రీత్యర్ధ పూజావిధుల్! 11**

నాగార్జునుడు ః(సంతోషంతో) అవునమ్మా! మాలినీ! ఈదేహాభిమానాలన్నీ వదలి, సర్వసంగ పరిత్యాగవయి, ఆత్మజ్ఞానంతో వెలిగే మహాజ్యోతివి నీవు. నీకీ మానావమానాలు, ఈ హేళనలు, ఈ నగ్నతమా సౌందర్యలాలసతలు - అన్నీ క్షుద్రంగా, నీచంగా తోస్తాయి. అయినా, పరిశుద్ధమనస్కవైన, నిన్ను ఈ గ్రుడ్డిలోకం ఎంతగా అపార్థం చేసుకొని పరిహసించిందే తల్లీ! -

**ఉ॥ పయ్యెద జారి నంతన, సభాస్థలి, కామప్రకోపదీప్త నం**
**దియ్యగ, సర్వసభ్యజన మెల్లను పొంగులువోవు – మానమం**
**దియ్యగ, నే కులాంగనయు నేగతి యౌనను చింతలేదు, మీ**
**పయ్యెద వెన్క – స్తన్యమధు భార పయోధర మేలజూడరో? –12**

(నిట్టూర్చి) చెల్లీ! అదంతా ఒక చెడ్డకలగా భావించాలి. మాలినీ! నీవు, వివస్త్రవు, ఉన్మత్తవు, నగ్న వక్షోజవు – అని ఎవరన్నారమ్మా? ఈ బుద్ధభగవానుని పాదరజంతో పునీతవై. నీ మాలిన్యం, నీ పాపపంకిలం, అంతా హరించుకొనిపోయి, నీవీ నాడు అలౌకిక, మానవభావనా తీతమైన సౌందర్యలహరిలా, జ్ఞానరోచిస్సులా ప్రకాశిస్తున్నావు. నీవొక నిర్మలిన తేజోమూర్తివి. తల్లీ! నిన్ను ఇలా చూస్తుంటే మాలో అతి పవిత్రమైన మాతృభావమే స్ఫురిస్తుంది. అయినా, -

**ఉ॥ చన్నులు పైటమాటున ప్రసన్నముగాక, నిగూఢమైన, సం**
**ఛన్నమనోజ్ఞస్వప్నములు సాగును, కామ వివింది తాత్మకున్,**
**చన్నులు మీకు వోలె, ప్రభుసన్నిధి, భక్తి మరంద రమ్యని**
**ష్పన్నము, నగ్నమైన, మదిబాపపు చింతలకేలచోటగున్? 13**

**బుద్ధుడు:** (చిరునవ్వుతో) నాయనా! నాగార్జునా! నీవన్నది పరమ సత్యము. మాలినీ, సుందరులీ నాడు నాకత్యంత ప్రీతిపాత్రులైన శిష్యురాండ్రు. తొలుతనే, హృదయ సంస్కారముచేత, సుందరి నా భక్తురాలైనది. తొలుత నన్నేవగించుకొన్నను. పరిస్థితులు విషమించి, వేదనాగ్నిలో భస్మీభూతయై, పశ్చాత్తప్తయై, తుట్టతుదకు విశుద్ధాత్మయైన మాలిని నాకింకను పరమాప్తురాలు. అహో! శిష్యా! ఈ నాడు నాకెంతో ఆనందముగా నున్నదయ్యా! ఈ ఇద్దరినీ చూస్తుంటే –

**నందుడు:** (నమస్కరించి) అవును! గౌతమదేవా! తమ అపారమైన కరుణా కటాక్షంతో, లౌకిక సౌందర్యాన్ని, భోగలాలసతను వదిలి, కుబుసం విడిచిన నాగినిలా, మాలిని ఈనాడు, నగ్నరూపయైనా, మహత్తరమైన ఆత్మసౌందర్యంతో, బౌద్ధ భిక్షుకియై వెలిగిపోతుంది. ఇదంతా మీ చలువ తథాగతా! (అని నాగార్జునుని వైపు తిరిగి)

నాగార్జునాచార్యా! ఈ మాలినిని నా పూర్వాశ్రమంలో, రాజనర్తకిగా, నేనెఱుంగుదును. కానీ ఈమెలో నేడెంత మార్పు? ఎంత విపర్యయం?

**ఉ॥ కన్నులు నవ్వె నాఁడు – కలకంఠికి, నవ్యవయోవిలాసికిన్ –**
**కన్నుల క్రింద పీఁగనక్క, కామ విలాస కలాపపాళిపై!**
**కన్నులు నవ్వె నేఁడు – పులకాంకురమైన తమూ విలాసముల్–**
**ఛిన్నములైన, సత్కరుణ జిందెడు, శాక్యమునీంద్రు మౌనముల్! 14**

**నాగార్జునుడు:** (నవ్వి) అవునయ్యా! నందభిక్షుకా! ఇటుచూడు! మాలినీ, సుందరులీ నాడు బుద్ధభగవానునికి, మనసా వాచా కర్మణా శుద్ధులై, వినమ్రులై పాదాభివందనం చేస్తున్నారు. నగ్నలైనా తేజోమూర్తులుగా విరాజిల్లుతున్నారు. అటు చూడవయ్యా!

నందా! ఎంత కన్నుల పండువగా ఉన్నదీ దృశ్యం!

ఉ॥ సోయగమొల్ల, నగ్నతను సుందర కాంతుల వెల్గువై చనన్
దోయిలి యొగ్గిరీ, వికచతోయజ నేత్రలు – బుద్ధదేవు పా
దాయతపద్మ పీఠి, నరుదౌ స్తనయుగ్మ సమార్చనమ్మునన్ !
ఈ యువతీ ద్వయమ్ము, మదికెక్కిన భక్తి రసావతారులై! 15
అహో! తథాగతా! శరణు! శరణు!

(అందరూ చేతులెత్తి నమస్కరించి, 'బుద్ధం శరణం గచ్ఛామి!' అని అంటారు)

– .. –

## (విరామ సంగీతం)

## భరతవాక్యం (EPILOGUE)

నాగార్జునుడు :

(బిగ్గరగా నిట్టూర్చి) నాయనా! ఆనందవర్ధనా! తల్లీ! శ్రమణికా! అదమ్మా! ఈ మహత్తర శిల్పమూర్తుల విషాద రమణీయగాథ! తథాగతుల కరుణా వరుణాలయ మృదుమధుర తరంగాల మహత్త్వానికి వీరిరువురే తార్కాణం. ఆ నాడు బుద్ధ భగవానుని పదసన్నిధిని, ఈ యువతులిద్దఱు నగ్నమూర్తులై ఒడలు తెలియని, భక్తి పారవశ్యంతో, విశుద్ధాత్మలతో, ఈలోక మెఱుగని ఉన్మత్తలై, తమ కుచద్వంద్వాలను, స్వామి చరణాలపై పూజా కుసుమాలుగా సమర్పించి – అపూర్వ పాదాభివందనం, అనన్య వినమ్రప్రణామం – చేసిన ఆ మనోజ్ఞదృశ్యం నాకి నాటికీ కన్నుల గట్టినట్లుంది. ఆనందవర్ధనా! స్వామివారి దయానిరతికీ కథ పరాకాష్ఠ! అయినా అది స్మృతిపథంలో మరపురాని, ఒక మనోహర మధుర ఘట్టమమ్మా! శ్రమణికా!

శ్రమణిక : (కన్నులొత్తుకొని, నిట్టూర్చి) అవును! గురుదేవా! మీ కథాకథన నైపుణితో మాకి అపూర్వ శిల్పకళా ఖండాలు శ్రవ్యకావ్యాలుగా, దృశ్యరూపాలుగా తోస్తున్నవి. అయినా, మీ మనస్సంకల్పానికి, సరియైన రూపు రేఖలు దిద్ది, కేవల ఊహాప్రతిభచే, సజీవ రూప లావణ్యాలు సమకూర్చి, ఆ మనోజ్ఞ మూర్తులను, ఆ దృశ్యాన్ని మన కళ్ళముందు కట్టినట్లు, నిర్మించిన, – ఆ మహాంధ్ర శిల్పి – ఎవడోగాని, వాని కివే నా మనఃపూర్వక నమోవాకములు !

ఉ॥ శిల్పి యెవండొ? మీ హృదయ చిహ్నమనోహర భావరేఖ – సం
కల్ప మనోరథుండగుచు, కన్నుల గట్టెడినట్లు, భావనా
తల్పమునందు, శాశ్వత విధంబుననిల్పెను – పాలఆయి,నా
శిల్పకళా మహోన్నతికి, శీర్షము వంచె, రపాంధ్రలోకమున్! 16

ఆనందవర్ధనుడు : (ఉప్పొంగి) నిజము! ఆచార్యా! నిజము! తమ ఈ సత్సంకల్పము రూపుకట్టి, శిల్ప శాస్త్రము, బౌద్ధారామములలో, తెలుగునాట, సజీవమై, పరాకాష్ఠ నందినది. గురుదేవా! ఈ అమరావతీ స్తూపకళాఖండము, ఈ బౌద్ధారామం, జగత్ప్రసిద్ధి నంది, బుద్ధ భగవానుని ధర్మ ప్రవచనాలకు, వారి మహత్తర ఆశయాలకు – ఈ స్తూపవిశేషాలు – మీ కృషి వలన, మీ అపూర్వ సంకల్పబలం వలన – శాశ్వత నిదర్శనాలుగా ఈ తెలుగునాట అజరామరంగా నిలిచిపోతాయి! ఇది ముమ్మాటికి నిజం! అహెూ! ఆంధ్రశిల్పీ! నీవెంత ధన్యుడైవ కళా స్రష్టవయ్యా! నీ కిదే నా జోహార్లు!

నాగార్జునుడు :

(ఆనందబాష్పాలతో) అవును! ఆనంద వర్ధనా! అవును. ఈ అపూర్వ బౌద్ధశిల్ప కళాఖండాలు, అజరామరమైన భారత శిల్పకళా ఖండాలు ! అయినా ఈ మాలినీ సుందరులెంత ధన్యులైనారోయీ? ఈనాడు! – నాడు పునీతలై ఆ తథాగతుని

ప్రోల – నేడు అపూర్వ శిల్పకళాసుందరులై. ఈ మహాంధ్రశిల్పి కళా నైపుణ్యాలప్రోల – అమరులైనారు గదా! రెండు విధాలా! చూపరులకు నేత్రపర్వమై, రసికులకు, భావుకులకు, రసానందానుభూతి కలిగించే మహత్తర శిల్పమూర్తులై నిలిచారీ కళారామంలో ! అహౌ –

ఉ॥ **పావన బౌద్ధధర్మ పరిపాలితు, శాక్యకులేంద్రు, యోజనా**
**భావుకుడైన సత్కృవి విభాసితులై చరితార్థులైరి! స్వ్**
**భావమనోజ్ఞ శిల్పగత భామినులైరి! పురాతనాంధ్ర సం**
**భావిత దివ్యశిల్ప మహహా! అమరావతిలో వెలింగెనున్!** 17

అమ్మా! శ్రమణికా! అటుచూడు! బుద్ధ భగవానుని కరుణారస దృగంత ప్రసారాలవలె, నంజ, యొఱువులు తగ్గి, నయనానందకరమై, రమణీయంగా కనిపిస్తుంది. జీవనది, కృష్ణవేణీ మృదుమధుర శీతల తరంగాలతో దోబూచులాడుతున్న ఈ చల్లని పిల్లగాలులు. ఈ మనోజ్ఞ సంధ్యా సమయంలో, మనలను తథాగతుల సాయంకాల పూజావిధుల కాహ్వానిస్తున్నాయి. వాయనా! ఆనందవర్ధనా! వేళయింది పద! సుస్నాతులమై, బుద్ధ దేవుని మన మనః పద్మాలతో సేవిస్తాం! పద పదవమ్మా! శ్రమణికా! పద! – (అని నిట్టూర్చి కదులుతాడు)

**శ్రమణిక/ఆనందవర్ధనుడు** (ఇరువురూ ఏకకంఠంగా) అలాగే వెళదాం ఆచార్యా! కృష్ణానదీ తీరానికి పదండి. (అని సాగిపోతారు అందరూ) (కృష్ణానదీ తరంగాల ఘలంఘలలు, బౌద్ధారామ ఘంటానినాదాలు దూరాన స్పష్టంగా వినిపిస్తాయి)

నేపథ్యంలో

చ॥ **శరణు! తథాగతా! శరణు! శ్రావణపూర్ణ శశాంకబింబమా!**
**శరణు! మహాప్రవక్త! మతశాక్యకులాంబుధి చంద్రబింబమా!**

శరణు! యశోధరా ప్రణయ చారుమహోజ్జ్వలభావ రూపమా!
శరణు! ప్రపంచ శోకగత శాపవినాశన! బుద్ధ దైవమా! 18

బుద్ధం శరణం గచ్ఛామి !
ధర్మం శరణం గచ్ఛామి !
సంఘం శరణం గచ్ఛామి !

... సమాప్తం ...

(సూచన : పద్యాలు 1 నుండి 18వరకు స్వీయ కవితలే)

☆ ☆ ☆

# అచ్చయిన ఇతర గ్రంథాలు

1. క్రాస్‌రోడ్స్ } వచన కవితలు
2. శిల్పాశ్రువులు } వచన కవితలు
3. వేదనా మధ్యాక్కరలు పద్యకావ్యం.

**అభిప్రాయాలు**

**1. క్రాస్‌రోడ్స్ :**

"మీ కవితా సంకలనం "క్రాస్‌రోడ్స్" ఆమూలాగ్రం చదివి ఆనందించాను. మీ భాషలో శబ్దాలు, మణిమాణిక్యాల్లా కాంతిమత్త్వం కలిగినవి. కవితా పంక్తిలో ఏ స్థానానికి యోగ్యమైన శబ్దాన్ని ఎన్నుకొని, ఆ స్థానంలో ప్రతిష్ఠించడం, రెండు శబ్దాల్ని కలిపి, సౌందర్యస్పృహ కలిగించే నాజూకు కళ – మీ కవితల్లో పుష్కలంగా కనిపించింది."

**శ్రీ గుంటూరి శేషేంద్రశర్మగారు** (24-11-95)

**2. వేదనా మధ్యాక్కరలు :**

"మీ మధ్యాక్కరలు చదివి ఆనందించాను. పుస్తకం కనిపించగానే, ఒక నవమల్లికలా హృదయాన్ని అయస్కాంతంలా – ఆకర్షిస్తుంది. ఒక వాక్యం ముట్టుకోగానే, అది కవిత్వబలంతో ఈడ్చుకుపోతుంది. అదే జరిగింది. మీ మధ్యాక్కరలు, మా గురువుగారైన కవి సమ్రాట్టు విశ్వనాథవారిని గుర్తుకు తెచ్చాయి. "

– **శ్రీ గుంటూరి శేషేంద్ర శర్మగారు** (7-8-96)

"స్థాలీపులాకన్యాయముగా భవత్కవితాగ్రంథమును వీక్షించి చాలా ఆనందించితిని. చక్కని భావపరంపరలతో నిండియున్నది. 222 పద్యము – "పునరుక్తి దోషమ్ము..." లోని భావము మృదుమధురము. 190 పద్యము – "వెక్కితలలు వేయుననురు..." లోని భావము, రూపకము చాలా చక్కగానున్నవి. 99 పద్యము -- "మమకారపాశమ్ము"..లో ప్రస్తుత పరిస్థితిని చక్కగా చెప్పి, "కవితాతపమ్ము"ద్వారా తమ ఆర్తిని వ్యక్తపరిచినారు. శ్రీరామచంద్రులవారికై. 207 పద్యము – " చదువులో, ప్రతిభలో..." ద్వారా మీవినయమును స్వామికి విన్నవించు వ్యాజముతో ప్రస్తుత సామాజిక విధానమును తెల్పియున్నారు. ఈ పద్యము నా మనస్సునెంతో ఆకర్షించినది. ఇదియే కాదు ఒక్కొక్కపద్యము ఒక్కొక్క "సుభాషితమే."

'మధ్యార్క' అనుపదము, 'మధ్యాక్కర' అను తద్భవమైనది. సూర్యుడుకూడా రామవంశంలో మధ్యవాడే. శ్రీరాముని, 'మధ్యార్క' వృత్తముతో కీర్తించి, సూర్య వంశమునకు చెందినవాడే అని స్ఫురింపచేయుచూ, మరింత ప్రకాశింప చేసినారు.

**శ్రీ ఎస్.టి.జి. శ్రీమన్నారాయణాచార్యులవారు**
సంస్కృత పండితులు, భద్రాచలం
(21-7-96, 26-7-96)